# శ్రీ ముకుందమాల

[కులశేఖర ప్రణీతము]





ప్రచురణ

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

# ముకుందమాల

## శ్రీ కులశేఖర ప్రణీతము

విద్యావారిధి

శ్రీమాన్ పండిత టి. లక్ష్మణాచార్యుల వారి

ఉపన్యాస సంగ్రహ టీకాతాత్పర్యసహితము

పరిష్కర్త, సంపాదకుడు

విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు

సప్తగిరి సంపాదక కార్యాలయము,

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.




ప్రచురణకర్త

శ్రీ డి.వి.ఎల్.ఎన్. మూర్తి, ఐ.ఏ.ఎస్.,

కార్యనిర్వహణాధికారి,

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

1993

**MUKUNDAMALA**

By

SRI KULASEKHARA

*Commentator:*

Vidyavaridhi Sriman T. Laksmanacharyulu

*Edited by:*

Sri Mudivarti Kondamacharyulu

*Cover Design by:*

Sri Giri Dutt


T.T.D. Religious Publications Series No. 398

First Edition : 1993

Copies: 5000





*Published by:*

Sri D.V.L.N. Murthy, I.A.S.,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati.





*Printed at:*

Tirumala Tirupati Devasthanams Press,
Tirupati - 517 507.

# ముందుమాట

విశిష్టాద్వైత మతవిశ్వాసాలకు బహుళవ్యాప్తిని కల్పించినవారు ఆళ్వారులు. పరమేశ్వర భక్తిరసప్రవాహంలో మునిగినవాడని ఆళ్వార్ శబ్దానికి అర్థం. దక్షిణదేశంలో జన్మించిన వీరంతా భగవంతుని దూతలని విజ్ఞుల మాట. అంతరంగపారిశుద్ధ్యం, సచ్ఛీలం లేనివారికి పరమాత్ముని అనుగ్రహం లభించడం అసాధ్యమని ఈ మహనీయుల నిశ్చితాభిప్రాయం.

ఆళ్వారులలో కులశేఖరు లొకరు. కేరళదేశంలోని 'కాళి' అనే పట్టణాధిపతికి క్రీ. శ. 8వ శతాబ్దంలో ఈయన జన్మించారు. శ్రీమన్నారాయణుని కౌస్తుభరత్నాంశలో ఉదయించిన కులశేఖరులు వైష్ణవభక్తాగ్రేసరుడేగాక తన ప్రజల్ని కన్నబిడ్డల్లాగా పరిపాలించిన దయాహృదయుడు. రజస్తమోగుణాల కతీతుడైన ఈయన శ్రీవేంకటాద్రిలోని ఒక సోపానం కాగల్గినా తన జన్మ చరితార్థ మవుతుంది కదా అని స్వామికైంకర్యానికై పరితపించారు. భగవద్భక్తి ప్రపూరితాలైన ముకుందమాల, పెరుమాళ్ తిరుమొళి వీరి రచనలే.

సంస్కృతభాషలో వ్రాయబడిన ముకుందమాలలోని 40శ్లోకాలు భక్తిప్రబోధాత్మకాలు. వీటిని శ్రీమాన్ పండిత టి. లక్ష్మణాచార్యులవారు ఉపన్యాసధోరణిలో వివరిస్తూ, గీతా శ్లోకాల్ని కూడా అనుబంధంగా ఉదాహరించారు. కవి పండితమాన్యులు శ్రీ ముదివర్తి కొండమాచార్యులవారు దీనిని సంపాదించి, అనుబంధంలోని శ్లోకాల్ని ఆ యా శ్లోకాల క్రిందనే ఉటంకిస్తూ సర్వజనమనోజ్ఞంగా పరిష్కరించి తి.తి.దేవస్థానముల కర్పించారు. కులశేఖరాళ్వారుల కవితా వైశిష్ట్యం, ఆయన భక్తిపారవశ్యం-ఎంతటి హృదయాహ్లాదకరాలో గ్రహించి పరమేశ్వరుణ్ణి ప్రార్థించటానికి అనువుగా వుంటాయనే ఉద్దేశంతో తి.తి. దేవస్థానము ఈగ్రంథాన్ని ప్రచురిస్తున్నది. తెలుగు చదువరులు మా కృషిని ఆదరించాలని మా కోరిక.


డి.వి.ఎల్.ఎన్. మూర్తి,

తిరుపతి, కార్యనిర్వహణాధికారి,

9-3-93. తి.తి. దేవస్థానములు, తిరుపతి.

# పీఠిక

విచిత్ర శతావధాని, విద్వన్మణి, మహాభాగవతాచార్య, సలక్షణ వర్ణ ఘనపాఠి, విద్యావారిధి -- ఇత్యాది బిరుదభాసురులైన మధ్వశ్రీ టి. కృష్ణాచార్యులవారు చెన్నపురి హిందూ థియొలాజికల్ పాఠశాలాసౌధంలో 'భగవత్తత్త్వబోధిని' సభయందు బహుకాలం భగవద్గీత, భాగవతం, ఆళ్వారుల దివ్యవైభవం మున్నగు విషయాలమీద ఉపన్యాసములు సలుపుతూ వచ్చారు.

వారు 1914లో ముకుందమాలపై ప్రసంగములు కావించారు. ఆ ప్రసంగాలనుంచి సంగ్రహించిన ముఖ్యాంశాలతో ముకుందమాలా ప్రథమ ముద్రణ 1914లో జరిగింది.

ముకుందమాలలోని నలభైశ్లోకాల టీక శ్రీమదమర చింతాత్మకూరు సంస్థానాధీశ్వరులు ముద్రింపించిన గ్రంథమునుండి స్వీకరింప బడినట్లు ముకుందమాలా గ్రంథప్రకాశకులైన వాల్మీకిరామాయణ ఆంధ్రవ్యాఖ్యాత శ్రీమాన్ గట్టుపల్లి శేషాచార్యులవారి పీఠికలో పేర్కొన బడింది. 1914లో తొలిసారిగ, 1917లో మలిసారిగ ప్రచురితమైన ఈ పుస్తకం పిదప పునర్ముద్రితమైనట్లు లేదు.

పదేండ్లుగ తిరుపతి అన్నమాచార్యకళామందిరంలో భక్తమండలికి భగవద్గీతాది గ్రంథబోధనకు తి. తి. దేవస్థానముల ధర్మప్రచార పరిషత్ వారిచే నియుక్తుడనైన నేను, ఐదేండ్ల క్రితం పరమభక్తి ప్రబోధకమైన ముకుందమాలా పఠనపాఠనములు జరుపుచుంటిని. ఆ యా సందర్భములో ధర్మప్రచారపరిషత్పౌరాణికులు, మన్మిత్రులు శ్రీమాన్ అర్చకం ఉదయగిరి వేంకట శేషాచార్యులవారు నా కీ పుస్తకమిచ్చి దీని పునర్ముద్రణమునకు ప్రయత్నింపు డని కోరినారు.

నేను గ్రంథమును ఆమూలాగ్రము పరిశీలించితిని. ఇది భక్తులకు మిక్కిలి ఉపయోగపడగలదని భావించితిని.

1988 మార్చినెలలో తి. తి. దేవస్థానములు స్వీయప్రచురణగా స్వీకరించి ప్రకటింపదగిన ఉత్తమపుస్తక మని దీనిని దేవస్థానాల ధార్మిక గ్రంథ నిర్ణాయకమండలికి నివేదించాను. పుస్తకం ప్రచురణార్హ మని వారు తమ ఆమోదం తెల్పారు.

ముకుందమాలా మూలశ్లోకములు 16 పాయింటులో, టీకాతాత్పర్య వివరణములు 12 పాయింటులో 1/8 డెమ్మీ సైజులో నూరు పారటలలో ఆనాడీ పుస్తకము అచ్చయింది.

ఈ గ్రంథములో అచ్చటచ్చటా సూచించబడిన భగవద్గీతాశ్లోకములకు సంఖ్యామాత్రమే సూచితమై శ్లోకములన్నీ గ్రంథాంతమున అనుబంధములో ముద్రించబడినవి.

అనుబంధములోని గీతా శ్లోకము లన్నింటిని ముకుందమాలా మూల శ్లోక వ్యాఖ్యానము నందు చేర్చుట పాఠకులకు సౌకర్యము. అంతేకాకుండా అప్పటి ముద్రణలో దొరలిన అచ్చుతప్పులను తొలగించుట, వాక్యరచనలోని నెరసులను సవరించుట, విరామచిహ్నము లుంచుట అవసర మనిపించినది. ఇందుకై ప్రత్యేకముగ నేను వ్రాతప్రతి సిద్ధము చేయవలసివచ్చినది.

రమణీయమైన ఈ రచన బహుపాఠకామోదము సంపాదించగలదను పరమ విశ్వాసముతో నే నీ పనికి దొరకొంటిని.

ధార్మికగ్రంథ ప్రచురణలపట్ల అత్యంత శ్రద్ధాసక్తులుగల మాన్య వరులు, తిరుమల తిరుపతి దేవస్థానముల శ్రీకార్యనిర్వాహకులు శ్రీ ఎం. వి. ఎస్. ప్రసాద్, ఐ.ఎ.ఎస్., గారి అనుగ్రహముతో ఇంత కాలమునకు ఈ పుస్తకము వెలుగుచూచుచున్నది. ఇందుకు దోహదము సల్పిన తి. తి. దేవస్థా

నముల పౌరసంబంధాధికారులు డా. రావుల సూర్యనారాయణ మూర్తి, ఎం.ఏ., గారికిని, సప్తగిరి సంపాదకులు శ్రీ కాట్రపాటి సుబ్బారావు గారికిని, పుస్తకము నిచ్చిన శ్రీమాన్ ఎ. వి. శేషాచార్యుల వారికిని నా సాధువాదాలు.

తిరుపతి, ముదివర్తి కొండమాచార్యులు,
27-7-1991. సంపాదకుడు.

# ముకుందమాల

ముకుందమాల యనగా, ముకుందస్య మాలా = మోక్షప్రదుడగు ముకుందునికి మాల యని అర్థము. భగవంతునికి పుష్పమాల సమర్పించిన నెంత యానంద మగునో అంత యానంద మీ రమణీయ భోగ్యశ్లోకములతో గూడిన మాలను సమర్పించుటచేత కలుగును.

ఈ ముకుందమాల నలువది శ్లోకములు గలిగిన యొక గొప్పగ్రంథము. ఏ గ్రంథము నైనను గొప్పదని భావించి యంగీకరించుటకు 1. ప్రతిపాద్య మాహాత్మ్యము, 2. వక్తృమాహాత్మ్యము అను రెండు అంశములు కారణములైయున్నవి. ప్రతిపాద్య మాహాత్మ్యము ఉండవలయు ననగా చెప్పబడిన విషయము శ్రేష్ఠమైనదిగ నుండవలయును. ఎంతటి ఘనుడగు కవి యొనర్చినదైనను విషయము గొప్పది కాదేని ఆ గ్రంథము ఆదరింపబడదు. అదెట్లనిన కాళిదాసు డనేక గ్రంథములను రచించి యుండినను అంబాపరమైన శ్యామలాదండకము ఆదరింపబడినటులు పుష్పబాణ విలాసము మొదలగు తదితరగ్రంథములు ఆదరింపబడుటలేదు.

వక్తృమాహాత్మ్యముండవలయు ననగా గ్రంథకర్త శ్రేష్ఠుడై యుండవలయును. ఎంతటి గొప్ప విషయములతో నిండియుండినదైనను వక్త ప్రసిద్ధుడు, పరిశుద్ధుడు కాడేని ఆ గ్రంథము వాసి కెక్క నేరదు. శ్రీరాముడు ప్రతిపాద్యుడైనను వాల్మీకిప్రోక్తమైన రామాయణమునకు గల గౌరవము తదితర కవికృత రామాయణములకు గలిగెనా? కాన ప్రతిపాద్య వక్తృమాహాత్మ్యము లావశ్యకములు.

కులశేఖ రాళ్వారులు కేవలభగవద్విషయమును నలువది శ్లోకములలో వర్ణించి దానినొక మాల గావించి ముకుందునకు సమర్పించిరి. ఈ గ్రంథము ప్రమాణతమ మైనది. ఇక వక్త యెట్టివా డనగా మహానుభావుడు.

ఘుష్యతే యస్య నగరే రంగయాత్రా దినేదినే,
త మహం శిరసా వందే రాజానం కులశేఖరమ్.

యస్య=ఏకులశేఖరులయొక్క, నగరే=పట్టణమునందు, దినే దినే=ప్రతిదినంబునను, రంగయాత్రా=శ్రీరంగమునుగూర్చిన ప్రయాణము, ఘుష్యతే =మ్రోగుచున్నదో, తం=ఆ, కులశేఖరం=కులశేఖరు లని ప్రసిద్ధిచెందిన, రాజానం=రాజును, శిరసా=ఉత్తమాంగముతో, అహమ్=నేను, వందే=నమస్కరించుచున్నాను.

ఏ కులశేఖరులయొక్క పట్టణమునందు ప్రతిదినమును శ్రీరంగయాత్రఅను శబ్దము ఘోషింపబడుచున్నదో, ఆ రాజైన కులశేఖరాళ్వారులను నేను శిరస్సుచేత సేవించుచున్నాను.

కుంభే పునర్వసౌ జాతం కేరళే చోళ పట్టణే,
కౌస్తుభాంశం ధరాధీశం కులశేఖర మాశ్రయే.

కేరళదేశమున చోళపట్టణమునందు కుంభమాసము పునర్వసు నక్షత్రములో కౌస్తుభాంశమున భూమీశులుగ జన్మించిన కులశేఖరులను ఆశ్రయించుచున్నాను.

ముకుందమాలా స్తోత్రమును ఆరంభించుటకు పూర్వము కులశేఖరుల పరమైన రెండు శ్లోకముల ఏల చెప్పవలయు ననగా, గురువు విషయమైన మంగళాచరణ మగుటచే. ముకుందమాలయొక్క ప్రథమశ్లోకమగు శ్రీవల్లభేతి యను నదియును భగవద్విషయమైన మంగళాచరణము.

మంగళము లేక యే కార్యమును జరుగనేరదు. కులశేఖరులు గ్రంథమును శ్రీయను నక్షరముతో ప్రారంభించి ముగించిరి. ఏ గ్రంథమునకైనను ఆదిమధ్యాంతములందు మంగళాచరణ ముండవలయును. కంచు దాని యోగ్యతకొలది శబ్దించును. గ్రంథకర్తలు రచించిన గ్రంథములు

అనేక రహస్యార్థములతో నిండియుండును. ఎవ్వరైనను ఆ గ్రంథాంత ర్గతములై యుండు రహస్యముల నెఱిగి భగవదనుగ్రహమునకు పాత్రు లగుటను కోరుదురేని వా రా గ్రంథకర్తలయొక్క అనుకూల్యమును సంపాదించవలయును.

పెట్టెలో రత్నము లుంచి బీగము వేసినవాడు దానిని తెఱచిననే గదా రత్నములు గైకొనగలడు? గ్రంథకర్తను లక్ష్యముసేయక విషయమును మాత్రము తెలిసికొనగోరువాడు గ్రంథకర్తయొక్క ఆగ్రహమునకు పాత్రుడై వ్యర్థమనోరథు డగును. స్వప్రయత్నమున స్ఫురింపని యర్థము లెల్లను ఆచార్యానుగ్రహమున తెల్లమగును. ఇట్లని ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు చెప్పుచున్నవి. ఆ కారణముచేతనే ముందుగ గురువిషయమ్మైన శ్లోకము లుదాహరింపబడినవి.

గ్రంథకర్తయగు కులశేఖరులు భగవద్భక్తియును, సద్భావమును గలి గిన మహానుభావుడు. స్వోదరమును పోషించుకొనుట ఘనకార్యము గాదు. పదుగురిని పోషించుటే అతిశయము. అట్లు చేయువాడే జీవించియుండు వాడు. లేకున్న జీవచ్ఛవమే యగును.

యజ్ఞశిష్టాశిన స్సంతో ముచ్యంతే సర్వకిల్బిషైః,
భుంజతే తే త్వఘం పాపా యే పచంత్యాత్మకారణాత్.

-- గీత. 3.13

యజ్ఞశేషమును భుజించుట మోక్షహేతువు. ఆత్మార్థము వండుకొ నుట పాపహేతువు. అట్లు వండబడిన యన్నము అమేధ్యతుల్యము అని చెప్పబడెను.

శక్తిగలవాడు భగవంతుని రత్నపీఠమున నుంచి యారాధింపనగును. అశక్తుడు--

పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి,
త దహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః.
-- గీత. 9.26

అన్నట్లు పత్రము పుష్పము ఫలము తోయము దేనినైనను భక్తితో సమర్పింప నగును. భగవంతుడు మిగుల సులభుడు. అందుచేత పదుగురికి పెట్టుటయు ఒక యజ్ఞమై యున్నది.

యేషా మర్థే కాంక్షితం నో రాజ్యం భోగాస్సుఖాని చ,
త ఇమే ఉవస్థితా యుద్ధే ప్రాణాం స్త్యక్త్వా ధనాని చ.
-- గీత. 1.33

భీష్మాదులు పోయిన పిమ్మట మనకు సుఖము లేల యని అర్జునుడు కూడ చెప్పెను. ఇత్యాది కారణములచేత తా ననుభవించుట కంటెను ఇతరులను అనుభవింపజేయుట శ్రేష్ఠము. ఈ తాత్పర్యము నెఱిగినవా రగుటచేతనే కులశేఖరులు శ్రీరంగయాత్రయందు తాము అభిరుచి గొన్నవారై అంతటితో తృప్తిపొందక తమ ప్రజ లెల్లరును ఆ భాగ్యము ననుభవింపవలయునను కోరిక గలిగియుండిరి. కొంటె బాలుడు ఔషధమును పుచ్చుకొనుటకు సమ్మతింపక మొండి కెత్తినపుడు తండ్రి వానిని శిక్షించియైనను ఔషధసేవ చేయించుట ఆవశ్యకమైనట్లు కులశేఖరులు రజోగుణ సముద్భవములైన రాగద్వేషములకు జిక్కి భగవద్భక్తి సేయక సంసారసాగర మునబడి మునుగుచుండు పామరజనులను శిక్షించి ఇదిగో! రంగయాత్రకు బోవుచున్నారము అని పలుకునట్లు చేసిరి.

నిషిద్ధ విషయమందలి ప్రేమ రాగమనబడును. అనిషిద్ధ విషయమున జేయు విరోధము ద్వేష మనబడును.

ఇంద్రియస్యేంద్రియ స్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ,
తయోర్న వశ మాగచ్ఛే త్తౌ హ్యస్య పరిపంథినౌ.
-- గీత. 3.34

రాగద్వేషములను త్రోసివేయవలయు నని గీతలో చెప్పబడియున్నది. భగవదాజ్ఞానువర్తులైన కులశేఖరులు భగవద్విషయమునగల సుఖమును దెలి యని జనులకు ఆ సౌఖ్యమును బోధించి తెలిపినందున వారి దేశమున సూర్యోదయము మొదలు పునస్సూర్యోదయ పర్యంతము శ్రీరంగయాత్ర ఘోషింపబడుచుండినది.

సాధారణముగ జనులు ఆపదలందే భగవంతుని దలంతురు. యుద్ధ మున జయలక్ష్మిని పొందిన పాండవులు అశ్వమేధయాగ మొనరించిన పిమ్మట శ్రీకృష్ణమూర్తి ద్వారకాపురి కేగదలచి పయనమై పోవునపుడు తన అత్తయగు కుంతీదేవి యొద్ద సెలవు గైకొనుటకై ఆమె కడకేగి నమస్క రించి "అత్తా! నే పోయివచ్చెదను. నీ కేవేని కోరిక లుండు పక్షమున తెలుపుము. ఈడేర్చెద" నని చెప్పెను. అందుల కామె "కృష్ణా! నా పుత్త్రిలకు పూర్వమువలెనే కష్టములు ప్రాప్తించునట్లు అనుగ్రహింపుము. సంసారమున జిక్కి శ్రమపడునపుడే నీవు ఆదరించుటకు వత్తువు. జన్మ రాహిత్యహేతువైన నీ దర్శన మపుడే కలుగుచుండును. సుఖానుభవకాల మున నీ స్మరణ మెట్లు నిలిచి యుండును? సకలకార్యము లాయెను. ఇక పోయివచ్చెద ననెడి నీ పలుకులే నీతో నెడబాటు కలుగు కాలమును దెల్పుచున్నవి--అని కుంతీదేవి యుత్తర మిచ్చెను. విషయ మిట్లుండినను సకలైశ్వర్యసమృద్ధితో గూడియుండిన రాజైన కులశేఖరులు అధికసంపదగల కాలమందును భగవద్భక్తితో మెలంగిరి. ఇదియును గాక కులశేఖరులు సార్థకనాములై కులమునకు భూషణమై యుండిరి. వారు ఇహమునకు ఐశ్వర్యమును, పరమునకు భక్తియు అను భాగ్యములను గలిగియుండిరి.

ప్రాప్య పుణ్యకృతాం లోకా నుషిత్వా శాశ్వతీస్సమాః,
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽ భిజాయతే.

-- గీత. 6.41

ధ్యానయోగమున సిద్ధిపొందకమునుపే మృతిచెందినవాడు శుచిగల శ్రీమంతుల యిండ్లలో పుట్టును అని చెప్పబడినది. ఆ స్థలమున జన్మిం చుటచేత ధనమదాంధుడై నశింపడా యను సంశయమునకు దశరథ,

అంబరీష, జనక మహారాజులు మహాత్ములై యుండిరి గదా యనునది ఉత్తరము. కులశేఖరులును అట్లే మహానుభావులై యుండిరి. తా ననుభవించి ప్రజలచేత ననుభవింపజేసెను. భగవద్రామానుజులును ప్రాణి కోటి యందలి దయచేత గోపురము నెక్కి రహస్యార్థమును వెలిపుచ్చిరి. అట్లే కులశేఖరులును భగవంతు నెఱిగి కడతేరవలయునను తలంపుచేత ముకుందమాల యను గ్రంథమును ఏర్పరచి, ప్రజలచేత ననుష్ఠింపజేసి యెల్లవారును పరమపదమునకు బోవలయునను కోరిక గలిగి యుండిన మహనీయులు. ఇట్టివారికి మనము మునుముందుగ నమస్కరించుట ఆవశ్యకము. ఇట్టి భక్తివాత్సల్యములను గల్గియుండిన మహానుభావు డే కాలమున నెచ్చట నవతరించెనో తెలిసికొనవలయు నని మనకు కోరిక గలుగును. కుక్కుటపురము మొదలగు నామాంతరములు గల కల్లికోట యందు కుంభమాసము పునర్వసు నక్షత్రమున వీరు అవతరించిరి.

నాంతోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరంతప,
ఏష. తూద్దేశతః ప్రోక్తో విభూతే ర్విస్తరో మయా.
-- గీత. 10.40

అని భగవంతు డనినట్లు అనేక కల్యాణ గుణములతో గూడిన కులశేఖరులు శ్రీమన్నారాయణుని కౌస్తుభాంశ సంభూతులు, రాజులుగ నుండు వీరి నెల్లవారును ఆశ్రయింప వలయును.

1

శ్రీవల్లభేతి వరదేతి దయాపరేతి
భక్తప్రియేతి భవలుంఠనకోవిదేతి,
నాథేతి నాగశయనేతి జగన్నివాసే
త్యాలాపనం ప్రతిపదం కురు మే ముకుంద.

ముకుంద=ఓముక్తినిచ్చువాడా, శ్రీవల్లభ=లక్ష్మీదేవికి ప్రియుడా, ఇతి=అని, వరద=కోరినవరముల నొసంగువాడా, ఇతి=అని, దయాపర=దయయే ప్రధానముగా గలవాడా, ఇతి=అని, భక్తప్రియ=భక్తులకు ఇష్టుడా, ఇతి=అని,

భవలుంఠననకోవిద=సంసార మనెడి పాశమును తెగ గొట్టుట యందు నేర్పుగలవాడా, ఇతి=అని, నాథ=ప్రభుడా, ఇతి=అని, నాగశయన=ఆది శేషుడే పాన్పుగా గలవాడా, ఇతి=అని, జగత్+నివాస=ప్రపంచమునకు ఆధారమైనవాడా, ఇతి=అని, ఆలాపనం= స్మరణచేయుటను, మే=నాకు, ప్రతిపదం=ఎల్లప్పుడును, కురు=దయచేయుము.

ఓ ముకుందా! శ్రీవల్లభాయని, వరదాయని, దయాపరాయని, భక్తప్రియాయని, సంసారమును బోగొట్టుటయందు సమర్థుడాయని, నాథుడాయని, శేషశయనాయని, లోకంబులకెల్ల నివాసభూతుడాయని మాటిమాటికి నాకు ఆలాపనం బొసగషము.

ఓ ఐహికాముష్మిక ప్రదుడవగు ముకుందా! శ్రీవల్లభా యను నట్లు చేయుము. శ్రీవల్లభు డనుటలో విశేష మేమనగా భగవంతుడు పరమ వాత్సల్య స్వభావు డగుటచేత పాపకృత్యు డగు ఆత్మను దండించుటకు సిద్ధపడును. లక్ష్మీదేవికి అనుగ్రహించుట మాత్రమే తెలియును గాని నిగ్రహించుట దెలియదు. ఈమె పురుషకార భూతురాలుగ నున్నది. ద్వయ మంత్ర ప్రకరణము 13వ వాక్యమును బట్టి ఈ పిరాట్టికి చేతనులతో మాతృత్వ సంబంధ ముండుటచేత వీరి దుఃఖమును సహింపజాలక వీరికి చేయవలసిన కార్యములను తాను అవలంబించి ఈశ్వరునితో పత్నీత్వసం బంధము గలిగి ఆయనకు అత్యంత ప్రియురాలై యుండుటచేత ఆయనను వశపఱచుకొని యుండును. ఇట్లగుటచేత ఈమె చేయు పురుషకారమునకు ఏ విధమైన ప్రతిబంధమును ఉండదు. ఇదిగాక శ్రీయనుమాటకు-- భక్తుల ఆర్తధ్వని వినును, భగవంతునికి వినిపించును, భక్తులచేత నాశ్ర యింపబడును, భగవంతు నాశ్రయించును, భక్తులయొక్క కామక్రోధాది దోషములను పరిహరింపజేసి జ్ఞానభక్త్యాది సద్గుణములను గలిగించి మోక్ష యోగ్యులుగ జేయును అని యర్థము. శ్రీవల్లభా యనగా పైన జెప్పిన ప్రభావ సంపన్నురాలగు లక్ష్మీదేవికి వల్లభుడా యని యర్థము. లేక లక్ష్మీదేవిని వల్లభగా గలవాడా యనియు నర్థము.

భగవంతుడు లక్ష్మీదేవికి పతియగుటచేత శ్రీధవా యనియును జెప్ప వచ్చును. అట్లనక శ్రీవల్లభా యని యేల చెప్పబడెననగా శ్రీకి ప్రీతిపాత్రు డనియును, అధిపతి యనియును అర్థము. లక్ష్మీదేవి భగవంతునికి సిఫా' రసు చేసి మనకు పూర్ణఫలమును గలిగించు శక్తిగల్గియున్నది. సిఫారసు చేయువారికి వాత్సల్యము, వాల్లభ్యము అను రెండుగుణము లుండవలెను. ఈమెకు ప్రాణికోటియందు వాత్సల్యమున్నది. భగవంతునికి వల్లభగా నుండుటచేత వాల్లభ్య మున్నది. తండ్రిప్రక్క తల్లియుండెనేని భయ మేమి? మంగళాచరణమునకై కులశేఖరులు శ్రీయను నక్షరమును ముందు ప్రయో గించిరి. ఇందుచేత సంపత్తి కలుగును; దురిత హర మగును.

ఓ ముకుందా! వరదా యనిపించుము. వరదు డనగా 'వరం దదాతీతి వరదః' ఎవరి కేది కావలయునో దాని నిచ్చువాడు. లేక 'వరాన్ ద్యతి వరదః'. లోకమును హింసించునట్టి వారికి ఇతరు లిచ్చిన వరములను తీసి వేయువాడు. భక్తులకు వలసినది ఇచ్చువాడు. అభక్తులను ఖండించువాడు.

ఓ ముకుందా! దయాపరా అనిపించుము. దయా పరుడనగా కృపకు అధీనుడు. చరాచరప్రపంచముయొక్క సృష్టిస్థితిలయములకు కర్తయై భువన సంరక్షణకు కృపను గొప్పసాధనముగా గొన్నవాడు. సృష్టించుట, రక్షించుట అనునవి దయాకార్యము లనదగును. సంహరించుటయును దయాకార్య మనియే చెప్పబడెను. అట్లు చెప్పనగునా యనిన ఆ సంగతి ముందు వివరింపబడును.

మనలను రక్షించుటకు మనము చేయు కర్మజ్ఞానభక్తులకు శక్తి లేదు. మన రక్షణార్థము భగవంతుడు దయనే ముఖ్యసాధనముగ నుంచుకొని యున్నాడు.

ఓ ముకుందా! భక్తప్రియా యనిపించుము. భక్తప్రియుడనగా

సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః,
యే భజన్తి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్.

-- గీత, 9.29

అనునట్లు భగవంతుడు సర్వసముడు. భక్తి చేసినటులైన కులశీలాదులను పాటింపడు. సుగ్రీవుడును, విభీషణుడును స్వామి నాశ్రయించి రక్షింపబడిరి. వాలియును, రావణుడును, ఆతని నాశ్రయింపక చెడిరి. కల్పవృక్షమును ఆశ్రయింపనివానిదే తప్పగును గాని ఆ వృక్షము యొక్క దోష మేమియును లేదు. అగ్నిసమీపమున గూర్చుండు పక్షమున చలి తీరును. అట్లుచేయక దూరమున నుండి తన చలిని పోగొట్టలేదని అగ్నిదేవుని నిందించుట వలన ప్రయోజన మేమి?

సంతుష్ట స్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః,
మయ్యర్పిత మనోబుద్ధి ర్యో మద్భక్త స్స మే ప్రియః.
-- గీత. 12.14

అనపేక్ష శ్శుచి ర్దక్ష ఉదాసీనో గతవ్యథః
సర్వారంభ పరిత్యాగీ యో మద్భక్త స్సమే ప్రియః.
-- గీత. 12.16

యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి,
శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్ య స్సమే ప్రియః.
-- గీత. 12.17.

తుల్యనిందాస్తుతి ర్మౌనీ సంతుష్టో యేన కేనచిత్,
అనికేత స్స్థిరమతి ర్భక్తిమాన్ మే ప్రియో నరః
-- గీత. 12.19.

యే తు ధర్మ్యామృత మిదం యథోక్తం పర్యుపాసతే,
శ్రద్దధానా మత్పరమా భక్తా స్తేఽ తీవ మే ప్రియాః.
-- గీత. 12.20.

అనునట్లు భగవంతుడు భక్తప్రియుడు.

ఓ ముకుందా! భవలుంఠనకోవిదా యనిపించుము. భవలుంఠనకోవిదు డనగా జనన మరణరూప సంసారమును ఛేదించుటయందు సమర్థుడు.

జాతస్య హి ధ్రువో మృత్యు ర్ధ్రువం జన్మ మృతస్య చ,
తస్మా దపరిహార్యేఽర్థే న త్వం శోచితు మర్హసి.
-- గీత. 2.27

పుట్టుచు గిట్టుచుండుటను అతడు పోగొట్టును.
ఓ ముకుందా! నాథా యనిపించుము. నాథు డనగా-
మత్తః పరతరం నాన్య త్కించి దస్తి ధనంజయ,
మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ.
-- గీత. 7.7

అనునట్లు ఆయనకు మించినది లేదు. పరము, పరతరము అతడే.

జ్ఞేయం యత్త త్ప్రవక్ష్యామి యద్జ్ఞాత్వాఽమృత మశ్నుతే,
అనాదిమత్పరం బ్రహ్మ న సత్తన్నాసదుచ్యతే.
-- గీత. 13.13

భోక్తారం యజ్ఞతపసాం సర్వలోకమహేశ్వరమ్,
సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాంతి మృచ్ఛతి.
-- గీత. 5.29

అనునట్లు అతడు నాథుడు. ఇంద్రాది దేవతలు నాథులు గారా యనిన వారు స్వాతంత్ర్యము లేక అల్లాడుచుండువారు. ఇక మనము కోరు కోరికల నే రీతి కొనసాగింతురు? సకలజగత్తునకు నాథు డగుటచేత అతడే కాపాడ సమర్థుడు. హిరణ్యకశిపుడు జరామరణములు పోవలయు నని బ్రహ్మదేవుని యాచింపగా అతడు తనకు కూడ ఆ స్థితి లేదనియు, అందుచేత ఆ వర మీయజాలనని యుత్తర మిచ్చెను.

త్రైవిద్యా మాం సోమపాః పూతపాపా
యజ్ఞై రిష్ట్వా స్వర్గతిం ప్రార్థయంతే,
తే పుణ్య మాసాద్య సురేంద్రలోక
మశ్నంతి దివ్యాన్ దివి దేవభోగాన్.

-- గీత. 9.20

స్వయంశక్తి లేనందుననే భగవంతుడు వారి నారాధింపవలదని చెప్పెను. గ్రుడ్డివాడు మఱియొక గ్రుడ్డివాని నాశ్రయించిన మార్గము నెట్లు కనుగొనగలడు?

ఇంద్రాదులు భగవంతునికి శరీరభూతులు. భగవంతు డాత్మ స్వరూపముతో నుండి సకలమును నడిపించును. శరీరము నారాధించిన యెడల శరీరికి సంతోషము గలుగును. అట్లయినను వారికి సంసార బంధమును త్రెంచునట్టి శక్తిలేదు. అట్లగుటచేతనే వారి నారాధింపరాదు. భగవంతు డన్ననో తృణమును మేరువుగను, మేరువును తృణముగను చేయగల సమర్థుడు.

ఓ ముకుందా! నాగశయనా యనిపించుము. నాగశయనుడను ఈ నామము ఇతరులకు లేని యసాధారణ వైభవమును దెలుపుచున్నది.

శ్రీవల్లభా యనుటకు కాంతి, శోభ, ఐశ్వర్యము మొదలగునవి కలవాడని యన్వయించి అట్టి స్థితి ననుభవించువాడు ఇంద్రుడుగాన వాని కా పేరు చెప్పవచ్చునని యొక వాదము చేయ నగును. నాథుడని ఇతరులను గూడ చెప్పవచ్చును. నాగశయనుడను నామ మట్టిదిగాదు. మన పడుకయందొక చీమ పారాడుచుండినను శ్రమగల్గుచున్నది. ఆ పరమాత్ముడు సహస్రఫణియగు ఆదిశేషుని మీద స్వస్థముగ పవళించియున్నాడు. ఆశ్రితులయొక్క విరోధి నిరసనమునకై స్వామి యట్లు విషజ్వాలలు గల సర్పముపైని పవళించియున్నాడు.

ఆయుధానా మహం వజ్రం ధేనూనా మస్మి కామధుక్,
ప్రజన శ్చాస్మి కందర్ప స్సర్పాణా మస్మి వాసుకిః.
-- గీత. 10.28

అనంతశ్చాస్మి నాగానాం వరుణో యాదసా మహమ్,
పితౄణా మర్యమా చాస్మి యమ స్సంయమతా మహమ్.
-- గీత. 10.29

అనునట్లు ఒక తలగల పాము, పెక్కు తలలుగల పాము అని సర్పములలో రెండు భేదములు చెప్పబడినవి. భగవంతుడు అనేక శిరస్సులుగల నాగముపైని శయనించియున్నాడు; కోపమును పోగొట్టుటకు లక్ష్మీదేవిని వక్షస్థలమున నుంచుకొనియున్నాడు. శత్రునిరసనమునకు ఆది శేషుని ఉంచుకొని యున్నాడు. అజ్ఞానమును బోగొట్టుటకు చక్రమును, జ్ఞానమును గలిగించుటకు శంఖమును ధరించియున్నాడు.

భూమి రాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధిరేవ చ,
అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా.
-- గీత. 7.4

అని గీతలో చెప్పినట్లు జడప్రకృతి నుంచుకొని సృష్టించువాడు.

యావత్సంజాయతే కించి త్సత్త్వంస్థావరజంగమమ్,
క్షేత్రక్షేత్రజ్ఞసంయోగా త్తద్విద్ధి భరతర్షభ.
-- గీత. 13.27

అను శ్లోకము రీతిగ సృష్టించువాడు.

ఓ ముకుందా! జగన్నివాసా యనిపించుము. జగన్నివాసు డనగా

మత్తః పరతరం నాన్యత్కించి దస్తి ధనంజయ,
మయి సర్వ మిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ.
-- గీత. 7.7

అనుశ్లోకమట్లు సృష్టించిన దానిలోపల ప్రవేశించియుండువాడు. దారమునందు ముత్యము వలె భగవంతునియందు సకలమును గ్రుచ్చబడియున్నది. భగవంతుడు ఎన్నరాని యుపకారములను చేయుచున్నాడు. వానిలో మనలను ధరించుట యనునది మిగుల హెచ్చైన కార్యము. ధరించువాడు లేకుండిన జారిపడిపోవును. ఆదికూర్మరూపముతో ధరించుచు కాపాడుచున్నాడు.

గామావిశ్య చ భూతాని ధారయామ్యహమోజసా,
పుష్ణామి చౌషధీ స్సర్వా స్సోమో భూత్వా రసాత్మకః.
-- గీత. 15.13

పరమేశ్వరుడు భూమిలోపల ప్రవేశించి ఆమెకు ధరించు శక్తి గల్గించి యుండుటచేతనే మనము నిర్భయముగ నున్నాము.

భగవంతుడు ఒక్కొక్క పదార్థము లోను ప్రవేశించియున్నాడు: అణువులో నణువై మహత్తునకు మహత్తయి యున్నాడు. నారాయణ శబ్దార్థమును చూడగా నారాణాం అయనం యః సః నారాయణః. నారములకు స్థానమెవ్వడో వాడు నారాయణుడు. మఱియొక యర్థము: నారాః అయనం యస్య సః నారాయణః-నారము లెవ్వనికి స్థానమో వాడు నారాయణుడు. ఈ కారణముల చేత భగవంతుడు జగన్నివాసుడు.

కులశేఖరులు భగవద్గుణములను పుంఖానుపుంఖముగ వర్ణింపవలసి యుండగా అట్లు చేయక భగవన్నామములను తమ వాక్కున నుచ్చరింప జేయుమని భగవంతు నేల ప్రార్థింపవలయును? అనగా భగవన్నామము మనయొక్క సకలశ్రమముల పరిహరింప జేయునట్టిదిగ నున్నది. తిరుమంత్రార్థము 14వ వాక్యమున భగవద్వైభవము కంటెను వాని మంత్రవైభవము అధికమైనదనియు, 15వ వాక్యమున భగవంతుడు దూరముగనుండినను మంత్రము సమీపమున నుండి రక్షించుననియును, 16వ వాక్యమున ఆపదయందు ద్రౌపదికి వస్త్రము లిచ్చి కాచిన దీ మంత్రమే కదా యనియును చెప్పబడెను. మఱియును 17వ వాక్యమున భగవన్నామము మనకు రక్షకమైనదని తెలిసి భక్తిశ్రద్ధాపురస్సరముగ చేయకపోయినను కాపాడును. పరిహాసమునకో, ఇతరులు చెప్పిరనియో, బిడ్డల పేరు అనియో, పాట పాడునపుడు తాళము సరిపోవుటకో, దూషించుటకో-ఏ విధముననైనను అప్రయత్నముగ చెప్పినను భగవన్నామము దాని స్వభావమును విడువదని చెప్పబడినది.

అగ్నిని తెలిసి త్రొక్కినను, తెలియక త్రొక్కినను కాల్చును. భేది మాత్రను తాంబూలమాత్ర యని భ్రమించి యుపయోగించుకొనినను దాని కార్యమును అది చేయకమానదు. అట్లే భగవన్నామము పాపములను భస్మము చేయును. లోపల ప్రవేశించి పాపరాశిని వెలుపలికి త్రోసివేయును. అజామిళుడు భగవన్నామమును స్మరింపదలచియా స్మరించెను? నారాయణు డను దాసిపుత్రుని గదా అతడు పిలిచెను. అంతమాత్రముననే విష్ణుదూతలు వచ్చి యమదూతలను గదలతోమొత్తి తఱిమి వారి నుద్దేశించి "దూతలారా! ఈతడు నారాయణుని దలచి తన పాపములకు ప్రాయశ్చిత్తముగావించుకొనెను. పుణ్యశాలి యాయెను. ఈతడు పరమవైష్ణవుడు. ఏ తలంపుతో నుచ్చరించినను మా స్వామి పేరును చెప్పి పరిశుద్ధు డాయెను. మీరితని నంటరా"దనిరి.

భగవన్నామమున కింత శక్తి గలదా యనిన కృష్ణా యను నామ మెవని నాలుకయం దున్నదో వాడు శ్వపచుడు, మఱెట్టివా డైనను దోషము లేదని భాగవతమున జెప్పబడినది.

అపిచేత్సుదురాచారో భజతే మా మనన్యభాక్,
సాధురేవ స మన్తవ్య స్సమ్యగ్వ్యవసితో హి సః.
-- గీత. 9.30

అనినట్లు దురాచారుడైనను భగవంతుని భజించువాడు సాధువని చెప్పబడినది. వాని మనోనిశ్చయము బాగుగ నున్నదని చెప్పబడెను.

ధ్రువుడు వాసుదేవమంత్రము నుచ్చరించి భగవద్దర్శనము వడసెను. గజేంద్రుడు ఆదిమూలమా యని పిలువగా స్వామి కాపాడవచ్చెను. అజామిళుడు నారాయణ యనియు, ద్రౌపది కృష్ణా యనియు స్మరించి కాపాడబడిరి.

భగవన్నామము పంచమహాపాతకముల తొలగించునని భాగవతమున జెప్పబడినది. అనేకజన్మకృత పుణ్యవిశేషముచేతనే భగవన్నామము నోట

వచ్చును. ఎవ్వడైనను తన్ను భగవంతుడు కాపాడవలయునని కోరునేని భగవంతునికి తన యభిప్రాయమును దెలుపుటకై యతని నామమునే పంపవలయును. అనగా భగవంతుని నామమును స్మరించిన భగవంతుడు కాపాడును. తిరుమంగైయాళ్వారులు 'వాడినేన్' అనుమొదటి పాశురమున నిట్లు చెప్పిరి. తల్లి మొదలగువారు పరమబాధకులు. ఇహమున కష్టించి సంపాదించిన వీరు అనుభవింతురు. పరమున నేను నరక మనుభవింప వలసి యుండుటచేత వీరు శత్రువులు. అట్లు తెలియక వీరికై శరీరముతో అల్లాడితిని. మనసుతో సంకటపడితిని. జన్మమన దుఃఖ స్వరూపము, దుఃఖహేతువు. అట్టి సంసారచక్రమున బడి దేహమే ఆత్మయని తలచి నేను నేనని యెంచి ఒకటిగ గూడితిని. శరీరముతో గూడి అల్లాడితిని. మరల మరల పుట్టి అల్లాడితిని. పెద్దలు, తల్లి, తండ్రి, ఆచార్యులు మొదలగువారి మాట వినక ఆలుబిడ్డలను, వారియాలోచనలను అనుసరించుచు, నాచేత కాపాడబడునట్టి వారి మాటలు వింటిని వారిని యజమానస్థానమున నుంచితిని. వారిచ్చు సుఖము స్వల్పము, విరసము.

విషయేంద్రియసంయోగా ద్యత్తదగ్రేఽమృతోపమమ్,
పరిణామే విషమివ తత్సుఖం రాజసం స్మృతమ్.

-- గీత. 18.38

అది రాజస సుఖమని చెప్పబడినది మెఱుపువలె క్షణముందు నట్టిది. మనకుందు చీకటికి ఇట్టి వెలుగు ఉపయోగించునా? ఇట్టివారికై పరుగెత్తితిని. అట్లు పోయి చెడితిని. ఇట్లెన్నో జన్మములకు భగవంతుని కృప యను వస్తువు దొరకెను. కృపయను దొడ్డపదార్థము దొరకగనే జ్ఞానము గలిగెను. దానితో చూడగా ఆత్మస్వరూపోజ్జీవన మార్గము దొరకెను. అది యేమి యనిన· నారాయణనామము. దానిని నేను కనుగొంటిని. అనేకములగు సుఖదుఃఖములం దుండు, మీరు ఎఱుగలేరు. నేను చెప్పెదను. రండు, వినుడు" అనిరి. దీనిలోనే 9 పాశురమున నిట్లు చెప్పబడినది. నారాయణ యను నామము కులము నిచ్చును. ఐశ్వర్యము నిచ్చును. శేషభూతులు అనుభవించు దుఃఖరూపమగువాని నన్నిటిని నశింపజేయును.

పరమపదము నిచ్చును. కృపతో గొప్పపదవి నిచ్చును. శక్తినిచ్చును. చెప్పని ఇతరములైనవాని నన్నిటి నిచ్చును. కన్నతల్లి కంటెను మేలైన హితములను చేయును. కైంకర్యశ్రీ నిచ్చునట్టి యీ తిరునామమును నేడు కనుగొంటిని. ఇట్టి కారణములచేత భగవన్నామ ప్రభావము తెలియుచున్నది. పై కోరికలను గోరువారు పామరులై యుందురు. అట్టివారికే భగవన్నామముతో పనియుండును. జ్ఞానులు తమ కెట్టి యిడుమలు ప్రాప్తించినను తత్పరిహారమును గోరరు.

జ్ఞానియగు ఇంద్రద్యుమ్నమహారాజునకు గజజన్మము వచ్చినను దుఃఖింపక తన యపచారమునకు ప్రతిఫల మనుభవించుట యుక్తమే యని తలంచెను. అటులైన భగవంతు నేల పిలిచె ననగా శరీరశ్రమము పరిహారము కావలయునని పిలువలేదు. కొలనిలో పూచి యుండిన తామరపువ్వును జూచి జన్మాంతరమున తా నట్టి పుష్పములతో భగవంతు నారాధించుట తలంపునకు వచ్చి పుష్పమును తొండమున నుంచుకొని స్వామికి సమర్పింప గోరి పిలిచెను. ఇట్లని నమ్మాళ్వారు లానతిచ్చిరి. ఇందుచే జ్ఞానులకు కులము మొదలగు వానితో పనియుండదు. ఇక భగవన్నామముతో వారి కేమి పనియనిన "కులంతరుం" అను పాశురమునకు వే ఱర్థము గలదు. జ్ఞానుల విషయమున కులమేది యనగా భగవచ్ఛేషత్వజ్ఞానము గలుగుట. భగవంతుడు శేషి; నేను శేషభూతుడను అను భావముండు వాడే కులము గలవాడు. భగవన్నామోచ్చారణ ఇట్టి జ్ఞానమును కలిగించును. ఐశ్వర్య మేది యనగా శ్రీమద్రామాయణమున "లక్ష్మణో లక్ష్మివర్ధనః"-భార్యను రాజ్యమును వదలిన వాడైనను శ్రీరామకైంకర్య మను సంపదతో గూడియుండువాడగుటచేత లక్ష్మణుడు లక్ష్మివర్ధను డనబడెను. అత డయోధ్యయందే ఉండి యుండినచో శ్రీరామకైంకర్య సంపద లభించియుండదు. పెద్దలు కోరు సంపద కైంకర్య మను సంపద లభింపగనే వారియొక్క కష్టములు తీరిపోవును.

నేను అను దేహాత్మాభిమానము, స్వస్వాతంత్ర్యము. అన్యశేషత్వజ్ఞానము అనగా భగవంతునియందు మఱియొకరియందు ప్రేమయుంచుట,

సంరక్షణము అనగా తన్ను కాపాడుకొను విషయమున తనకే భార
ఌన్నదని తలచుట. అట్లు తలచరాదు. భరన్యాసము చేయవలెను.
ంగా తన భారము భగవంతుని తలపై వేయవలయును. చేతులెత్తి శర
గతిచేసిన ద్రౌపదిని స్వామి కాపాడెనని చెప్పబడెను. స్వకర్తృత్వము,
భోక్తృత్వము ఇత్యాదిదోషములు పోవును. జన్మ మరణములు తఱచుగ
ంగుచుండుటచేత కైంకర్యమునకు హాని కల్గును. భగవన్నామము, అవి
న్న భగవత్కైంకర్యము లభించుటకై వైకుంఠము నిచ్చును. శాశ్వతమైన
చ్ఛిన్నమైన సుఖము నిచ్చి మోక్షసామ్రాజ్య మిచ్చును. ప్రకృతిబంధము
గనే అవిచ్ఛిన్న కైంకర్యానుకూలమైన బలము కలుగును. స్వరూపానురూ
ుగ నన్నియు నిచ్చును. తండ్రియేది చేయునగునో దానినే చేయును. తల్లి
యం దధికప్రీతిచేత చేయుగూడని దానిని కూడ నంగీకరించును. అట్లే
వన్నామము పరమపదమును జేర్చి ముక్తానందము నిచ్చి విధిప్రకారము
్యయును కలిగించి యితర వాంఛ లేవియైనను నుండిన తీర్చును. ఇట్లు
కారానుసారముగ ఫలము నిచ్చునది భగవన్నామము. ఇట్టిదానిని --

బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే,
వాసుదేవ స్సర్వ మితి స మహాత్మా సుదుర్లభః.

-- గీత. 7.19

అనునట్లు అనేక జన్మములకు పిమ్మట కనుగొంటినని 'వాడినేన్'
పాశురమున తిరుమంగయాళ్వారులు చెప్పిరి.

జ్ఞానభక్తి వైరాగ్యములను గలిగించి భగవంతుని వలన గొప్పపదవిని
ద నర్హులను గావించునది భగవన్నామము. ఎల్లవారికిని కావలసియుం
ది సుఖము. ఆ సుఖ మనుభవించుటకు భగవత్కృప కావలయును.
త్కృప గలుగుటకు భక్తి యుండవలెను. భక్తి కల్గుటకు జ్ఞానముండ
ు. జ్ఞానమునకు శ్రవణము చేయవలయును. శ్రవణమునకు ఇచ్ఛ
ండవలెను. ఆ యిచ్ఛ గలుగుటకు ప్రతిబంధక పాపపరిహారము కావ
భగవన్నామస్మరణ చేసినటులైన తత్పాపహర మగును. పాపము

పోవగనే అంతఃకరణశుద్ధియై శ్రవణేచ్ఛ కలుగును. అటుపిమ్మట శ్రవణ మననాదులు లభించి జ్ఞానము కల్గును. జ్ఞానము చేత భక్తి కలిగి సాక్షాత్కారము గలుగును. అందుచేత భగవన్నామము ప్రథమసాధనమై యున్నది. 3వ ఆయిరం 1, 2, 3 తిరువందాదులందు పొయ్‌గై యాళ్వార్లును, పూదత్తాళ్వార్లును, పేయాళ్వార్లును ఇదే యర్థమును దెలిపిరి.

భగవంతుని జ్ఞాన భక్తి వైరాగ్యము లిమ్మని అడుగబనిలేదు. ప్రథమ సాధనము నిమ్మని యడిగిన చాలును. భగవంతునియందు సాధన భక్తి సల్పిన యెడల --

బ్రహ్మభూతః ప్రసన్నాత్మా న శోచతి న కాంక్షతి,
సమ స్సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్.

-- గీత. 18.54

అన్న చందమున సాధ్య భక్తి కలుగును. పిమ్మట పరోక్షజ్ఞానముగల్గి అది ముదిరి అపరోక్షజ్ఞానము జనించి అత్యంత భక్తి యొదవి మోక్షము లభించును.

న మాం దుష్కృతినో మూఢాః ప్రపద్యంతే నరాధమాః,
మాయయాపహృత జ్ఞానా ఆసురం భావ మాశ్రితాః,

-- గీత. 7.15

అను రీతి జన్మాంతరపాపముచేత భగవంతుని దలంపరు. అందు చేతనే భగవన్నామస్మరణ చేయవలెను. భగవన్నామోచ్చారణచేత పాపము వీడునా యనిన, ఇతరప్రాయశ్చిత్తము లేల చేయుబడుచున్నవి? పాప పరిహారమునకే గదా శాస్త్రములం దీ యీ పాపమున కీ యీ ప్రాయశ్చిత్తమని తెలుపబడియుండును?

మనము మనసుచేత చేయుచుండు పాపములకే మితిలేదు. ఇట్లగుటచేత మన మిక నెన్ని ప్రాయశ్చిత్తములను గావించుకొనగలము? ఒక పాపపరిహారార్థము ప్రాయశ్చిత్తముజేయ నారంభించితి మేని మంత్ర

లోప తంత్రలోప క్రియాలోపములు తటస్థించి మఱియును లెక్కింపరాని పాపములు చేరును. మనుజులు చేయునట్టి పాపములకు శాస్త్రమునందు ప్రాయశ్చిత్తములు చెప్పబడలేదు. అందుచేతనే భగవంతుడు --

సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ,
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః.
-- గీత. 18.66

అని సకల పాపపరిహార మగునట్లు ఒకే ప్రాయశ్చిత్తము నుపదేశించిరి. ఆ ప్రాయశ్చిత్తమునకు ద్రవ్యముతో పనిలేదు. శ్రమము లేదు. లేని పాపములు రావు. సకల పాపములు పోవును. అట్టి గొప్పప్రాయశ్చిత్తము--

వేదాంతదేశికులు శ్రీరంగనాథుని సేవించి "స్వామీ! నే జేసినది యొక పాపసముద్రముగ నున్నది. పాపములకు ప్రాయశ్చిత్తము లేర్పఱచుటకు మునులకు తోచలేదు. సర్వజ్ఞుడవగుటచేత నీవే యోజించి యొక ప్రాయశ్చిత్త మేర్పఱచు" మనగా రంగనాథుడు 'సర్వధర్మాన్ పరిత్యజ్య' అను ప్రాయశ్చిత్తమును జెప్పిరి.

3 తిరువందాది 10వ పాశురములో పేయాళ్వారులు భగవన్నామము నుచ్చరించునట్టి మహానుభావుని యొద్ద నివసించుటకు సుగుణములు వెదకికొనవచ్చును. అవి తమ సుఖమునకే వచ్చునని చెప్పిరి. విష్ణురహస్యమున భగవన్నామమునకును పాపమునకును సంవాదము జరిగెనని యిటులు చెప్పబడెను.

భగవంతుడు: నేను పాపమును పోగొట్టుదును.
పాపము : నీవు ఒక పాపమును పరిహరించులోపల మనసుతోనే అనేక పాపములు చేయుదును.

ఇట్లు సంవాదము జరిగిన పిమ్మట భగవన్నామమును నాలుకయందు కూర్చుండ బెట్టి అనేక జన్మార్జితపాపమును ఆహారముగ నీయగా అది ఆ పాపము నంతయు మ్రింగి మఱియును ఆకలియని నన్ను బాధించుటచేత

నీవు పాపివి అని, భగవన్నామము చెప్పెను. ఆ పాపమును కూడ మ్రింగుమని పాపము చెప్పెను. కాన భగవన్నామము పాపములను హరించులోపల మఱియును పాపముసేయ వలను పడదు. ఇత్యాదులైన అనేక కారణములచేత భగవన్నామోచ్చారణము సంసారసాగరమును దాటించుటకు ప్రథమసాధనమని తెలియుచున్నది. ఇట్టి భగవన్నామమును కులశేఖరులు నిరాతంకముగ నుచ్చరింపక తమ వాక్కున వచ్చునట్లు చేయుమని భగవంతు నుద్దేశించి "ఓ ముకుందా! (నీవు జ్ఞానేంద్రియ కర్మేంద్రియములందున్నావు. హృషీకేశుడ వగుట చేత నా వాక్కున గూర్చుండి) నీ నామము వెడలునట్లు చేయు" మని ప్రార్థించిరి. అట్లు ప్రార్థించుటకు హేతు వేమనగా --

నైవ కించి త్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్,
పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్ర న్నశ్నన్ గచ్ఛన్ స్వపన్ శ్వసన్.
ప్రలపన్ విసృజన్ గృహ్ణ న్నున్మిష న్నిమిషన్నపి,
ఇంద్రియాణీన్ద్రియార్థేషు వర్తన్త ఇతి ధారయన్.

-- గీత. 5.8,9

అను శ్లోకములందు చెప్పినటులు నిదుర లేచినది మొదలు మరల నిద్రించువఱకు చేయుచుండు పదుమూడు కార్యములందును అనగా చూచుట, వినుట, తాకుట, వాసనచూచుట, భుజించుట, నడచుట, నిద్రించుట, ఊపిరివిడుచుట, మాటలాడుట, వదలుట, గ్రహించుట, కన్నులు తెఱచుట, కన్నుమూయుట అను కార్యములందును మనకు కర్తృత్వము లేదు.

నారాయణేతి మంత్రోఽస్తి వాగస్తి వశవర్తినీ,
తథాపి నరకే ఘోరే పతంతీ త్యేతదద్భుతమ్.

'నారాయణ' అనెడి మంత్ర మున్నది. మనకు స్వాధీనమైన వాక్కున్నది. అయినను ఘోరమైన నరకకూపములో బడిపోవు చున్నారము అను సంగతి చూడగ చాల ఆశ్చర్యము. ఇందుచేత భగవత్ప్రేరణ లేకయే అతని నామము మన నోటరాదు.

అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహ మాశ్రితః,
ప్రాణాపాన సమాయుక్తః పచా మ్యన్నం చతుర్విధమ్.

-- గీత. 15.14

అను శ్లోకమున భగవంతుడు అగ్నిరూపుడై సర్వప్రాణుల శరీరముల నాశ్రయించి ప్రాణాపానములతో చేరి చతుర్విధాన్నములను పచనము చేయునట్లు చెప్పబడెను. ఆ భగవంతుడు మనము భుజించిన పదార్థము లందలి సారమును గ్రహించి అసారమును వెలుపలికి త్రోసివేయును. ఈ కారణములచేత మనకు స్వాతంత్ర్యము లేకున్నది. కాన --

మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మచేతసా,
నిరాశీ ర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః.

-- గీత. 3.30

బ్రహ్మణ్యాధాయ కర్మాణి సంగం త్యక్త్వా కరోతి యః,
లిప్యతే న స పాపేన పద్మపత్ర మివాంభసా.

-- గీత. 5.10

అను శ్లోకముల రీతి ఆ యా కార్యము లాచరించునపుడు భగవదాజ్ఞయని చేయవలెను. ఈ సంగతుల నెఱిగినవా రైనందున కులశేఖరులు తామే భగవన్నామోచ్చారణ చేయక భగవంతుని ప్రార్థించిరి. వా రట్లు ప్రార్థించుట యందును ఒక్క విశేష మున్నది. 'కురు' అనగా చేయుము అనియు, కారయ అనగా చేయించుము అనియు నర్థము. కులశేఖరులు 'కురు మే ముకుంద' యనిరి. అనగా ముకుందా ! నీవు నా వాక్కునం దుండి నీ నామమును చేయుము అనిరి. చేయించుము అని ప్రార్థించుటకు మాఱుగ చేయుమని వేడిరి. చేయించుము అని ప్రార్థించు పక్షమున, స్వామీ! నీవు చేయించుము. నేను చేసెదను అని చెప్పిన ట్లగును.

సర్వకర్మాణి మనసా సన్న్యస్యాఽఽస్తే సుఖం వశీ,
నవద్వారే పురే దేహీ నైవకుర్వ




-- 5.13

అట్లు కర్త, కారయిత స్వామియేగాన చేయించుమని చెప్పుటలో స్వాతంత్ర్యముండున ట్లర్థమగును. ఆ దోషము కలుగ కుండుటకై కులశేఖరులు 'కురు' అనిరి.

ఆత్మక్షేమార్థము భగవంతుడు ఒక్కొకని నోట వసించి, తన నామమును తానే ఉచ్చరింప వలసిన యక్కర యేమున్న దనగా బిడ్డకు క్షేమము గలిగించుటకై తల్లి పథ్యముగ నుండునట్లు, మాతృస్థానమున నుండు భగవంతుడు ఆత్మయొక్క క్షేమార్థము తన నామము నుచ్చరించుటయును విధియై యున్నది. శ్రీరామచంద్రుడు సమీపమం దుండగా సేతువు కట్టుట యను చిన్న కార్యము చేయబడెను. ఆతని నామము నోటగలవారు సంసార సాగరమునే దాట సమర్థులగుచున్నారు. ఇత్యాది కారణములచేత భగవంతుడు తన నామోచ్చారణను కృపచేయవలయునని తెలియుచున్నది.

కులశేఖరు లిట్లు ప్రార్థింపగా ఏ సమయమందు నా నామోచ్చారణ చేయవలయునని భగవంతునికి సంశయము కలిగెను. "ప్రతి పదం కురు మే ముకుంద" యని కులశేఖరులు ప్రార్థించిరి. ప్రతిపద మనగా "స్వామీ! ఒక్కొక కాలము నందును ప్రతివాక్యమునందును, ప్రతి శ్లోకమునందును--

నైవ కించి త్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్,
పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్ర న్నశ్నన్ గచ్ఛన్ స్వపన్ శ్వసన్.
-- గీత. 5,8

ప్రలపన్ విసృజన్ గృహ్ణ న్నున్మిష న్నిమిష న్నపి,
ఇంద్రియాణీంద్రియార్థేషు వర్తన్త ఇతి ధారయన్.
-- గీత. 5.9

అని నుడివిన ప్రకారము ప్రతికార్యమునందును, ప్రతిస్థానమునందును, ప్రతివస్తువును జూచినపుడును భగవత్సన్నిధాన మున్నదని తలచునట్లు చేయుమని యర్థము.

ఈ శ్లోకమునందు ప్రతి భగవన్నామమునకు 'ఇతి' చేర్చి చెప్పబడియున్నది. 'ఇతి' యనగా 'అని' యర్థము. శ్రీవల్లభ ఇతి, వరద ఇతి, దయాపర ఇతి, భక్తప్రియ ఇతి, భవలుణ్ఠన కోవిద ఇతి, నాథ ఇతి, నాగశయన ఇతి, జగన్నివాస ఇతి-అనగా శ్రీవల్లభాయని, వరదాయని, భక్తప్రియాయని, భవలుంఠన కోవిదాయని, నాథాయని, నాగశయనాయని, జగన్నివాసాయని నా నోట పలికించుము అని యున్నది. అట్లు ప్రతి భగవన్నామమునకు 'ఇతి' చేర్చి చెప్ప నవసరము లేదు. శ్రీవల్లభా, వరదా, దయాపర, భక్తప్రియా, భవలుణ్ఠన కోవిదా, నాథా, నాగశయనా, జగన్నివాసా అని అనిపించుము అని అన్నినామములను చెప్పి కడపట 'ఇతి' చేర్చి చెప్పియుండవచ్చును. కులశేఖరు లట్లు చేయక ప్రతి భగవన్నామమునకును ప్రక్క 'ఇతి' చేర్చి చెప్పటలో ఒకవిశేష మున్నది. శ్రీవల్లభ మొదలు జగన్నివాస వఱకు గల నామములను జెప్పి కడపట 'ఇతి' ప్రయోగించు పక్షమున పైజెప్పిన నామముల నన్నింటిని నానోట వచ్చునట్లు చేయుమని యర్థ మగును. అపుడు అన్నినామముల నుచ్చరించిననే మోక్షము కల్గునని యర్థమగును. ప్రతి భగవన్నామము తోడను 'ఇతి' చేరియుండుటచే శ్రీవల్లభా అని యనిపించుము చాలును; లేక వరదా అని యనిపించుము. అట్లుగాకున్న దయాపరా అని యనిపించు మని యిట్లే ఒక్కొక్కనామమును చెప్పి అడిగిన ట్లగును. ఒక్కొక్కనామము నుచ్చరించినను చాలునన్న యర్థము తెలుపబడినది. అందుచేతనే కులశేఖరులు అట్లు 'ఇతి, ఇతి' యని ప్రయోగించిరి.

ఒక్కొక్క భగవన్నామమునకు మోక్ష మిప్పించునంతటి శక్తి యుండెనేని కులశేఖరులు నారాయణా అనిపించుము అని ప్రార్థించియుండ రాదా? ఇన్ని భగవన్నామముల నెత్తి చెప్పి వాని నన్నింటిని చెప్పించుమని వేడనేల యనిన, భగవన్ముఖోల్లాసమునకు ఆతని ఒక్కనామమే చాలి యుండినను అనేక నామములను జెప్పటచేత ఆతని యనేక కల్యాణగుణములను వర్ణించిన ట్లగును. అట్లు వాని గుణానుభవము చేయుటకే కులశేఖరు లనేకనామముల నుదాహరించిరి.

## 2

జయతు జయతు దేవో దేవకీనందనోఽయం
జయతు జయతు కృష్ణో వృష్ణివంశప్రదీపః,
జయతు జయతు మేఘశ్యామలః కోమలాంగో
జయతు జయతు పృథ్వీభారనాశో ముకుందః.

దేవకీనందనః=శ్రీదేవకీదేవియొక్క పుత్త్రుడగు, అయం=ఈ, దేవః=భగవంతుడగు శ్రీకృష్ణుడు, జయతు జయతు=అందఱికంటె నుత్కృష్టుం డగునుగాక, వృష్ణివంశప్రదీపః=వృష్ణివంశమను యాదవవంశమునకు ప్రకాశము కలుగజేయువాడయిన, కృష్ణః=శ్రీకృష్ణపరమాత్మ, జయతు జయతు=సర్వోత్కృష్టుం డగుగాక, మేఘశ్యామలః=మేఘమువలె నల్లని దేహకాంతిగల, కోమలాంగః=మెత్తని అవయవములుగల శ్రీకృష్ణ భగవానుడు, జయతు జయతు=సర్వదేవతలకంటె నధికుడగు గాక, పృథ్వీ=భూమియొక్క, భార=బరువును, నాశః=పోగొట్టునట్టి, ముకుందః= శ్రీకృష్ణమూర్తి, జయతు జయతు=సర్వోత్కర్షతో విరాజిల్లుగాక!

దేవకీ పుత్త్రుడగు దేవునకు మఱియు మఱియు జయము గలుగుగాక! వృష్ణివంశమునకు ప్రకాశకుడైన శ్రీకృష్ణమూర్తి పునః పునః జయశాలి యగుగాక! వర్షాకాలపు మేఘమువలె నల్లనివాడై, కోమలములగు నవయవములు గల శ్రీకృష్ణుడు జయశాలి యగుగాక! జయశాలి యగుగాక! భూభారమును పోగొట్టువాడైన ముకుందుడు జయించుగాక, జయించుగాక!

శ్రీవల్లభేతి యను శ్లోకములో ఉదాహరింపబడిన భగవన్నామములలో ఒక్క శ్రీవల్లభా యనుటకు అర్థమును జూచినను భగద్వైభవము వ్యక్త మగుచున్నది.

సమోఽహం సర్వభూతేషు న మేద్వేష్యోఽస్తి న ప్రియః,
యే భజన్తితు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్.
-- గీత. 9.29

అను శ్లోకమున భక్తిసేయువారు నా యందున్నారు. నేను వారియం దున్నాననియును--

తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తి ర్విశిష్యతే,
ప్రియో హి జ్ఞానినోఽ త్యర్థ మహం స చ మమ ప్రియః.
-- గీత. 7.17

అను శ్లోకములో జ్ఞానికి అన్నిటికంటెను నేనే ప్రియుడను. నాకును వాడే ప్రియుడు అని శ్రీకృష్ణమూర్తి చెప్పిరి. ఇత్యాదికారణములచేత జ్ఞానియొక్క మనసు భగవంతునియందే నిలిచియుండును. చలించదు. ముప్పదిమూడుకోట్ల దేవతలయం దొక్కడైనను తనను ప్రయోజకుడని తలంపడు. నారాయణునియందే దృఢవిశ్వాసము గలిగియుండును. కులశేఖరులు మహాజ్ఞాని యగుటచేత శ్రీవల్లభేతి యను శ్లోకముయొక్క అర్థమును దలచి ఆ శ్లోకార్థభూతుడగు భగవంతునియొక్క కల్యాణ గుణములను చింతించి అతిస్నేహముచేత నా భగవంతుని కెట్టి కీడు వాటిల్లునో యని భీతిచెంది సకల కల్యాణ గుణపరిపూర్ణుడగు ఆ భగవంతుడు క్షేమముగ నుండవలయు నని కోరి రెండవశ్లోకమున జయతు జయతుదేవో యని యారంభించి మంగళాశాసనము చేసిరి. జనకమహారాజు సయితము సీతా దేవిని శ్రీరామచంద్రునకు సమర్పించి "ఇయం సీతా" యను శ్లోకమును చెప్పెను.

మేఘమువలెను, మెఱుపువలెను ప్రకాశించుచుండిన శ్రీరాముని, సీత నుజూచి వారికి రాజదృష్టిపడునని తలచి "భద్రం తే"-ఇట్టియల్లుడు లభించెనే క్షేమముగ నుండవలయునని యాశీర్వదించెను. యాజ్ఞవల్క్యుని వద్ద ఉపనిషదర్థ విచారము చేసిన జనకుడును అట్లాచరించెను.

జయతు జయతు అనగా సుఖముగను క్షేమముగను ఉండవలయునని యర్థము.

పితాసి లోకస్య చరాచరస్య
త్వమస్య పూజ్యశ్చ గురు ర్గరీయాన్,
న త్వత్సమోఽ స్త్యభ్యధికః కుతోఽన్యో
లోకత్రయేఽప్యప్రతిమ ప్రభావ.

-- గీత. 11.43

అను శ్లోకమున మూడు లోకములందును నీ సమమైన వస్తువులేదు. ఇక నీకు పైవస్తు వేది యుండు? నని అర్జును డనెను. అట్టి సర్వోత్కృష్ట వస్తువు బహుకాలము సుఖముగ నుండవలయునని యెంచి కులశేఖరులు ఆశీర్వదించిరి.

మనకు ప్రీతిపాత్రు లగువారు సముద్రస్నానమునకు బోయి యుండి రేని, వారి కేమి యాపద వాటిల్లునో యని మనకు భయముగనే యుండును. అతిస్నేహముచేత నట్లు దోచుట సహజము. ఇది లోకవిదితమైన సంగతి. మనతో సంబంధము లేనివా రెందఱో ఆ సముద్రస్నానమునకే పోయి యుండినపుడు వారిని గూర్చి మనకు కొంతయైన చింత కలుగదు. భగవంతుని యందలి యతిస్నేహముచేత కులశేఖరులును ఆశీర్వదించిరి. కులశేఖరులు కొన్ని గుణములను దెలుపు భగవన్నామముల నుదాహరించి యట్టి గుణములు గలవాడు జయించుగాక యనిరి.

ఈ రెండవ శ్లోకమున దేవః, దేవకీనందనః, కృష్ణః, వృష్ణివంశ ప్రదీపః, మేఘశ్యామలః, కోమలాంగః, పృథ్వీభారనాశః, ముకుందః-అను నెనిమిది భగవన్నామములను ప్రయోగించి అట్టివాడు జయించుగాక యనిరి.

ఆశీర్వదించునపుడు భగవంతునియొక్క యే నామమునైనను చెప్పి ఆశీర్వదింపరాదా? నారాయణుడు జయశాలి యగుగాక యనరాదా? పై దెల్పిన నామములే యుండవలయునా యనిన ఆ పదములే సందర్భాను కూలమైనవి. ఆ భగవన్నామముయొక్క ప్రయోజనము విశదముగ తెలుపబడుచున్నది.

దేవః అనగా సృష్టి స్థితి లయములను లీలగా చేయువాడని యర్థము. జ్ఞానము నిచ్చువా డనియు నర్థము. 'దివ్' అనుపదమునకు 19 అర్థములు గలవు. ఆ వస్తువు శుభముగ నుండని మ్మనిరి. ఈ రీతిగ నిత్యవిభూతిని దలచి భగవంతు డెట్టి మాహాత్మ్యము గలవాడని యాశ్చర్యపడి అంతలో నతని సౌల్భ్యము నిట్లు యోజించెను. నిత్యసూరులు పుష్పము, ధూపము మొదలగు వానిని గైకొనుడని ప్రార్థించు చుండగా వాని నంగీకరింపక, బద్ధాత్మలను కాపాడుటగదా ముఖ్య మని సంకల్పించి ఆ లోకమునం దవ తరించెను. ఎట్టి పరత్వముగలవా డెట్టి సౌలభ్యము గలవాడై యున్నాడని యానందించెను.

సాధారణముగ నొక విలక్షణమైన బిడ్డను చూచినపుడు వానిని గన్న తల్లి యెట్టి భాగ్యవతియో యని ప్రశంసించుట లోకానుభవమే. ఆ విధముగనే కులశేఖరులు పరత్వ సౌలభ్యములతో గూడిన భగవంతుని దలచి అట్టివానినిగన్న దేవకీదేవి జ్ఞప్తికి రాగా ' దేవకీనందనః' అనిరి. రామా యణమునందును 'కౌసల్యానందవర్ధనః' అని రాముని గూర్చి చెప్పబడెను. తిరుప్పావునందును "తాయ్ౖక్కుడల్ విళక్క్ ఇశ్ శెయ్ద దామోదరనై" అనగా తన యవతారముచేత తన తల్లియొక్క గర్భసమానము వేఱొక్క గర్భము కాదని పట్టము గట్టినవాడు త న్నాశ్రయించినవారి బంధమోచనము గావిం చువాడై యుండియు, తల్లికి స్వాధీనుడనైతినని తెలుపుటకు దారముచేత గట్టబడె ననియును తెలుపబడెను. పరబ్రహ్మమని కొనియాడబడు వస్తువు లోకోద్ధరణార్థము మధురాపట్టణమునం దాడుచున్నది. మధురభాగ్య మేమని వేదాంతదేశికులు గోపాలవింశతి యందు దెలిపిరి. ఆ శ్లోక మిది --

వ్రజయోషి దపాంగవేదనీయం
మధురాభాగ్య మనన్యభోగ్య మీడే,
వసుదేవవధూస్తనంధయం తత్
కి మపి బ్రహ్మకిశోర భావగమ్యమ్.

దేవః, దేవకీనందనః-అను రెండు పదములచేత భగవంతునియొక్క పరత్వ సౌలభ్యములు తెలుపబడెను. దేవకీదేవి పుణ్యాత్మురా లగుటచే

దేవకీనందను డని చెప్పబడెను గాని స్వామియొక్క సొంతపేరును గదా చెప్పవలయును? అతని పేరు కృష్ణు డనగా సాక్షాత్ పర బ్రహ్మము. ఈ కృష్ణ శబ్ద ప్రయోగమునకు మఱియొక్క కారణము, వేఱువిధమైన ప్రశ్న తెలుప బడుచున్నవి. ఏ మనగా ఈ రెండవ శ్లోకమునకు ప్రథమపాదమున దేవః -- అనగా జగత్సృష్ట్యాదులను లీలగా చేయు వాడని చెప్పబడెను. అందుచే నట్టికార్యము చేయుటచేతనే యతనికి గొప్పతనము గలదని యేర్పడుచున్నది. అత డిట్లు జగత్సృష్ట్యాదులను జేయకుండు పక్షమున ఘనుడు కాజాలడా? లోకమునందు ఏపనియును చేయకుండ కూర్చుండు వాడు కదా గౌరవనీయుడుగ నెన్నబడుచున్నాడు? ఇందుకు సమాధాన మతడు మనకు జ్ఞానేంద్రియ కర్మేంద్రియ శరీర మనోబుద్ధుల నిచ్చి కాపాడ దలచి జగత్సృష్ట్యాదులు చేయుచున్నాఁడు. అత డట్లు చేయకున్నను కృష్ణః -- అనగా పరిపూర్ణానంద స్వరూపుడు. అవాప్త సమస్తకాముడు. సరి.

తల్లిని సుఖపెట్టుట ఒక హెచ్చైన సంగతిగ తోచలేదు. అనగా నింతమాత్రమేకాక వృష్ణివంశప్రదీపః -- స్వామి తన తల్లిని మాత్రమే సుఖపెట్టలేదు. వృష్ణివంశమునకే సుఖము గల్గించెను. తిరుప్పావు నందును "మణివిళక్కై" -- మంగళకరమైన దీపమువంటివాడై అని స్వామియొక్క సంగతి చెప్పబడినది.

ప్రదీపః -- గొప్పదీపము. ఆ వృష్ణివంశమునకు స్వామి గొప్పదీపము వలెనుండెను. ఈ శ్లోకము యొక్క రెండుపాదములచేత చెప్పబడునట్టి పదార్థము గొప్పదనియు, దాని ననుభవింపవలయుననియు తెలియుచు న్నది. ప్రసిద్ధౌషధమైనను చేదుగ నుండెనేని దానిని పుచ్చుకొనుట కష్టము కదా! భగవన్నామమును, అతని కథను, ధ్యానమును, నిత్యవిభూతిని, లీలా విభూతిని, యోజించినటులైన ఆతని మాహాత్మ్యము తెలియవచ్చును. ఎంత గౌరవము గలిగి యుండినను ఆ పరమాత్మ సౌందర్యము గలిగియుండిననే, మనసు లయించును. కాన అతని కేమైన సౌంధర్యము కలదా యనిన

మేఘశ్యామలః -- మేఘమువంటి నలుపుగలవాడు. మేఘమని తెలుపుటచేత స్వామియొక్క అందము తెలియుచున్నది. మేఘమువలన వర్షమువచ్చును. వర్షము వలన అన్నము, దానివలన ప్రజావృద్ధి కలుగును. మేఘము తాపప రిహారము చేయును. గ్రీష్మకాలమున తపించువారికి వర్షాకాలపు మేఘము హాయినిచ్చునట్లు శ్రీరామదర్శనము సౌఖ్యప్రదమని రామాయణమున చెప్ప బడినది. మేఘశ్యామలః -- అను పదము దయాపరా అను పదముయొక్క అర్థమును సూచించుచున్నది.

కోమలాంగః -- వట్టి మేఘమును ఆశ్రయించిన ఫలమేమి? కోమ లాంగు డనుటచేత నీటి నుంచుకొనియుండు మేఘమువంటి అందము గలవాడని యర్థము. శ్రీకృష్ణమూర్తి యవతరింపగనే వసుదేవుడు 'తమ ద్భుతం బాలకం' అని స్వామియందమును వర్ణించెను. 'మణివణ్ణన్' ఇంద్ర నీలమణివంటి తిరుమేని కాంతిగలవాడు. ఆధ్యాత్మికాధి భౌతికాధి దైవిక తాపహరుడు, పురుషమోహనుడు.

ఈ శ్లోకము యొక్క మూడవ పాదమునందు స్వామి సౌందర్యము వర్ణింపబడెను. అతడు సౌందర్యవంతుడే. అతని నాశ్రయింపవలసినదే, కాని మనము పిలిచినయెడల వచ్చునా? పృథ్వీభారనాశః --

> పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్,
> ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే.
>
> -- గీత. 4.8

అని చెప్పినట్టివాడు, అట్లు పిలిచిన రానివా డయ్యేనేని మత్స్యవరాహాద్యవ తారముల నెత్తియుండునా? భక్తుల క్షేమార్థమే గదా అతని యవతారము కలుగును? అతనికి పరోపకారమే ఘనకార్యము. అతడు పృథ్వీభారనా శకుడు గనుక పిలిచిన వచ్చును. అడిగిన వరముల నిచ్చును. కాని, అతడిచ్చు సుఖములు ఐహికమున కుపయుక్తముగ నుండును. మోక్షము

కావలయునని కోరుకొనిన నతడేమి చేయుగలుగును? అనగా ముకుందః-- అతడు ఐహికసుఖము మాత్రమేకాక మోక్షము సయిత మిచ్చుటకు సమర్థుడు. ముకుందుడు కదా! మనకు మాత్రమే గాదు. మోక్షసామ్రాజ్యమునందఱికిని దయచేయును. ఇట్టివాడు సుఖముగ నుండవలయును. మనఃపూర్వకముగ జెప్పువారు పలుమారు చెప్పుదురు. అద్వితీయ పరమభోగ్యవస్తువగు స్వామియం దతిప్రీతిచేత కులశేఖరులు జయతు జయతు అని అనేకపర్యాయములు ప్రయోగించిరి.

## 3

ముకుంద మూర్ధ్నా ప్రణిపత్య యాచే
భవన్త మేకాంత మియంత మర్థమ్,
అవిస్మృతి స్త్వచ్చరణారవిందే
భవే భవే మేఽస్తు భవత్ప్రసాదాత్.

ముకుంద=ఓ ముకుందా!, మూర్ధ్నా=శిరస్సుతో, ప్రణిపత్య=దండము సమర్పించి, భవంతం=నిన్ను, ఏకాంతం=ఒక్కటియైన, ఇయంతం అర్థమ్= ఈ మాత్రము ప్రయోజనమును, యాచే=వేడుచున్నాను=(అది ఈ కార్యమే యనుట), భవత్ప్రసాదాత్= నీయనుగ్రహమువలన, త్వత్=నీయొక్క, చరణ+అరవిందే=కమలములనుబోలిన పాదములందు, అవిస్మృతిః=జ్ఞాపకము, మే=నాకు, భవే భవే=ప్రతిజన్మమందును, అస్తు=కలుగుగాక!

ఓ ముకుందా! నిన్ను శిరముతో సేవించి నియతముగా ఇంతమాత్రమే యాచించుచున్నాను. ప్రతిజన్మమునందును నీ యనుగ్రహముచేత నీ పాదపద్మములను మఱవకుందును గాక!

ఓ ముకుందా! నీవు మోక్షమిచ్చువాడవని నీ నామమే చెప్పు చున్నది. నీవు ప్రకృతిబంధమును విడిపించునట్టి వాడవు. ఏ విషయమం దైనను అధికుడైయుండు వాని యొద్దకు ఇతరుడు వచ్చెనేని వాడు తనకడ

నుండు భాగ్యమును అడుగవచ్చినా డనుకొనును. నేను నిన్ను యాచించుటచేత మోక్షమును అడుగుచున్నా ననుకొందువు. నన్ను ముక్తులతోడ జేర్చునట్టి శక్తి నీకు గలదు. అట్టి ప్రయోజనము నడుగుటకు నాకు యోగ్యత లేదు. శిరముతో సేవించి వేడుకొనుచున్నాను. నిపత్య=బాగుగను, ప్ర=విసుగుతో కాక భక్తిశ్రద్ధాపురస్సరముగ--

తస్మాత్ ప్రణమ్య ప్రణిధాయ కాయం
ప్రసాదయే త్వా మహమీశ మీడ్యమ్,
పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః
ప్రియః ప్రియాయార్హసి దేవ సోఢుమ్.

-- గీత. 11.44

అన్న రీతిని సాష్టాంగనమస్కారముచేసి వేడుకొనుచున్నాను. కర్మజ్ఞాన భక్తులను గలిగినవాడను గాను. నిన్ను యాచించుటకు నాకు యోగ్యత లేదు.

స్వామి : యోగ్యత కొంచెమైనను లేనివాడవు నాయొద్ద కేలవచ్చితివి?

కులశేఖరులు: అధికారముగలవారు ధార్ష్ట్యముతో అడుగునట్లు గాక వినయముతో యాచించుచున్నాను.

స్వామి : నీ పీఠిక చూడగా నీవేదో
తోచుచున్నది.

కుల : స్వామీ! కొంచె మొ
గాను. ఇంతకు

స్వామి : ఏమి యడిగెద

కుల : స్వామీ! బ్రాహ
దేవతగ పుట్టవే
వగుటచేత ఈ శ

సృష్టించెదవు. అట్లు సృష్టించు నపుడు శ్రేష్ఠతరమైన జన్మము నిమ్మని యడిగినను నీ విచ్చెదవు. లేక జన్మమే కలుగకుండ చేతువు. నే నేమో అట్లడుగను.

స్వామి : ఎందుచేత నడుగవు?

కుల : స్వామీ! అట్లడిగితినేని నిన్ను మిక్కిలి శ్రమ పెట్టవలసి వచ్చును. పొట్టపొడిచినను పొడి యక్షరము లేనివాడు దయాళుడగు ప్రభుని కడకేగి గొప్ప యుద్యోగ మిప్పించు మని యడుగనగునా? అట్లె కుక్క, గాడిద మొదలగు హీనజన్మములకు తగిన నన్ను జన్మరహితునిగ జేయుమనియు, లేక ఉత్తమ జన్మునిగ జేయుమనియు అడుగరాదు. ఇట్టివాని నట్టివానిగ జేయవలయునేని నీవు యోచించవలసియుండును. నా యోగ్యత నాకే తెలిసి యున్నది. ఏ జన్మమువచ్చినను నీ యనుగ్రహమున నీ పాదారవిందమును మఱవకుండవలయును. నీ వీ కార్యము చేయుటలో నీ శాసనమును తప్పి నడవవలసియుండదు.

(భాగవతములో బ్రహ్మ కృష్ణమూర్తి నుద్దేశించి "స్వామీ! నేను ప్రకృతిబద్ధుడను. అపచారపడితిని. ఈ యపరాధమునకు శిక్షగ ఏ జన్మము వచ్చినను రానిమ్ము. గొప్ప యధికారము గలవాడ నయ్యును దోషినై యున్నాను. నా కట్లు హీనజన్మము వచ్చినను నీ భక్త కోటిలో అధమ భక్తుడనై యుండి నిన్ను మఱవకుందును గాక! ఈ భాగ్యము లభించిన జాలును" అని వేడెను. బ్రహ్మదేవుని వంటివాడు అడిగిన యర్థము ప్రకారము కులశేఖరులు అడిగిరి.)

స్వామీ!

ఆబ్రహ్మభువనా ల్లోకాః పునరావర్తినోఽర్జున,
మా ముపేత్య తు కౌంతేయ పునర్జన్మ న విద్యతే.
-- గీత. 8.16

న్నట్లు మోక్షము నడుగను. ఏ జన్మమును, ఏ యవస్థను పొందినను
న్ను మఱవకుండవలయును. ఎంతటి గొప్ప జన్మమైనను భగవంతుని
ంఱచిన యెడల ప్రయోజనము లేదు. ఎంత హీనజన్మమైనను భగవంతుని
ంఱవకుండిన చాలును. అందుచేతనే కులశేఖరులు 'అవిస్మృతి' --
గవంతుని మఱవని స్మృతిని అడిగిరి.

## 4

నాహం వందే తవచరణయో ర్ద్వంద్వ మద్వంద్వహేతోః
కుంభీపాకం గురుమపి హరే నారకం నాపనేతుమ్,
రమ్యా రామా మృదుతనులతా నందనే నాపి రంతుం
భావే భావే హృదయభవనే భావయేయం భవంతమ్.

హరే=ఓ ముకుందా! అహం=నేను, అద్వంద్వహేతోః=చలి, వేడిమి,
ఃఖము, సుఖము అను ద్వంద్వదుఃఖములు లేకుండుటకై, తవ=దేవ
ారియొక్క, చరణయోః=పాదములయొక్క, ద్వంద్వం=జంటను, న
ందే=నమస్కరించువాడనుగాను. గురుమపి=ఓర్వరానిదైనను, కుంభీ
కం= కుంభీపాక మను పేరుగల, నారకమ్=నరకమును, అప
తుం=పోగొట్టుటకై మీపాదములకు నేను దండము సమర్పించ
ను. మృదు=మెత్తని, తనులతాః=తీగలవంటి దేహముగల, రమ్యాః=
ందర్యవతులైన, రామాః=స్త్రీలతోడ, నందనే=ఇంద్రుని యుద్యానవనము
ందు, రంతుమపి=క్రీడింపవలెననియైనను మీపాదములకు ప్రణామము

సమర్పించలేదు. భావే భావే=ప్రతి తలంపునందును, హృదయభవనే=మన స్సనెడి యింటియందు, భవంతం=దేవరవారిని, భావయేయం=ధ్యానింతును.

శీతోష్ణాది ద్వంద్వ దుఃఖనివృత్త్యర్థము నీ పాదయుగళము నాశ్ర యించలేదు. కుంభీపాకాది దారుణ నరకములను తొలగించుటకై నమస్కరించువాడను గాను. మృదువైన తీగవంటి శరీరములుగల సౌంద ర్యవతులైన స్త్రీలతో ఇంద్రుని ఉద్యానవనము నందు క్రీడించుటకు నిన్ను గొలుచువాడను గాను. (అయినను) తలంపు తలంపునందును హృదయ మను భవనమునందు నిన్ను దలంచుటకు అవకాశము గలుగవలయునని కోరుచున్నాను.

స్వామి : మూడవ శ్లోకమున శిరముతో సేవించి యాచించుచున్నా నంటివి. ఏ ప్రయోజనము నపేక్షించి యడుగుచున్నావో తెలుపవలయును.

కులశేఖరులు : అద్వంద్వ హేతోః.

స్వామీ!

త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున,
నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్.

-- గీత. 2.45

బ్రహ్మార్పణం బ్రహ్మహవి ర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్,
బ్రహ్మైవ తేన గంతవ్యం బ్రహ్మకర్మసమాధినా.

-- గీత. 4.24

అనునట్లు ప్రకృతిగుణములను, ద్వంద్వములను తొలగించుకొని జ్ఞానియై మోక్షమును పొందవలయుననియు 'నాహం వందే తవ చరణయోర్ద్వం ద్వమ్'- నేను నీపాదయుగళము సేవించుట లేదు.

స్వామి : నరకభయము లేకుండుటను అడుగుచున్నావా? మంచికోర కున్నను చెడుగు పోవలయునని కోరవా?

కుల : హే హరే! కుంభీపాకం గురుంనారకం అపనేతుమపి నాహం వందే.

ఓ హరీ! కుంభీపాకమనెడి ఘోరనరకమును పోగొట్టు కొఱకును నేను సేవింపనేరను.

స్వామి : నరకము పోగొట్టుకొనుటకు, మోక్షము పొందుటకు కోరిక లేకుండినయెడల ఐహిక సౌఖ్యముకంటెను హెచ్చైన స్వర్గలోకసుఖము కావలయునా?

కుల : రమ్యాః మృదుతనులతాః రామాః నందనే రంతుమపి నాహం వందే-సుందరులును, మృదువయిన తీగవంటి శరీరములుగల స్త్రీలతోడ దేవేంద్రుని యుద్యానవనమునందు క్రీడించుటకును నేను సేవింపను. (ఈ శ్లోకమునకు వేఱర్థము చెప్పబడుచున్నది).

స్వామి : స్వర్గమోక్ష నరకములు పరలోకములు. ఆ లోకముల విషయములను గూర్చి కోరకున్నను ఇహలోకసుఖములు వలదా?

కుల : అ=అకారవాచ్యుడా! ద్వంద్వ హేతోః=భార్యాభర్తల చేరికవలన గలుగు ద్వంద్వసుఖమునకుగాను నాహంవందే తవ చరణయో ర్ద్వంద్వం=నీ చరణద్వయమును సేవింపనేరను. హరే=ఓహరీ! ఆప=ఈశ్వరాంతరరహితా=అనగా అధికుడా! నారకం=అనేక మనుజులు సుఖపడునట్టి, కుంభీపాకం=పాత్రమున చేయబడిన వంటను, గురుమపి=అధికముగానైనను, న నేతుం=తీసికొనుటకు సేవింపను. అనగా అనేకులు సుఖపడునట్లు అధికముగ వంటలు కావలెనని కోరను; నందనేన=కుమారునితో గూడి, రమ్యాః=సుందరులు, మృదుతనులతాః=కోమలమైన తీగవంటి మేనులుగల, రామాః=స్త్రీలను, న రంతుమపి=అనుభవించుటకు నమస్కరింపను.

స్వామి : ఐహికాముష్మికములను రెంటిని వలదంటివి. ఏదియును అడుగనంటివి. మఱి నీకు కావలసినదేది?

కుల : 'భావే భావే హృదయభవనే భావయేయం భవన్తమ్.' ప్రతిజన్మమునందును హృదయాకాశమున నిన్ను ధ్యానింపవలయును. అట్లు నిన్ను ధ్యానించుటే సుఖము. ఈ దారపుత్రాదులతో గూడిన ఇంటి సుఖమును నేను కోరలేదు. ఈ యిల్లు శరీర ముండువఱకు ఉండును. అటుపిమ్మట పోవును.

మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః,
మన షష్ఠా నీంద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి.
-- గీత. 15.7

శరీరం య దవాప్నోతి యచ్చా ప్యుత్క్రామతీశ్వరః,
గృహీత్వైతాని సంయాతి వాయుర్గంధానివాశయాత్.
-- గీత. 15.8

పై శ్లోకము లట్లు జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు ఆత్మతోడ పోవును. కాపురముండు వాడు గోడకు కొట్టియుండిన చీలలను గూడ తీసికొనిపోవునట్లు ఆత్మ అంతవఱకు నివసించుచుండిన శరీరమును విడిచి మఱియొక శరీరమునకు పోవునపుడు ఇంద్రియాదులను గొంపోవును. అట్లగుటచేత హృదయభవనము వెంట వచ్చునట్టిది. ఆ భవనమున సుఖపడుటకు యోచింపవలయును. అశాశ్వతమైన. యీ యింటిసుఖములు కోరదగునా? నీవు వచ్చి హృదయము నలంకరించితివేని అందు కాపురము సల్పుచుండు కామక్రోధాదులు లేచిపోవుదురు. అందుచేత ఒక్కొక్క జన్మమునందును నీ ధ్యానము నిమ్మని మూడవ శ్లోకము ప్రకారము వేడుకొనుచున్నాను.

## 5

నాస్థా ధర్మే న వసునిచయే నైవ కామోపభోగే
యద్యద్భవ్యం భవతు భగవన్ పూర్వకర్మానురూపమ్,
ఏతత్ప్రార్థ్యం మమ బహుమతం జన్మజన్మాంతరేఽపి
త్వత్పాదాంభోరుహయుగగతా నిశ్చలా భక్తిరస్తు.

ధర్మే=పుణ్యసంపాదనమునందు, ఆస్థా=ఆసక్తి(మమ=నాకు) న=(అస్తి) లేదు, వసునిచయే=ధనరాశియందు, కామోపభోగే=సంసారమునందలి స్త్రీసుఖముల ననుభవించుటయందును, ఆస్థా=ఆసక్తి, మమ=నాకు, న (అస్తి) ఏవ=లేనేలేదు, భగవన్=ఓ పరమాత్మా, యత్ యత్=ఏది యేది, భవ్యమ్ =కావలసియున్నదో (తత్ తత్=అది యది), పూర్వ కర్మానురూపం = ముందటి జన్మమునందలి పాపపుణ్యకర్మములకు తగినట్టిదిగా, భవతు=అగుగాక, జన్మజన్మాంతరేఽపి =ప్రతిజన్మమునందును, త్వత్=మీ, పాదాంభోరుహ =కమలములవంటి చరణముల యొుక్క, యుగ=జంటను, గతా=పొందిన, నిశ్చలా=దృఢమైన, భక్తిః=అనురాగము, అస్తు=కలుగుగాక (ఇతి=అని), ఏతత్=ఇదే, ప్రార్థ్యం=కోరదగినది, మమ=నాకు, బహుమతమ్= మిక్కిలి యిష్టమైనది.

స్వామీ! ధర్మము, నిక్షిప్తధనముమీద నాకు అపేక్షలేదు. కామానుభవము మీదను ఆశలేదు. పూర్వకర్మానుసారముగ నేదేది కలుగదగినదో అది యంతయు కలుగుగాక. (అయినను) జన్మజన్మాంతరములయందును నీ పాదారవిందద్వయమునందు పొందియున్న భక్తి యన్నది స్థిరముగా నుండవలయును. ఇదినాకు ఇష్టమైనదిగను, కోరదగినదిగను ఉన్నది.

స్వామి : కుంభీపాక నరకము తొలగిపోవలయు ననియు, ద్వంద్వములను త్రోసికొని మోక్షమునకు పోవలయుననియు, స్వర్గమునకు బోయి సుఖపడవలయుననియు నీవు కోరుటలేదు. ఈ లోకమందైనను భార్యాభర్తలయొక్క సుఖమును, పుత్త్రినివలని సుఖమును, పదుగురికి అన్నమిడుటచేత గలుగు సుఖమును వలదంటివి. ఐహికాముష్మికములను వలదనుటకు నీవు పిచ్చివాడవా యేమి? నివృత్తి ధర్మముచేత మోక్షము లభించును. ప్రవృత్తి ధర్మము చేత నింద్రుని కృపగల్గి వర్షము గురిసి, పంటలు పండి అందువలన సుఖము లభించును. కాన ధర్మము వలదా?

కుల : స్వామీ! క్రింది శ్లోకమున ఐహికాముష్మిక సుఖములను వలదని యంటినిగదా! ఆ సంగతి మీరే చెప్పుచున్నారు. అట్టి సుఖములకు హేతువుగ నుండు ధర్మమునందును నాకు ఆశలేదని యీ శ్లోకమున జెప్పుచున్నాను.

స్వామి : పదుగురుకి అన్నమిడుటకు హేతువు ధనరాశిగ నున్నది. నిర్ధనుడు దారిద్ర్యముచేత పీడింపబడి అధర్మకార్యములందు ప్రవేశించి పాపియై నరకమున బడును. ఆ గతి రాకుండుటకు ధనమువలదా?

కుల : స్వామీ! పదుగురికి అన్నదానము చేయువలయుననియు, కుంభీపాకాది నరకములను తొలగించు కొనవలయుననియు కోరనని క్రిందటి శ్లోకముననే విన్నవించియుంటిని. ఆ కార్యములకు సాధనముగ నుండు ధనరాశి యందును నా కాస్థలేదని ఈ శ్లోకమున దెల్పుచున్నాను. (కులశేఖరులు వసుని అనక వసునిచయే యనిరి. అనగా తనకు ధనమునందు ఆశలేదని చెప్పక ధనరాశియందు ఆశలే దనిరి. ధనరాశియందు ఆస్థ లేదనుటచేత ధనమే వలదని యర్థము కాదు. స్వల్పధనమైనను లేకుండు పక్షమున శరీరయాత్ర జరుగవలదా?

నియతం కురు కర్మ త్వం కర్మ జ్యాయో హ్యకర్మణః,
శరీరయాత్రాపి చ తే న ప్రసిద్ధ్యే దకర్మణః.
-- గీత. 3.8

నిరాశీ ర్యతచిత్తాత్మా త్యక్తసర్వపరిగ్రహః,
శారీరం కేవలం కర్మ కుర్వ న్నాప్నోతి కిల్బిషమ్.
-- గీత. 4.21

పై శ్లోకములందు శరీరయాత్ర జరుగుటకై పాటుపడిన దోషములేదని చెప్పబడెను. దుర్లభో మానుషో దేహః అనియు, శరీరమాద్యం ఖలు

ధర్మసాధన మ్మనియు చెప్పియుండుటచేత శరీరయాత్రార్థము ధనము కావలసినదే.

ఆశాపాశశతైర్బద్ధాః కామక్రోధపరాయణాః,
ఈహంతే కామభోగార్థ మన్యాయేనార్థసంచయాన్.

(అను భగవద్గీత 16అధ్యా. 12శ్లోకమున ద్రవ్యమం దధికాశగల వారు అసుర స్వభావులని చెప్పబడినది. ఇత్యాది కారణములచేత కులశేఖరులు ధనమునందాశలేదనక ధవరాశియందు లేదనిరి.)

స్వామి : కామోపభోగసుఖములు అనుభవింపవలదా?

కుల : స్వామీ! పూర్వశ్లోకమున స్వర్గమునందును, ఈ లోకమునందును సుఖము వలదంటిని గదా? ఆ సుఖము లనుభవించుటకు హేతువగు కామోపభోగములందును నా కిచ్ఛలేదని ఈ శ్లోకమున దెలుపుచున్నాను. (నాస్థా ధర్మే న వసునిచయే నైవ కామోపభోగే యని ధర్మకామములకు నడుమ ధనమును జెప్పియుండుటచేత, ధనసాధనమగు ధర్మమునందును, ధనసాధమగు కామమునందును ఇచ్ఛలేదను నర్థము సూచింపబడెను. వసునిచయే యను సమాసము దేహళీదీప న్యాయముగ-అనగా ఇంటినడవయందుంచబడిన దీపము ఇరుప్రక్కలను ప్రకాశించు విధమున ధర్మకామములకును అన్వయించుచున్నది. అర్థమును సంపాదించునెడల ధర్మము సేయునగును. కామము ననుభవింప నగును.)

స్వామి : ఏమియును వలదనుచున్నావు. నాయొక్క శాసనము ననుసరించి ఆచరింపవచ్చునా?

కుల : స్వామీ! అట్లే సల్పవచ్చును. మీరు శాసనము మీఱి నడచుపక్షమున నేదైన నడుగవచ్చును.

చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః,
తస్య కర్తారమపి మాం విద్ధ్యకర్తార మవ్యయమ్.
న మాం కర్మాణి లింపంతి న మే కర్మఫలే స్పృహా,
ఇతి మాం యోఽభిజానాతి కర్మభిర్న స బధ్యతే.

అను భగవద్గీత 4అధ్యా. 13, 14 శ్లోకము లట్లు శాసనము ననుస రించువారు కాన, నా పూర్వకర్మానురూపముగను జరుపవచ్చును.

న చ మాం తాని కర్మాణి నిబధ్నంతి ధనంజయ,
ఉదాసీనవదాసీన మసక్తం తేషు కర్మసు.

అను భగవద్గీత 9అధ్యా 9 శ్లోకమున విషమసృష్టి చేసినను దోషము లేదంటిరి. నా కోరికలు దీర్చవలయునంటిరేని చట్టమునకు వ్యతిరేక ముగ నడువ వలసియుండుటచేత మీరు కొంత శ్రమ తీసికొనవలసి యుండును. నే నట్లు కోరను. (జ్ఞానులు ఇష్టప్రాప్తి, అనిష్టనివారణము కలుగవలయునని కోరరు. సుఖమో దుఃఖమో భగవంతు డీయవలయు నని యందురు. శాసనముండెనేని వాడే యిచ్చును. లేకున్న అడిగినను ప్రయోజనముండదు. కులశేఖరులును అట్లే ఏమియును కోరలేదు.)

స్వామి : నీ మనోరథము లీడేర్చుటకు నాకు శక్తి లేదని యెంచి యేమి యును వలదనుచున్నావా?

కుల : హే భగవన్! నన్ను మిగుల పురోవృద్ధికి దెచ్చుటకు మీకు శక్తి లేదని భావించి యేమియును వలదనుచున్నానని భావిం పవలదు. నీవు షడ్గుణ పరిపూర్ణుడవని నీ నామమే చెప్పక చెప్పుచున్నది.

సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః,
యే భజంతి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్.
-- గీత. 9.29

నీవు సర్వసముడవు. ఆకాశమువలె నంటి యంటక ఉన్నావు.

స్వామి : నీవు న న్నాశ్రయించితివి. న న్నాశ్రయించినవారు వ్యర్థులు కారాదు. ఏదియైన నడుగుము., అట్లు దేనినైన నడుగువాని యెడ నేను నా ప్రభుత్వము చూప వచ్చును గాని యేమియును వలదను వాని యెడ నేమి చూపవచ్చును?

కుల : అటులైన నడిగెదను. అనేక జన్మ విశేషములందును నీ చరణారవిందములందు అచంచలభక్తి కలిగియుండ్లనిమ్ము.

స్వామి : ఇంతమాత్రమేనా కోరుట?

కుల : దీనినే గొప్పగ భావించితిని. తదితరము నట్లు తలపరాదు.

జ్ఞేయం యత్త త్ప్రవక్ష్యామి యద్ జ్ఞాత్వామృతమశ్నుతే,
అనాదిమత్పరం బ్రహ్మ న సత్త న్నాసదుచ్యతే.

-- గీత. 13.13

మాం చ యోఽ వ్యభిచారేణ భక్తియోగేన సేవతే,
స గుణాన్ సమతీ త్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే.

-- గీత. 14.26

అను శ్లోకములలో చెప్పిన అనన్యభక్తి నిమ్ము. (భగవంతు నాశ్రయించి యేదేని కోరిన పక్షమున స్వల్పఫలముతోనే సరిపోవును. వాని నాశ్రయించి యేమియును కోరని పక్షమున--

అనన్యా శ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్.

-- గీత. 9.22

అనునట్లు యోగక్షేమములు వాని తలమీదనే పడునని కులశేఖరులు తెలియజేయుచున్నారు.

6

దివి వా భువి వా మమాస్తు వాసో
నరకే వా నరకాంతక ప్రకామమ్,
అవధీరిత శారదారవిందౌ
చరణౌ తే మరణేఽపి చింతయామి.

నరకాంతక=నరకాసురుని సంహరించిన స్వామీ! మమ=నాకు, దివి వా=స్వర్గమందుగాని, భువి వా=భూలోకమందుగాని, నరకే వా=నరకమునందుగాని, వాసః=ఉనికి, అస్తు=కలుగనీ, ప్రకామమ్=సమ్మతమే, అవధీరిత=తిరస్కరింపబడిన, శారద=శరదృతువు నందు వికసించిన, అరవిందౌ=కమలములుగల, తే=దేవరవారి యొక్క, చరణౌ=పాదములను, మరణేఽ=మృత్యుసమయమునందుగూడ, చింతయామి=ధ్యానించుచుందును.

నరకాసురుని సంహరించినవాడా! నాకు స్వర్గమందైనను, భూమియందైనను, నరకమందైనను వాసము కలుగునుగాక! చింతలేదు. శరత్కాల కమలములను తిరస్కరించునట్టి నీయొక్క పాదములను మరణకాలమునందును మిగుల స్మరించుచుందును గాక!

స్వామి : ధర్మార్థకామములను వలదనుచున్నావు. ధర్మము చేయని పక్షమున స్వర్గము లభించదు. అందుచేత భూమియందే వాసము గలుగును. అంతమాత్రమే కాదు. ధనలోపము ద్వారా చేయు పాపములవలన నరకవాసము గలుగును.

కుల : స్వామీ! నాకు స్వర్గమందైనను, భూమియందైనను, నరకమం దైనను వాసము కలుగుగాక! నాకు ఈ లోకము, ఆ లోకము అను వ్యవస్థ యుండినగదా? అన్నియు సమానమే.

స్వామి : ఇది మోసపు మాటగా నున్నది. కాని నీ మనఃపూర్వకమైన మాటగా నుండలేదు.

కుల : నరకాంతకా! అత్యంతము సమ్మతించి చెప్పుచున్నాను.

స్వామి : ఇంత సాహసముతో మాటలాడనేల?

కుల : స్వామీ! నరకాదులను గూర్చిన చింత నాకేల యుండవల యును? నరకాంతకుడని మిమ్మేల పిలిచితినో యెఱుగరా?

స్వామి : నరకాసురుని జంపితిని గాన నటులు పిలిచితివి.

కుల : స్వామీ! బ్రహ్మాదులు ప్రార్థించినందున రావణుని జంపితివి. ఇంద్రాదులు ప్రార్థించుట చేత నరకాసురుని జంపితివి. ఆ సంగతి నాకంత ముఖ్యమైనది గాదు. నేను జీవాత్మను. హీనుడను. ఏ స్థలమున వసించినను అందుచేత నాకు గౌరవము, అగౌరవము అనునవి హెచ్చవు, తగ్గవు. నే నధ మాధముడను. కాని నిన్ను నమ్మియుండు నేను నరకమున బడుదునేని నీవు వహించియుండు నరకనాశకుడను బిరుదు తోడనే తొలగిపోవును. అందువలన నన్ను గూర్చిన చింత నీది గాని, నాది కానేరదు.

అభూతపూర్వం మమ భావి కిం వా
సర్వం సహే మే సహజం హి దుఃఖమ్,
కింతు త్వదగ్రే శరణాగతానాం
పరాభవో నాథ! న తేఽనురూపః.

-- ఆళవన్దార్‌స్తోత్రమ్ 25.

నాథా! నే నిదివఱ కెన్ని హీనజన్మములో పొందియున్నాను. ఆ విషయము నాకు క్రొత్తకాదు. నాకు అదే సహజము. అనన్యభావముతో దలచుచుండు నన్ను రక్షింపవేని శరణాగత వత్సలుడు, దీనబంధుడు, పర మదయాళుడు అను నీపేర్లు తోడనే పోవునని దుఃఖించుచున్నాను. ఆ పేర్లను కాపాడుకొనుడని విన్నవించుచున్నాను గాని నన్ను రక్షింపవలయు నని ప్రార్థించలేదు-అని ఆళవందారు భగవంతునితో విన్నవించిరి.

భగవంతుడు కాపాడునని భక్తిశ్రద్ధాపురస్సరముగ భజించిన యెడల ఆ భక్తులు యమదూతలను జూడరు; స్వప్నమందైనను జూడరు అని భాగవతమున జెప్పబడెను.

తొండరడిప్పొడి యాళ్వారుల 'తిరుమాలై' తొలిపాశురమున భగవన్నామము ననుసంధించువారు యమునియొక్కయు, ఆతని దూతలయొక్కయు భయములేక వారిని తిరస్కరింప గలిగిన విధము చెప్పబడెను.

ఆ పాశుర మిది.

కావలిల్ పులనై వైత్తుక్కలి తన్నైక్కడక్కప్పాయ్న్దు
నావలిట్టుళి తరుకిన్టోమ్ నమన్తమర్ తలై కళ్మీతే
మూవులకుణ్డుమిళ్న్దము తల్వ విన్ నామమ్ కత్త
ఆవలిప్పుడమై కణ్డా యరఙ్గమాన కరుళావే.

స్వామి : ఏ కోరికలును లేని పక్షమున న న్నాశ్రయింపనేల?

కుల : స్వామీ! శరత్కాల కమలమును తిరస్కరించునట్టి నీ చరణములను స్మరింపవలసియుండుటచేత ని న్నాశ్రయించితిని. (వసంత గ్రీష్మ ఋతువులందు ఎండగా నుండును. వర్షఋతువునందువాన, హేమంత ఋతువునందు మంచు, శిశిరఋతువునందు చలిగాలిగా నుండును. శరత్కాలము నందలి చంద్రుని కవులు వర్ణింతురు. కులశేఖరులు కవి గాదు. భక్తిరసమును అనుభవించి యితరులను అనుభవింప జేయువారు. అట్టివా రయ్యును వారు స్వామి పాదము యొక్క కార్యమును చెప్పక వర్ణించిరి. ఇది భగవంతునికి అంత తృప్తిగ తోచలేదు.)

స్వామి : యాచింపవచ్చినవాడు వచ్చినపని చూచుకొని పోవలయును అట్లుగాక కవిమాడ్కి నా పాదములను వర్ణింపనేల?

కుల : స్వామీ! నేను మీపాదములను వర్ణింపబూనలేదు.'అవధీరిత శారదారవిందౌ' అని నీ పాదముయొక్క కార్యమును దెలిపితిని.

శారద=అనేక సంవత్సరములుగానుండు, అ=అధికమైన, రవిందం=అంధకారమును, అవధీరిత=పోగొట్టును. అందుచేతనే నీ పాదచింతనము నడిగితిని. నీయొక్క వ్రేలినఖమే కోటిసూర్యోదయప్రకాశమట్లుండును. ఇక రెండుపాదములందలి పదినఖముల కాంతి చేరెనేని ఎట్టి యజ్ఞానాంధకారమైనను పాయకుండునా?

స్వామి : అ ట్లెవరయిన నా పాదములను తమ హృదయాకాశమునందుంచుకొని అజ్ఞానాంధకారమును బోగొట్టుకొనిరా?

కుల : బ్రహ్మాదు లట్లు చేసియున్నారు. భాగవతమున నక్రూరుడు శ్రీకృష్ణ దర్శనార్థముపోవుచుండి మార్గమధ్యమున రథము దిగి "కంసా! నీకు నమస్కారము. సనకాదులు నారదాదులు ఏ భగవంతుని పాదనఖకాంతిచేత కోటిసూర్యులు, నక్షత్రములు, అగ్ని ప్రకాశము వీనిచేత కాని, అజ్ఞానాంధకారమును పోగొట్టుకొనిరో, ఆ భగవంతుని పాదములను సేవింపబోవుచున్నాను గదా యని ఆనందించెదను అనెను. ఈ కారణములచేత నీ పాదస్మరణము నడిగితిని.

స్వామి : మూడవ శ్లోకమున 'అవిస్మృతిః'=మఱపులేని స్మృతిని అడిగితివి. నాల్గవ శ్లోకమున 'భావే భావే'=ప్రతిజన్మమునను అని అడిగితివి. ఐదవ శ్లోకమున 'త్వత్పాదాంభోరుహయుగగతా నిశ్చలా భక్తిరస్తు'=నీపాదములందు నిశ్చలభక్తి యుండవలయునని కోరితివి. నీ వడుగునట్లు సదాధ్యానమును కలిగించుటకు సరిపడునా?

కుల : స్వామీ! అట్లు సదాధ్యానమును గలిగించుటకు కాదేని మరణకాలమందైనను కలిగించిన చాలును.

స్వామి : మరణకాలమున దలచిన చాలునా?

కుల : 'అంతే నారాయణస్మృతిః' అని మీరే భాగవతములో వేదవ్యాసముఖమున పలికితిరి.

అన్తకాలే చ మామేవ స్మరన్ముక్త్వా కళేబరమ్,
యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః.
-- గీత. 8.5

అని అంతిమస్మరణ చాలునంటిరి. ఇత్యాది కారణములచేత అంతిమస్మరణమే చాలునంటిని.

## 7

కృష్ణ త్వదీయ పదపంకజపంజరాంత
మద్యైవ మే విశతు మానసరాజహంసః,
ప్రాణప్రయాణసమయే కఫవాతపిత్తైః
కంఠావరోధనవిధౌ స్మరణం కుతస్తే.

కృష్ణ=ఓ కృష్ణమూర్తీ, మే=దాసునియొక్క, మానసరాజహంసః=మనస్సనెడి రాయంచ, త్వదీయ=దేవరవారి సంబంధమయిన, పదపంకజ=కమలములవంటి పాదములనెడి, పంజర=పంజరముయొక్క, అంతం=లోపలిభాగమును, అద్యైవ=ఇప్పుడే, విశతు=ప్రవేశించుగాక, ప్రాణప్రయాణసమయే=పంచప్రాణములు (దేహమును బాసి) పోవు వేళను, కఫ=శ్లేష్మము, వాత=వాయువు, పిత్తైః=ఉష్ణము అను త్రిదోషములచేతను, కంఠ=కంఠముయొక్క, అవరోధనవిధౌ=మూతపడుటయను కార్యము సంభవించినపుడు, తే=దేవరవారియొక్క, స్మరణం=ధ్యానము, కుతః=ఎట్లు? (భవేత్=కలుగును.)

కృష్ణా! నీ పాదకమలము లనెడు గూటి మధ్యమున నామనస్సనెడి రాజహంసమును ఇపుడే ప్రవేశింపనిమ్ము. ప్రాణప్రయాణ సమయము నందు కఫవాతపిత్తములు కంఠమును గ్రమ్మ కొనగా నీతలం పెక్కడిది?

కులశేఖరులు : స్వామీ! సదా నీ స్మరణమును కలిగించుటకు కాకున్నను మరణకాలమం దైనను కలుగునట్లు చేయుము.

స్వామి : మరణకాలమున నా స్మరణ కలుగవలయు నంటివి. అది మిక్కిలి నాజూకైన కాలము. అపు డెట్లు స్మరణ కలుగును?

కుల : అందుచేతనే ఇపుడే నీ స్మరణ కలుగవలయునని కోరెదను. ఆ సమయమున నా ప్రయత్నముచేత కలుగదు. నీవే కలిగించవలయును. ఆ ప్రాణ ప్రయాణ సమయమున కఫవాత పిత్తములు ముంచుకొని యుండగా ని న్నెట్లు ధ్యానింపనగును? అందుచేత నా మనస్సనెడి రాజహంసము తమ పాదకమలము లనెడు పంజరము యొక్కనడుమ ఇపుడే ప్రవేశింపనిమ్ము. హంసపక్షి జలమున సంచరించునట్టిది. అది సాధారణముగ నెక్కడను కనబడదు. కుబేరుని మానస సరస్సున సంచరించుచుండును. అది మిగుల తెల్లగనుండు శకుంతము.

కులశేఖరులు మనస్సును రాజహంస యని చెప్పుటకు కారణ మేమి? నా మనస్సనెడు చిలుకను అనియునరాదా అనగా, తదితర పక్షులు రజోగుణ తమోగుణములయొక్క రంగులు గలవి. హంసము సాత్త్వికగుణముయొక్క రంగు గలది. శుద్ధశ్వేతవర్ణము గలది. నా మనస్సనెడు రాజహంస నీ పాదములను పంజరమును ప్రవేశింపనిమ్ము అనగా నా మనస్సు రాగద్వేషములచేత విడువబడి శుద్ధసత్త్వాత్మకమైన నీ చరణమున ప్రవేశింపనిమ్ము అని ప్రార్థించుట.

హంస కోరునది తామరపుష్పముగాన ఈ హంసము ఆ తామరపుష్పమున ప్రవేశింపనిమ్ము అనిరి. ఇపుడే ప్రవేశింపనిమ్ము-అనుటచేత స్వామీ! నేడే నీ చరణారవిందమున ప్రవేశింపవలెను. నేడే నీ యనుగ్రహమున ప్రవేశించిన మనస్సు బయట రారాదు. నాయొక్క మనోహంసము బయట తిరుగుచున్నది. పోరాని తావులకు బోవుచున్నది. అందుచే నీ పాదారవింద మను గూటియందు ప్రవేశింపజేయుము అని ప్రార్థించిరి. 'అంతే నారాయణస్మృతిః' అనియుండగా నారాయణుని దలపవలయునని కోరక వాని చరణమును ధ్యానింపవలయునని కోరుటేల? యనగా ద్వయమంత్రమునందును చరణౌ అనిరి. (శ్రీమన్నారాయణ చరణౌ శరణం ప్రపద్యే, శ్రీమతే నారాయణాయ నమః-అనునది ద్వయము)

నదియందు దిగుటకు రేవు కావలసినట్లు శేషభూతుడైన ఆత్మ స్వామివద్ద చేరుటకు వాని పాదములు రేవుగ నున్నవి. శిరస్సు ఉత్తమాంగము, పాదము అధమాంగము. అట్టి యంగమునే ఆశ్రయించవలయును. భాగవతము మూడవస్కంధమున దేవహూతికి కపిలుడు ధ్యానము సంగతి చెప్పునపుడు చరణధ్యానమునే ప్రథమమున దెలిపెను. అతని పాదము వజ్రాదిరేఖలతో గూడినది. తిరుప్పాణి యాళ్వారులు 'అమలనాథ పిరాన్' అను గ్రంథమున పాదములనే ముందు వర్ణించిరి. ప్రణవార్థమైన 'అమలనాథపిరాను'నందు శ్రీరంగనాథుని చరణారవిందములు వచ్చి నా కన్నులలో దూరిన వనిరి. చిన్న అణువు పడిననే చూచుటకు కష్టమగును. గొప్ప పాదములు పడినందున నింకొకటి చూడజాలనని చెప్పిరి.

వేదాంతదేశికులు భగవద్ధ్యానసోపానము నందును ప్రథమమున పాదములను వర్ణించిరి. క్రమధ్యానము కల్గుటకు ఖండధ్యానము సేయువలయును. మేడమీదికి పోగోరువాడు మెట్టుమెట్టుగ పోవలయును గాని ఒకే పర్యాయము దూకిన పోగలడా? భగవంతుని యొక్కొక అవయవమును

ధ్యానించి వాదుకచేసి కొనవలెను. ప్రథమసోపానము భగవత్పాదారవిందము. తామర పుష్పమున కుండు వాసన ఈ చరణమునకు గలదా యనిన వేదములు, ఉపనిషత్తులు, నారదులు కొనియాడుచుండుటే వాసన. సర్పదష్టునికి చక్కెర చేదైనటులు మనకు భగవంతుని సంగతి చేదైయున్నది. నారదాదులకు తీపిగనున్నది. ఈ పుష్పమును ధరించినటులు ఆ పుష్పమునెట్లు ధరింపవచ్చును అనిన రత్నాల అంగడిలోని నగలను రాజులు ధరించుచున్నారు. దరిద్రులకు ఆ యాభరణములు లభించవు. అట్లే ఆ పుష్పమును ధరించువారు బ్రహ్మాదులు. వారికది శిరోభూషణము. మన్ను, జలము చేరియుండు ప్రదేశమున పుష్పము మొలచును. ఈ పుష్పమెచ్చట మొలచినది యనగా కావేరి కొల్లడము చేరినస్థలము చల్లగనుండగా నచ్చట పుట్టెను. హంస లున్నవా యనిన పరమహంసలైన సనకాదులు ఆశ్రయించిరి. తామరపుష్పము ఒక్కటిగ పుట్టదు; గుంపుగ మొలచునే యనిన శ్రీదేవీ భూదేవుల కరసరసిజముల నడుమ నైదవదియై యున్నది. ఆ పుష్పము ఏ జలమున ప్రతిఫలించె ననిన నా మనోభావన యను సరస్సున ప్రతిఫలించెను. ఇట్లని వేదాంతదేశికులు విన్నవించిరి.

కుల : స్వామీ! నీ పాదములను మరణ కాలముఁనందే తలచినను చాలును.

యం యం వాపి స్మరన్ భావం త్యజత్యంతే కళేబరమ్,
తం తమేవైతి కౌంతేయ సదా తద్భావభావితః,

-- గీత. 8.6

తస్మా త్సర్వేషు కాలేషు మా మనుస్మర యుధ్య చ,
మయ్యర్పిత మనోబుద్ధి ర్మామేవైష్య స్యసంశయః.

-- గీత. 8.7

అను శ్లోకములందు సదా తలచుచుండిననే అంత్యకాలమున స్మరణ కల్గునంటివి. అదియును గాక వరాహ పురాణమున 'శరీరము దృఢముగ

నుండునపుడు తలచిరేని వారిని జ్ఞప్తియందిడుకొని అంత్యకాలమున వారి యొద్దకు వచ్చెద నంటివి. భాగవతమున కపిలదేవహూతి సంవాద మున మరణకాలమునందు బంధువులు మొదలగు వారిచేత పీడింపబడు టకు ముందే స్వామిని స్మరించవలయునని చెప్పబడెను. కాన నిపుడే స్మరణమును కలిగించవలయును.

పెరియాళ్వార్ తిరుమొళి 4పత్తు 10తి.మొ 1పాశురము. తుప్ప డయారై అను పాశురమున అప్పోదు కిప్పోదే శొల్లివైత్తేన్=అనగా, మరణకాలమునకై యిపుడే చెప్పుచున్నానని చెప్పబడెను.

8

చింతయామి హరిమేవ సంతతం
మందమంద హసితాననాంబుజమ్,
నందగోపతనయం పరాత్పరం
నారదాదిమునిబృంద వందితమ్.

నందగోపతనయం=నందునికి సుతుడును, పరాత్పరం=మిక్కిలిశ్రేష్ఠ డును, నారద+ఆది=నారదుడు మొదలుగాగల, మునిబృంద=మునులస మూహముచేతను, వందితమ్=నమస్కరింపబడువాడును, మంద మందహ సిత=మిక్కిలిస్వల్పమైన చిఱునగవుగల, ఆనన+అంబుజం=కమలమువంటి మోముగలవాడునైన, హరిమేవ=శ్రీమహావిష్ణువునే, చింతయామి=తలంచు చున్నాను.

మందస్మితముతో గూడిన ముఖపద్మము గలవాడును, నందగోపుని కుమారుడును, పరాత్పరుడును, నారదాది మునిసమూహముచేత సేవింప బడినవాడును అగు హరినే సదా ధ్యానించెదను.

స్వామి : నీవు మరణకాలమున నా స్మరణ కలుగవలయు నను చున్నావు. ఆ సమయమున స్మరించుటకు అనువు గానందున నిపుడే స్మరించుచున్నాననికూడ అనుచున్నావు. నీవంటివా రెందఱో నాదయకై ఎదురుచూచుచుందురు. అనేకులు నన్ను ఆశ్రయించి యుండుటచేత నీ సంగతిని నే నొకసమయమున మఱచినను మఱతును.

తస్మా త్సర్వేషు కాలేషు మా మనుస్మర యుధ్య చ,
మయ్యర్పిత మనోబుద్ధి ర్మా మేవైష్యస్య సంశయః.
-- గీత. 8.7

అనన్యచేతా స్సతతం యో మాం స్మరతి నిత్యశః,
తస్యాహం సులభః పార్థ నిత్యయుక్తస్య యోగినః.
-- గీత. 8.14

సర్వద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్య చ,
మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణ మాస్థితో యోగధారణామ్.
-- గీత. 8.12

భక్త్యా త్వనన్యయా శక్య అహమేవం విధోఽర్జున,
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప.
-- గీత. 11.54

మయి చానన్యయోగేన భక్తి రవ్యభిచారిణీ,
వివిక్తదేశసేవిత్వ మరతి ర్జనసంపది.
-- గీత. 13.11

సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ,
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః.
-- గీత. 18.66.

దైవీ హ్యేషా గుణమయీ మమమాయా దురత్యయా,
మా మేవ యే ప్రపద్యంతే మాయా మేతాం తరంతి తే.
-- గీత. 7.14



అట్లు నాయందు అవ్యభిచారమైన భక్తియుంచి నన్నే సదా తలంచుచు, నాయందు భారమువేసి యుండుము.

నైవ కించిత్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్,
పశ్యన్ శృణ్వన్ స్పృశన్, జిఘ్ర న్నశ్న న్గచ్ఛన్ స్వపన్ శ్వసన్.
-- గీత. 5.8

ప్రలపన్ విసృజన్ గృహ్ణ న్నున్మిషన్నిమిషన్నపి,
ఇంద్రియాణీంద్రియార్థేషు వర్తన్త ఇతి ధారయన్.
-- గీత. 5.9

అని చెప్పిన పదుమూడు కార్యములందును అనగా నిద్రలేచినది మొదలు నిద్రించువరకు గల సకలకార్యములందును నన్ను దలచుచు అభ్యాసము చేయుచుండుము. నీకోరిక ప్రకారము అంతిమస్మరణ కలిగించెదను.

కుల : స్వామీ! మీ యాజ్ఞానుసారము సదా హరినే తలంచెదను.

స్వామి : నీయొక్క అశుద్ధమైన మనసుతో నన్ను ధ్యానించగలవా? నేను వచ్చి కాపాడుదునా?

కుల : స్వామీ! మిమ్ము దలచుటకుముందే కదా నేను పాపిగనుందును?

తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః,
వశే హి యస్యేంద్రియాణి తస్యప్రజ్ఞా ప్రతిష్ఠితా.

అట్లు అశుద్ధమైన మనసును నీకు అర్పించినయెడల నీవు వసించుటకు యోగ్యముగాని ఆ చోటును నీవే శుద్ధపఱచుకొందువు. అగ్నిదేవుడు వచ్చునని చీకటిని పోగొట్టుటకుగాను ఎన్ని ప్రయత్నములు చేసినను అంధకారము పోదు. ఆ యగ్నిదేవుడే వచ్చి చీకటిని పోగొట్టవలయును. నీకు

హరియని పేరేల కలిగెను? నిన్ను స్మరించిన మాత్రమున అశుద్ధతను పోగొట్టువాడ వగుటచేతనే గదా? అగ్నిని అశుద్ధుడు స్పృశించినను కాల్చును. తెలిసియో తెలియకయో యెటుల ముట్టినను కాల్చును. విరేచనమునకు వాడుకొను మాత్రను తెలియక నోటవేసికొనినను, దాని కార్యముకాక మానదు. నీ నామము లోపల ప్రవేశించి సకల పాపములను వెలుపలికి తఱిమివేయును.

యతతో హ్యపి కౌంతేయ పురుషస్య విపశ్చితః,
ఇంద్రియాణి ప్రమాథీని హరంతి ప్రసభం మనః.
-- గీత. 2.60

అను రీతి ఇంద్రియములు స్వాధీనము కానివిగ నుండినను--
తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః,
వశే హి యస్యేంద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా.
-- గీత. 2.61.

నీకు సమర్పించునెడ నీవే శుద్ధపఱచెద నంటివి.

అనన్యచేతాః సతతం యో మాం స్మరతి నిత్యశః,
తస్యాహం సులభః పార్థ నిత్యయుక్తస్య యోగినః.
-- గీత. 8.14

అంటిరి గాన వేఱుచింతలేక సదా హరిని చింతించెదను.

స్వామి : బ్రహ్మాదులు, నారదాదులు కూడ నా విషయమున భయముతో వర్తించుచున్నారు. నీవు మిగుల నిర్భయముగ మాటలాడుచున్నావు. కారణమేమి?

కుల : స్వామీ! నేను సమయమును జూచియే వేడుచున్నాను. నీ మందహాసముతో గూడిన ముఖమును జూచి నిర్భయముగ

మాటలాడ గలిగితిని. (భగవంతుని నవ్వుతో గూడిన వానిగా ధ్యానింపు మని నారదుడు ధ్రువుని కుపదేశించెను). ఎవ్వరైనను మిగుల నవ్వుచుండిరేని అత్యాశ్చర్యమున దేలుచుండునట్టి వారికి ఇతరుల మాట చెవికెక్కదు. నవ్వుకొంచెమయినను లేకుండు పక్షమున నేదో కోపముండుటచేత నితరులు చెప్పుమాట వారి చెవికెక్కదు. మందహాసముతో నుండునపుడు మనఃప్రసాద కాలముగ నుండును. అదియే మిగుల సంతోషకాలము. స్వామీ! నీ విట్లే మందహాసముతో నున్నాడవు. కనుక నే నింత చనవుతో మాటలాడుచున్నాను.

స్వామి : నా ముఖమున గల సంతోషమును జూచి యడుగునట్లు చెప్పుచున్నావు. నేను సంతోషముఖమును జూపకుంటినేని యిట్లడిగియుండవా?

కుల : స్వామీ! ప్రహ్లాదుడు నృసింహమూర్తిని జూచి "స్వామీ! బాలుడను, అసురుడను. అందునను ద్వేషియొక్క పుత్త్రుడను. ఇట్టివాడనగు నాకు నిన్ను స్తోత్రము చేయుటకు ఏమియు తెలియదు. బ్రహ్మాదులు మాత్రము నీ మాహాత్మ్యము నెఱిగి స్తుతించినారా? ఏదో కొంత స్తోత్రముచేయువలెనని చేయుదురు. వేదములకు నిన్ను పొగడదరమా? కాన నిన్ను స్తుతించుటకు నేను అర్హుడనుగాను. చిన్నబిడ్డస్తోత్రమునకు సంతసించుదు వని చేసితి" నని విన్నవించెను. నేనును అట్లే సమయము చూచి స్తుతించినచో నీకృపారసమును జూపుదు వని తలంచితిని.

స్వామి : శ్రీవల్లభేతి యను మొదటి శ్లోకము మొదలు విశేషముగ స్తుతించుచున్నావు. నేను మిగుల ఘనుడనే యగుదునా?

కుల : స్వామీ! నీవు పరాత్పరుడవు.

మత్తః పరతరం నాన్యత్కించిదస్తి ధనంజయ,
మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ.

నీవు అన్నిటికి పైవాడవు. పరము, పరతరము నీవే. నీకు పైవస్తువు లేదు. నీవు పరత్వమున ఆ రీతిగ నుండినను సౌలభ్యమును జూపుటకు నందగోపతనయుడవై యున్నావు. వసుదేవుని యొద్దనుండిన నీ సౌలభ్యమును జూపుటకు సరిపడదని యెంచి నందగోపు నింట చేరి యతనికి తనయుడ వైతివి. పరత్వసౌలభ్యములందు నిన్ను మించినవారు లేరు.

స్వామి : నే నిపుడు సౌలభ్యమును జూపుటకయి మానుషరూపమును ధరించి యున్నాను. నిత్యవిభూతిని విడిచి లీలావిభూతికి వచ్చి యున్నాను. ఆ శరీరముతో నుండలేదు. నేను సౌలభ్యమునే చూపుచుండుటచేత సౌలభ్యమునే చర్చింపవలయును. పరత్వము నెట్లు చెప్పనగును? దానిని గూర్చి ప్రశంసింపనే రాదుగదా? నా రీతికి తగినట్లు గదా స్తుతించవలయును? యోచింపక "కృష్ణ త్వదీయ పదపంకజ పంజరాంత మద్యైవ మే విశతు మానసరాజహంసః" అంటివి.

కుల : స్వామీ! యోచించియే అట్లంటిని. నీవు నారదాది ముని బృంద వందితుడవు.

ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యా మ్యనసూయవే,
జ్ఞానం విజ్ఞానసహితం యద్ జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్.
-- గీత. 9.1.

అన్నట్లు మూఢులు వి న్నవమతింతురు.

అవ్యక్తం వ్యక్తి మాపన్నం మన్యంతే మా మబుద్ధయః,
పరంభావ మజానంతో మమావ్యయ మనుత్తమమ్.
-- గీత. 7.24

తెలివిలేనివారు నిత్యుడు, సర్వోత్తముడు నగు నీ పరత్వరూపము నెఱుగరు. ఇపుడు పుట్టుట చేతనే నీకు జన్మము కలిగిన దనుకొందురు. శరీరమును గమనించు తెలివిలేనివా రిట్లు తలచెదరు గాని నిన్ను బాగుగ నెఱిగి యుండువారికి నీ శరీరముతో పనియేమి? నీ కృష్ణ రూపమును దర్శించి మహర్షులు నిన్ను సేవించుచున్నారు గదా! నారదుడు తఱచుగ వచ్చి సేవించిపోవుచుండలేదా? ఇంద్రుడు కామధేనువుతోడ వచ్చి దాని క్షీరముతో నీ కభిషేకము చేసి ప్రార్థించి పోలేదా?

పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్,
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే.

-- గీత. 4.8

ప్రతియుగమునందును దుష్టశిక్షణము, శిష్టపరిపాలనము చేసి ధర్మమును స్థాపించుటకు అవతరించెదనని చెప్పినట్టివాడవు గదా! నేను నీ విషయమయి కొన్ని గుఱుతులు కనిపెట్టియున్నాను. భక్తులు నిర్భయముగవచ్చి ఆశ్రయించుటకు ఈ రూపమును ధరించితివి ("పరాత్పరం నారదాది మునిబృందవందితమ్" అని పరాత్పరమునకు ప్రక్క నారదాది మునిబృందవందితమని చెప్పుటచేత స్వామియొక్క పరాత్పరత్వమునకు నారదాదులు సాక్షులని తెలియుచున్నది. ఎటులన, శ్రీకృష్ణమూర్తి ఆవులను మేపుచుండినపుడు నారదాదులు వచ్చి నమస్కరించుచుండిరి. స్వామి పరాత్పరుడు కాడేని వారిట్లు నమస్కరించియుందురా?).

## 9

కరచరణసరోజే కాంతిమన్నేత్రమీనే
శ్రమముషి భుజవీచివ్యాకు లేఽగాధమార్గే,
హరిసరసి విగాహ్యాపీయ తేజోజలౌఘం
భవమరుపరిఖిన్నః ఖేద మద్య త్యజామి.

భవ=సంసారమనెడి, మరు=నీళ్లు లేనిచోట తిరుగుటచేతను, పరిఖిన్నః=డస్సినట్టి (అహం=దాసుడనైన నేను), కరచరణసరోజే=చేతులు, కాళ్లు అను కమలములు గలదియు, కాంతిమత్=కాంతిగల, నేత్ర=కన్నులనెడి, మీనే=చేపలు గలదియు, శ్రమముషి=బడలికను పోగొట్టునదియు, భుజ=చేతులనెడి, వీచి=అలలచేత, వ్యాకులే=కలగినదియు, అగాధమార్గే=లోతైన త్రోవగలదియు నగు, హరిసరసి=శ్రీమహావిష్ణువనెడి కొలనిలో, విగాహ్య=ప్రవేశించి, తేజో జలౌఘం=తేజస్సనెడు జలసమూహమును, ఆపీయ=మెండుగా పానముచేసి, ఖేదం=బడలికను, అద్య=ఇప్పుడే, త్యజామి=విడుచుచున్నాను.

సంసారమను మరుకాంతారమున బడి శ్రమచెందిన నేను పాణిపాదము లనెడు పద్మములు గలదియు, మనోహరములగు నేత్రములనెడు చేపలు గలదియు, శ్రమను బోగొట్టునదియు, భుజములనెడి యలలచే వ్యాకుల మయినదియు, అగాధంబు నగు హరియనెడి సరస్సునందు ప్రవేశించి కాంతి యనెడి యుదకము ద్రావి యిపుడే ఖేదమును విడిచెదను.

స్వామి : నిన్నుజూడ మిగుల పరితపించువాని భంగి తోచెడిని. నీకు ప్రాప్తించియున్న కష్టమేదో తెలిపెదవా?

కులశేఖరుడు : చెట్లు, జలములేని ఎడారిభూమిలో బడిన నేను మిగుల తపించిపోవుచున్నాను.

స్వామి : అది యే స్థలము?

కుల : సుఖలేశ మయినను లేనట్టిదియును, కష్టమే కలిగియుండునట్టిదియును అగు సంసారమే ఆ స్థలము. దానియందుబడి తపించునట్టి నేను తపనచేత శ్రమపడుచున్నాను.

స్వామి : అటులయిన నిపుడేమి చేయబోవుచున్నావు?

కుల : మహాతాపముతో అల్లాడువాడు సరస్సు చిక్కునేని మునుగకుండునా?

స్వామి : నిజము. నీ వే సరస్సునందు మునుగబోవుచున్నావు? ఇట్లు మహాతాపముచే తపింపబడుచుండు నీవు నాయొద్దకు వచ్చి తరలిపోక ఆలస్యము చేయుచున్నావు.

కుల : స్వామీ! నేను మునుగ దలచిన స్థలము నీవే. హరియను పరస్సున మునిగెదను.

స్వామి : సరస్సునందు తామర లుండవా? నాయందే తామర లున్నవి?

కుల : నీ కర చరణము లనునవియే సరోజములు.

స్వామి : నీటియందు చేపలుండవా?

కుల : కాంతిగల నీ కన్నులే ఆ చేపలు.

స్వామి : కొలనిలో మునిగినవానికి శ్రమ పరిహార మగును. నీకు నావలన ఏ తాపము తీఱును?

కుల : ఇతర జలములందు స్నానము చేయుటచేత తత్కాల తాపహర మగును. శ్రమముషి=ఈ సరస్సునందు ఒక్క పర్యాయము మునిగినను సకలసాంసారిక దుఃఖము లనునట్టి తాపము మటుమాయ మగును.

స్వామి : అల లుండవలదా?

కుల : సాధారణమయిన సరస్సులకు పరిమాణముండును. శ్వాసను బంధించి లోపల ప్రవేశించునట్లైన దాని లోతును కనుగొన వగును. హరిసరస్సుయొక్క లోతుకు ముగింపు తెలియదు. తమకు భగవంతుని లోతు తెలియదని వేదములే చెప్పుచున్నవి. వేదపురుషుడు భగవన్మార్గమును వెదకుచుండియు తెలిసికొనలేదు. వాని మార్గము అగాధము. గట్టుతెలియదు. మన వల్లకాదని నిలువవలయును గాని దానికి ముగింపులేదు. గరుడుడు ఆకసమున బోయి మరల తిరిగివచ్చెనేని మీద నింకను

ఆకాశము లేదని అనుకొననగునా? పక్షులు తమ తమ యోగ్యత కొలది యెగుర గలవు. ఇట్టి అగాధ మయిన హరిసరస్సున మునిగి స్నానమాచరించెదను.

స్వామి : సరస్సున జలముండవలదా?

కుల : వేదములందు నిరూపింపబడిన నీ కల్యాణగుణములనెడు తేజోజల మున్నది. దానిని త్రాగెదను. అటులు త్రావి ఆధ్యాత్మికాధిభౌతి కాధిదైవికము లను తాపత్రయమును బాసెదను.

ప్రసాదే సర్వదుఃఖానాం హాని రస్యోపజాయతే,
ప్రసన్నచేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతి.

-- గీత. 2.65

అనునట్లు ఆ జలమును త్రావిన పిమ్మట సంసారమును విడిచి నిత్యముక్తులతోడ గూడి యానందింపవలయును.

స్వామి : అటు లయిన మునిగి త్రాగితివా? తాపము తీరెనా?

కుల : ఆహా! మునిగితిని. తాపము తీఱినది.

స్వామి : అటులయిన లేచిపొమ్ము.

కుల : శ్రమ పరిహారమైనగదా లేచిపోవుట? (అనగా తనివి తీఱలేదని భావము).

## 10

సరసిజనయనే సశంఖచక్రే
మురభిది మా విరమ స్వచిత్త రంతుమ్,
సుఖతర మపరం న జాతు జానే
హరిచరణస్మరణామృతేన తుల్యమ్.

స్వచిత్త=ఓమనసా, సరసిజనయనే=కమలమునుబోలిన కన్నులు గల వాడును, సశంఖచక్రే=శంఖచక్రములతో గూడినవాడును అగు, మురభిది=మురాంతకుడయిన శ్రీమహావిష్ణువునందు, రంతుం=విహరించుటకు, మా విరమ=వెనుదీయకుము, హరి=విష్ణువుయొక్క, స్మరణ=సంకీర్తనమనెడు, అమృతేన=అమృతముతో, తుల్యం=సమానమయిన, సుఖతరం=మిక్కిలియానందమును గలుగజేయునట్టి, అపరం=మఱియొక వస్తువును, జాతు=ఒకప్పుడును, న జానే=గుర్తెఱుగను.

ఓ మనసా! పద్మములవంటి కన్నులుగలవాడును, శంఖచక్రములు గలవాడును నగు మురహరుని యందు రమించుటకు వెనుదీయకుము. హరిచరణస్మరణమనెడి అమృతముతో సమానమైన మిక్కిలి యానందమును గలుగుజేయు మఱియొక వస్తువును ఒక కాలమందును ఎఱుగను.

అంతిమస్మరణ కలుగుటకుగాను సదా తలచుచుండు మని భగవంతుడు కులశేఖరుల నాజ్ఞాపించగా, వారు 8వశ్లోకమున "చింతయామి హరిమేవ సంతతమ్"=హరినే సదా తలచెదనని చెప్పియుండిరి.

ధ్యానము మనసుచేత కావలసిన కార్యముగాని శరీరముతో చేయునదిగాదు.

తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేంద్రియక్రియః,
ఉపవిశ్యాసనే యుంజ్యాత్ యోగ మాత్మవిశుద్ధయే.
-- గీత. 6.12

సంకల్పప్రభవాన్ కామాన్ త్యక్త్వా సర్వానశేషతః,
మనసైవేంద్రియగ్రామం వినియమ్య సమంతతః.
-- గీత. 6.24

శనై శ్శనై రుపరమే ద్బుద్ధ్యా ధృతిగృహీతయా,
ఆత్మసంస్థం మనః కృత్వా న కించిదపి చింతయేత్.
-- గీత. 6.25

అన్న శ్లోకములందు సంచరించు మనసును వశపఱచుకొని ఇతర మును చింతింప రాదు. సంకల్పజన్యవిషయముల నన్నింటిని నిశ్శేషముగ మనసు చేత వదలి ఇంద్రియ సమూహమును నలుప్రక్కలనుండి శబ్దాదివి షయములనుండి మనసుచేత నివర్తింపజేసి మెల్లమెల్లగ వివేకయుక్తమయిన బుద్ధిచేత ఆత్మకంటె వేఱు విషయముల నుండి విరమించి మనస్సును ఆత్మయందు నిలిపి పిమ్మట మఱిదేనిని చింతింపకుండవలయునని చెప్ప బడినది.

స ఏవాయం మయాతేఽపద్య యోగః ప్రోక్తః పురాతనః,
భక్తోఽపి మే సఖా చేతి రహస్యం హ్యేతదుత్తమమ్.
-- గీత. 4.3

నీవు నా భక్తుడవు, సఖుడవు అని శ్రీకృష్ణమూర్తి అర్జునునితో చెప్పెను. అట్టి భగవత్సంబంధముగల అర్జునుడు--

చంచలం హి మనః కృష్ణ ప్రమాథి బలవద్దృఢమ్,
తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్.
-- గీత. 6.34

"కృష్ణా! మనసు చంచలమైనది. బలాత్కారముగ హరించునట్టిది. అధికబలము గలది. కనుక దానిని త్రిప్పుట గాలిని త్రిప్పుటవలె అసాధ్య" మని చెప్పెను.

శ్రీకృష్ణ భగవాను డైనను మనసు సాధారణ మయినదని చెప్పెనా?

అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలమ్,
అభ్యాసేన తు కౌంతేయ వైరాగ్యేణ చ గృహ్యతే.
-- గీత. 6.35

మహాబాహూ! అందుకు సందేహము లేదని చెప్పెను. ఇట్టి మనసుతో సారినే సదా తలచుటకు వీలగునా? కులశేఖరులు తాము "చింతయామి

హరిమేవ సంతతమ్" అని చెప్పినది పొరపాటని తలచిరి. అట్లు తలచి మన సుతో జరుగవలసిన కార్యముగాన దానిని వేడుకొనుట కర్తవ్యమని యెంచి ఇట్లు ప్రార్థించిరి.

కులశేఖరులు: ఓ మనసా! స్వామితో చెప్పితిని. నా మానమును కాపాడుము. నీవు పలుచోట్ల తిరుగుచుంటివేని నాకు గత్యంతరము లేదు.

ఉద్ధరేదాత్మనాత్మానం నాత్మాన మవసాదయేత్,
ఆత్మైవ హ్యాత్మనో బంధు రాత్మైవ రిపు రాత్మనః.
-- గీత. 6.5

అనునట్లు నీవు నాకు బంధువుగ నున్నావు.

న రూప మస్యేహ తథోపలభ్యతే
నాంతో న చాదిర్న చ సంప్రతిష్ఠా,
అశ్వత్థమేనం సువిరూఢమూల
మసంగశస్త్రేణ దృఢేన ఛిత్వా.
-- గీత. 15.3

శ్రోత్రం చక్షు స్స్పర్శనం చ రసనం ఘ్రాణమేవ చ,
అధిష్ఠాయ మనశ్చాయం విషయా నుపసేవతే.
-- గీత. 15.9

అనునట్లు నీవు నేను పోవు స్థలము లన్నింటికిని వచ్చు బంధువుగ నున్నావు. (అనగా నే నే జన్మ మెత్తినను నీవును వచ్చుచుందువు. నిన్ను నమ్మియే 'చింతయామి' అంటిని. నిన్ను భగవంతుని యొద్ద విడిచి పెట్టెదను. నీవచ్చటనే నిల్చి యుండుము).

మనస్సు : నీవు చెప్పునట్లు వర్తించుటకు చూచెదను. నీవు విడిచిన చోటు నాకు సుఖముగ నుండెనేని అందే నిలిచెదను. లేని పక్షమున మఱియొక చోటి కేగెదను.

కుల : మనసా! అటు లనకుము. నీకు సుఖము తెలియదు. రుచి తెలియదు. అందుచేత పరుగెత్తజూచుచున్నావు. నేను నిన్ను నిర్బంధించి కూర్చుండబెట్టెదను; కదలకుందుము. ఒక చిన్న ఉద్యోగస్థుడు గొప్ప యుద్యోగమును గోరి యజమానుని దయ సంపాదించుటకై కర్జకాయ లను భక్ష్యములను యజమానుని కిచ్చెను. అత డెన్నడు వాటిని భక్షించినవాడు కానందున దాని కొనను కొరికి చూచి ఉప్పు కారము తీపి మొదలగు నే రసమును లేనందున కోపగించుకొని తన కా తినుబండము లిచ్చినవాని నుద్యోగము నుండి తొలగించెను. ఆ తినుబండము చూచుటకు మాత్రము అందముగ నుండి నందున దాని నెత్తి బీరువాయం దుంచియుండి రెండు మూడు దినములు గడువగనే దానిలోపల ఏ మున్నదో చూత మని విప్పి లోపల పూర్ణముండుటను జూచి, కొంత నోట వేసి కొని, దాని రుచికి సంతోషించి దాని నిచ్చినవానిగతి నధోగతి పాలుచేసి నందులకై చింతించి వానిని పిలిపించి మునుపటికంటెను గొప్ప యుద్యోగ మిప్పించి మన్నించెను.

వేదము యొక్క పైభాగమును కొరికిన మనకు రుచితెలియదు. నారదాదులు లోపల ప్రవేశించి రుచిచూచినవారు. వారికే ఆ రుచి తెలియును.

యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ,
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః.
— గీత. 2.69

పైశ్లోకమట్లు ఎల్లవారు ప్రేమించు విషయములు బ్రహ్మజ్ఞానికి పట్టవు. ఆ విషయము లతనికి రాత్రి. ఇతరులకు పట్టని ఆత్మవిషయ మతనికి పట్టును. అది యతనికి పగలు.

(మనసా! ఏమి చేయుటకై వెడలిపోవుచున్నావు? సుఖము లేని తావుల సంచరించెదవు. సుఖముండు చోట నిలువవు. ఉపనిషత్తు లందు జెప్పబడిన భగవత్కల్యాణగుణము లనెడు తేనెను పానము చేయరాదా? నిన్ను ఈడ్చి యీడ్చి తేవలసిన ట్లున్నది. నిన్ను బాగుగ కూర్చుండ బెట్టినను నీవు మఱియు పరుగెత్తి పోవుచున్నావు. అట్లుపోయినను సరియైన స్థలమునకు పోయితివా? పరధన పరదార పరగృహములను అపహరించు విషయమున జొచ్చెదవు. నే నుంచిన స్థలమునం దుండి యనుభవించి చూచితివేని నీకు రుచి తెలియును. నీవు పోరానిచోటులకు బోయినను నీ కా వస్తువులు లభించెనా? నీ గతి పరితాపకరముగ నున్నది. తుదకు నీవు చెడి నన్నును చెఱచెదవు. నీవు పదిలముగ నుండునెడ మన మిరువురమును సుఖపడవచ్చును గదా అని యొక గొప్ప యోగీశ్వరుడు మనసును గూర్చి చెప్పెను.)

ఆ యీ కారణములచేత మనసా! స్వామిని అనుభవించుటను మానకుము. విడిచిపోక నిలువుము.

మనస్సు : అటులైన నీవు చెప్పు స్థలములో సుఖము గలదా? అట్లు నిజముగ సుఖముండు పక్షమున నే నచ్చటనే నివసించెదను.

కుల : మనసా! ఆ శృంగార మేమని వర్ణింతును. సర్వేంద్రియములలో నయనము ప్రధానమయినది కదా! ఆ సర్వేశ్వరుని యొక్క కన్నులు తామరపుష్పములవలె అందముగ నున్నవి.

మనస్సు : ఓహో! అంత శృంగారమా? అటులయిన తృప్తిపొందితిని. మఱియొక సంగతి గలదు. నే నచట వసించునపుడు దుష్టములైన ఇంద్రియములు వచ్చి న న్నీడ్చుకొనిపోవును. నేను వానివెంట బోదును. వానిని శిక్షించి దూరముగ తఱిమి నన్ను కాపాడుకొను పక్షమున నేను అచ్చటనే యుందును. లేకున్న నింద్రియాదులతోడ పోవు

దును. నీవు చెప్పెడు స్థలము నాకు రక్షకమైన దేనా? కేవలము అందము మాత్రమే యుండి ప్రయోజనమేమి?

కుల : మనసా! కేవలసౌందర్యవిగ్రహుడై యుండిన నే నట్లు చెప్పెదునా? అతడు శంఖచక్రములను ధరించియున్నాడు. అతని చక్రము లోకమునే కాల్చును. అతని శంఖధ్వనిని వినిన యెడల పదునాల్గులోకములు భయపడును. దుష్టులను పలాయితుల గావించుటకు అతని యొద్ద శంఖచక్రము లున్నవి.

మనస్సు : శంఖచక్రము లున్నవని చెప్పుచున్నావు. చిత్రమున లిఖింపబడిన స్వామికి గూడ శంఖచక్రము లున్నవి. వానివలన ప్రయోజనమేమి? నీవు చెప్పు ఆయుధములు చిత్రలిఖితమైన వానియట్లు పనిచేయకుండునా? లేక ఉపయోగపడునా?

కుల : సమయము తటస్థించినపు డవి శత్రునిరసనము గావించుచుండును.

మనస్సు : ఎవ్వరి నైనను హతము గావించెనా?

కుల : నరకాసురుని మిత్రుడును, ఐదుతలలు గలవాడును అగు మురాసురుని చంపెను.

మనస్సు : ఏమో! నీ మాట విని ప్రవేశించితిని. నాకేమో సుఖము తెలియదు. సుఖము గలుగునా?

కుల : మనసా! నీవు ప్రవేశించియుండు స్థలమునకంటెను మించిన స్థలముండనేరదు.

మనస్సు : ఏదేని మంచివస్తువును భుజించినను లేక మంచివస్తువు యొక్క సంగతి వినినను ఇట్లే అనేక విషయములచేత కలుగు సుఖములను బోలియుండునా నీవు చెప్పుసంగతి?

కుల : నీవు చెప్పునవి సుఖములని తోచినగదా వానివలెనుండు నని చెప్పగలను. సుఖమన నేను చెప్పునది యొక్కటే

సుఖమని నాకు తోచుచున్నది. నామాట విని ప్రవే శింపుము. పిమ్మట తెలియును. నీవడిగిన దానికి బదులు దీనివలె దానివలె నుండునని నేను చెప్పపక్షమున నీవును అట్లేయుండునని తలంతువు. పిమ్మట నీవు హరిచరణ ధ్యానము చేసితివేని ఆ యమృతముతో నితరమును సాటిపెట్టితివే, అట్లు చేయవచ్చునా యని వాదము చేయుదువు. అందుచేత అనుభవించిన నీకే తెలియగలదు.

మనస్సు : దాని స్వారస్యము తెలిసిననే గదా?

కుల : ఆ సుఖము నారదాదులకే తెలియును. నామాట మాత్రమే నమ్మవలదు. నారదాదుల నడిగిన చెప్పదురు. అందు అంత సుఖము లేకున్న వారట్లు సంబంధపడు దురా?

మనస్సు : దీనివలె దానివలె నుండునా యని నే నడుగను. నీవే బాగుగ యోచించి యేదైన నొక్క వస్తువునకు బోల్చి యీ విధముగ నుండునని చెప్పుము.

కుల : దానితో సరియగు వస్తువుండిన గదా చెప్పగలను? సర్వేం ద్రియములకును సుఖము గలిగించునట్టి దివ్యవస్తు వది. దానితో సమానమైనది వేఱొక్కటి లేదు. నా మాట నమ్ముము. నా మాట వినుము. నిన్ను నమ్మియే గదా "చింతయామి హరిమేవ సంతత" మ్మంటిని.

## 11

మా భీ ర్మందమనో విచింత్య బహుధా యామీశ్చిరం యాతనా
నామీనః ప్రభవంతి పాపరిపవ స్స్వామీనను శ్రీధరః,
ఆలస్యం వ్యపనీయ భక్తిసులభం ధ్యాయస్వ నారాయణం
లోకస్య వ్యసనాపనోదనకరో దాసస్య కిం న క్షమః.

మందమనః=ఓ మూఢమైన మనసా, యామీః=యముని సంబంధమైన, బహుధా=అనేకవిధములైన, యాతనాః=నరకబాధలను, చిరం=బహుకాలము, విచింత్య=తలంచి, మా భీః=భయపడవద్దు. అమీ=ఈ, పాపరిపవః=పాపములనెడు శత్రువులు, నః=మనకొఱకు, న ప్రభవంతి=సమర్థములుకావు. శ్రీధరః=విష్ణువు, నః=మనకు, స్వామీనను=శేషిగదా, ఆలస్యం=జాగుచేయుటను, వ్యపనీయ=పోగొట్టి, భక్తిసులభం=భక్తిచేత సులువుగా పొందదగిన, నారాయణం=విష్ణువును, ధ్యాయస్వ=ధ్యానముచేయుము. లోకస్య=ప్రపంచమందలి జనులయొక్క, వ్యసన=దుఃఖములయొక్క అపనోదన=పోగొట్టుటను, కరః=చేయునట్టి (సః=నారాయణమూర్తి), దాసస్య=భక్తునియొక్క (వ్యసనాపనోదకరణే=వ్యసనమును పోగొట్టుటయందు) న క్షమః కిం=సమర్థుడు కాడా యేమి?

ఓ మందమనమా! యమయాతనలను పలుతెఱగుల భావించి భయపడకుము. ఈ శత్రువులు మనల నేమియు చేయలేరు. శ్రీధరుడుగదా మనకు స్వామి! భక్తిసులభుడగు శ్రీమన్నారాయణుని ఆలస్యము చేయక ధ్యానింపుము. లోకములవ్యసనములను పోగొట్టువాడు దాసుని వ్యసనమును పోగొట్టలేడా?

(కులశేఖరులు భగవంతునితో సంబంధపడుమనియు, అచటజేరిన సౌఖ్యము గల్గుననియు, శత్రువులు వచ్చి బాధింప రనియు మనస్సునకు బోధించగా దానికి కొంతధైర్యము గలిగెను. కాని సంపూర్ణమైన నమ్మిక కలుగలేదు. అందుచేతనే కులశేఖరుల నిట్లడిగినది.)

మనస్సు : నేను మిగుల దుష్టుడను. నన్ను నమ్మిన యెడల నీవు కుంభీపాకమున కూలవలసినదే. చెడియున్న నాకు సుఖము లేదు. అంత మాత్రమే గాక భయముగను నున్నది. నన్ను నమ్మిన నీవు నరకమునకు బోవుచుండగా నేనును నీతోడ రావలసినదే గదా!

కులశేఖరులు: మనసా! నాకు నరకము గల్గినగదా నీవును నరకమునకు బోవలయును? నేను పోవుస్థలములందు నీవు సుఖప డుదువు. నన్ను నమ్మియుండు "వీడు చెడును; అతని తోడ నేనును చెడుదునే"యని భయపడకుము.

మనస్సు : నన్ను నమ్మియుండు నీవు సుఖపడుదువని నే నెంచలేదు.

కుల : కొంచెమైనను జ్ఞానములేని మనసా! ఇతడు చేర్చు స్థలమున చేరిన సుఖపడవచ్చును. ఇతడు చెప్పు నది హితవని తలంపరాదా? అనేక యమయాతనలను దలచి భయపడకుము. బాగుగ యోచింపుము. నేను ని. న్నెవని యొద్దకు బొమ్మనుచున్నానో ఆ ప్రభువును గూర్చి యోచించితివేని భయముండదు.

మనస్సు : నేను మీయొక్క మనసైయున్నాను. నావలననే ప్రతి కార్యమును జరుగవలసియున్నది. నాయందు మీకు ప్రీతి గలదు. మన యిరువురకు స్థలము కావలసియు న్నది. నాకు ధైర్యము చెప్పుచున్నారు మీరు. నన్ను పంపిన స్థలము మంచిదని మీరు తలచితిరి. అన్నియును సరే. నన్ను నరకమున ద్రోయుటకు వేచియున్నారే.

కుల : అట్టివారెవరు?

మనస్సు : కామక్రోధాదులు అనేక జన్మార్జితపాపములు అను నా శత్రువులు నరకమున ద్రోయుటకు యత్నింపుదురే. అవి యీడ్చిననెట్లు?

కుల : మనసా! ఆ ప్రభువు నాశ్రయించినచో పాపములు సమీపమునకు వచ్చునా? భగవచ్చరణారవిందమను పోలీ సుస్టేషను లోనికిపోయి చేరిన పిమ్మట చోరులవలన భయమేల కల్గును? కాననీవు ఈ యల్పశత్రువులను గూర్చి భయపడనవసరము లేదు. నీవు చెప్పునట్టి శక్తి

వారి కున్నది గాని ఒక్కటిగ చేరియుండు మనవిషయ మున వారి శక్తి చెల్లదు.

మనస్సు : ఆ స్వామి యెవరు?

కుల : శ్రీధరుడు గదా మన స్వామి.

మనస్సు : మీరు చెప్పనది సరే. మనము యోగ్యులమై యుంటిమేని భయపడ నవసరము లేదు. పాపులమై యున్నాము. వానికి మన యందు వాత్సల్యముండినను పాప మేల చేసితివని శిక్షింపకుండునా?

కుల : మనసా! అచట మన తల్లి యున్నది. ఆమె పురుషకారము చేయును.

మనస్సు : మనము పోయినపుడు ఆమె లేకుండు పక్షమున మన గతి ఏమి?

కుల. : మనసా! శ్రీధరుడు కదా మనస్వామి. మనకు సిఫారసు చేయుటకై ఆమెను సదా వక్షస్థలమున ధరించియే యున్నాడు. అందువలన నేను చెప్పనట్టి స్థలము మంచిదై యున్నది. అచట జేరినయెడల సుఖ మున్నది. భయము లేదు.

మనస్సు : నీ మాట విని ప్రవేశింప వచ్చునా?

కుల : నను=ఈ సంగతి నెవరి నడిగినను జెప్పెదు రే.

మనస్సు : ప్రసిద్ధుడగు ఆ ప్రభువున కేమి సమర్పింపవలయును?

కుల : ఆయన కేమియు సమర్పింపబనిలేదు. భక్తిని సమర్పించిన చాలును. ఎవరెవరి కేదేది కావలయునో దానినే గదా వారి కీయవలయును?

మనస్సు : భక్తి నిచ్చిన కాపాడునా?

కుల : కాపాడును. అయినను ఆతని యొద్ద కేగునపుడు ఆలస్య మను దుష్టుని మాత్రము చేర్చుకొని పోకుము. వానిని త్యజింపుము.

మనస్సు : కామక్రోధాదులు పాపములు మొదలగువానికి భయపడ వలయును గాని ఆలస్యమునకు భయపడనేల?

కుల : ఆలస్యమును విడిచిన యెడల అన్నియును సమకూ డును. ఆలస్యమును త్యజించిన తోడనే విషయములను చక్కగ గ్రహింపవచ్చును. ఆలస్యము వీడెనేని జ్ఞానము కలుగును. దోషము లన్నియు తామే పాఱిపోవును.

మనస్సు : ఆలస్యమును నెట్టివేసిన యెడల ఆయన పిలుచునా?

కుల : పిలువకేమి? భక్తి సులభుడుగదా!

మనస్సు : అత డెచ్చట నున్నాడో!

కుల : మనసా! ఇతర ప్రభువులను దర్శింపగోరితిమేని వారుండు చోటికి పోవలసియుండును. ఇతనిని తలచితిమేని మనయొద్దకే యీతడు వచ్చును. అతని దర్శనమునకు పోనక్కరలేదు. ధ్యానింపుము.

మనస్సు : మనము పోనియెడల ఆయనయే మన దగ్గరకు రావ లసియుండును. అందుచేత అతనికి మాత్రము శ్రమగలుగదా?

కుల : మనసా! ఆయన మన హృదయముననే యున్నాడు. అతడు నారాయణుడు. చరాచర ప్రపంచమునం దుండు వాడు. అన్నిటికిని ఆశ్రయము, ఆధారము. అతడు సర్వాంతర్యామి.

గామావిశ్య చ భూతాని ధారయా మ్యహమోజసా,
పుష్ణామి చౌషధీ స్సర్వా స్సోమో భూత్వా రసాత్మకః.

-- గీత. 15.13

అనునట్లు పురుషోత్తముడు. అట్లగుటచే తలచిన చోటనున్నాడు.

మనస్సు : ఏమి రక్షించునో! సందేహముగనే యున్నది.

కుల : రామాయణమున "రక్షితా జీవలోకస్య" అని చెప్పబడెనుగాన ఆ స్వామి ప్రాణికోటిని రక్షించువాడుగ నున్నాడు. ఎవ్వరు పిలిచినను వచ్చుటకు సిద్ధముగ నున్నాడు.

అనన్యా శ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్.
-- గీత. 9.22

అన్నట్లు దాసుడనని పాదముల బడినవారిని కాపాడుటకు సిద్ధముగ నున్నాడు. వెఱ్ఱి మనసా! భయ మేల?

## 12

భవజలధిగతానాం ద్వంద్వవాతాహతానాం
సుత దుహితృ కళత్ర త్రాణ భారార్దితానామ్,
విషమవిషయతోయే మజ్జతా మప్లవానాం
భవతు శరణ మేకో విష్ణుపోతో నరాణామ్.

భవ=సంసార మనెడు, జలధి=సముద్రమును, గతానాం=పొందినవారును, ద్వంద్వ=చలి వేడిమి, సుఖదుఃఖములు మొదలగు జంట దుఃఖము లనెడు, వాత=గాలిచేతను, ఆహతానాం=కొట్టబడినవారును, సుత=కొడుకులు, దుహితృ=కొమార్తెలు, కళత్ర=భార్యలు -- వీరి యొక్క, త్రాణ=రక్షించుటయను, భార=బరువుచేత, అర్దితానాం=పీడింపబడినవారును, విషమ=కష్టమునిచ్చు, విషయ=ఇంద్రియసుఖము లనెడు, తోయే=నీటియందు, మజ్జతాం=మునుగువారును, అప్లవానాం=తెప్పలేనివారును అగు, నరాణాం=మనుష్యులకు, విష్ణుపోతః ఏకః=విష్ణువనెడు తెప్పయొక్కటే, శరణం=రక్షకముగా, భవతు=అగునుగాక

సంసార సముద్రమును పొందినవారును, ద్వంద్వము లనెడి గాలిచే కొట్టబడినవారును, పుత్రకళత్రాదుల రక్షణభారముచేత పీడింపబడిన వారును, విషమంబులగు విషయము లనెడు నుదకమునందు మునిగిన వారును, తెప్పలేనివారును అగు నరులకు విష్ణువనెడి యోడ ఒకటే శరణ మగును.

10, 11శ్లోకములలో భగవంతునిలో జేరుమని కులశేఖరులు మనసునకు బోధించగా అదియిట్లు పలికెను.

మనసు : భగవంతుని యందు లయించు పక్షమున సుఖపడవచ్చును. సంసారసాగరమునబడి యల్లాడుచుండు మీరు దీని నెట్లు దాటగలుగుదురు?

కుల : మనసా! నీవు చెప్పినరీతిగా నేను సంసార సాగరమున దిగితిని. మరల గట్టెక్కుద మని చూడగా, శీతోష్ణములను గాలి కొట్ట నారంభించెను. వివాహసమయమున మేళతాళములు, విందు భోజనములు, బంధుదర్శనము మొదలగు సంభ్రమములతో గూడి యుండినందున కష్టములు తెలియకుండెను. భార్య కాపురమునకు వచ్చి సంతానము కలుగగనే సుఖదుఃఖాది ద్వంద్వములయొక్క గాలికొట్ట నారంభించి గట్టు నెక్కుటకు శ్రమమాయెను. అప్పటికిని సహించి గట్టెక్కుటకు ప్రయత్నించితిని గాని భార్యాపుత్రాదులను కాపాడుట యను భారమును తలయందుంచు కొనియుండుట చేతశ్రమతో నడువవలసివచ్చెను. ఆ భారమును పట్టుకొనియే యెక్కవలసియున్నది. ఆ భారముంచుకొని నిలుచుటకు వీలుపడనేరదు. మునిగిన మాత్ర మేమి? గ్రహణ కాలమందు సముద్రస్నానము చేయలేదా యనిన నే నట్టి స్థలమున మునుగలేదు. తగు స్థలమున మునిగిన యెడల భయములేదు. పూడిపోవు స్థలమున దిగితిని. విష

యములందు మునిగితిని. విషయవాంఛ యుండరాదా యనిన భగవద్విషయములైన యెడల గట్టెక్కనగును. అనుభవించుటకు ఇంద్రియములు, అనుభవింపబడుటకు విషయములు మొదలగువానిని భగవంతుడు దయచేసి యున్నాడు.

ప్రసాదే సర్వదుఃఖానాం హాని రస్యోపజాయతే,
ప్రసన్నచేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతే.
-- గీత. 2.65

పైశ్లోకమునందువలె రాగద్వేషములను త్యజించి విషయముల ననుభవింపవలయును. నే నట్టి విషయములందు మునుగలేదు. విషతుల్యములైన విషయములందు మునిగితిని.

యతతో హ్యపి కౌంతేయ పురుషస్య విపశ్చితః,
ఇంద్రియాణి ప్రమాథీని హరంతి ప్రసభం మనః.
-- గీత. 2.60

అనునట్లు ఇంద్రియములకు మంచివిషయమున ప్రవేశింపజేయు స్వభావము లేదు. అవి దుర్మార్గముననే పోవును.

ఈ సంసారజలధి యందు దిగునపుడు ఓడనేదియైనను సహాయము చేసికొని దిగితివా? అట్లును చేయలేదు. మనసా! ఈరీతి వల్లాడు నరులకు విష్ణువను నావయే శరణ మగును. నీవు మాత్రము భగవంతునొద్ద చేరుము. నాకు ఓడ దొరకును. దాటించువానికేమియు నీయ పనిలేదు. మనసు నర్పించిన యెడల దానినే కూలిగ పుచ్చుకొని ఆయన దరిజేర్చును. దయచేత నతడే తెప్పయగును. సముద్రమునబడి యల్లాడుచున్నావే యని అడుగకుము. నిత్యపరిపూర్ణు డగుటచేత నతని కేమియును ఈయ పని లేదు. అట్టివాడైనను ఒక్కటి మాత్రము కోరును. శివానందలహరి యను గ్రంథమున భక్తు డొకడు పార్వతీశు నుద్దేశించి--

శివా! నీకు కనకము సమర్పింత మన్న నీ వుందునది కనకగిరి. ధనము నిత్తమన్న ధనపతి యగు కుబేరుడు నీ చరణదాసుడు. నీవు కోరినది యిత్తమన్న కల్పవృక్షము, కామధేనువు, చింతామణి మీయింటి వృక్షము, మీయింటియావు, మీయింటి రాయియై యున్నవి. శైత్యోపచారము చేయుదమన్న నెల్లవారిని సంతోషింపజేయు చంద్రుడు నీ తలలో నున్నాడు. సకలము నొసగునది నీ చరణము. ఇక నీకు కావలసిన దేమున్నది? భక్తుల మనసు నాయందు చేరునా యని కోరుచుందువు. నన్ను తలచుటకే కదా మనసు నిచ్చితి నని తలంచుచుందువు. అందుచేత నీకు కావలసినది మన సొక్కటే అని విన్నవించెను. ఆ శ్లోక మిది:

కరస్థే హేమాద్రౌ గిరిశ నికటస్థే ధనపతౌ
గృహస్థే స్వర్భూ జామర సురభి చింతామణిగణే,
శిరస్థే శీతాంశౌ చరణయుగళస్థేఽఖిలశుభే
కమర్థం దాస్యేఽహం భవతు భవదర్థం మమ మనః.

భగవద్గీత పంద్రెండవ అధ్యాయములో--

యే తు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః,
అనన్యేనైవ యోగేన మాం ధ్యాయంత ఉపాసతే.
తేషా మహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్,
భవామి న చిరా త్పార్థ మయ్యావేశిత చేతసామ్.

అను 6,7 శ్లోకములందు తనకు మనసును సమర్పించి తన్నే గతిగ నమ్మి యుండిన యెడల అట్టివారిని మృత్యురూపమైన సంసార సాగరమునుండి దాటింతు నని భగవంతుడు చెప్పియున్నాడు.

తండ్రి వ్రాసి యిచ్చిన పత్రములో వయసువచ్చిన పుత్రుడును చేవ్రాలు చేయునట్లు భాగవతమున బ్రహ్మదేవుడు "స్వామీ! నిన్ను నమ్మినవారు సంసారసాగరమును గోవత్సపదజలమట్లు అనగా దూడ కాలుంచగా పడిన

పల్లము నందలి జలమును దాటినట్లు, దాట నగునని చెప్పెను. ఇట్టి కారణములచేత మనసా! నీవు పోయి లయించుము. స్వామి గట్టెక్కించును. వానికి కావలసినది కూలి. ఆ కూలి నీవే. నిన్ను సమర్పించిన యెడల గట్టెక్కించును. ఆ స్వామియే యోడ యగును. అందుచే తనే 10, 11 శ్లోకములందు వానిని ధ్యానించవలయు నంటిని. నీవు వెనుకకు రాకుము. పాపినని భయపడకుము. 11శ్లోకమున జెప్పినట్లు అతడు స్వామిగ నున్నాడు. ప్రక్కను తల్లియున్నది. లోకముల వ్యసనములను బోగొట్టువాడు నమ్మియుండు మనలను --

దైవీ హ్యేషా గుణవ యీ మమ మాయాదురత్యయా,
మామేవ యే ప్రపద్యంతే మాయా మేతాం తరంతి తే.

-- గీత. 7.14

పైశ్లోకమునందు వలె కాపాడును. పైసంసారసాగరమునబడి దాని యందు గల బాధలను పొందియుండు నరులకు విష్ణువను ఓడయే శరణమగును.

## 13

భవజలధి మగాధం దుస్తరం నిస్తరేయం
కథమహ మితి చేతో మా స్మ గాః కాతరత్వమ్,
సరసిజదృశి దేవే తావకీ భక్తిరేకా
నరకభిది నిషణ్ణా తారయిష్యత్యవశ్యమ్.

చేతః=ఓమనసా!, అగాధం=లోతైనదిగనుకనే, దుస్తరం=దాటశక్యముగాని, భవజలధిం=సంసారమనెడు సముద్రమును, కథం=ఎట్లు, అహం=నేను, నిస్తరేయమ్=దాటగలను, ఇతి=అని, కాతరత్వం=పిఱికితనమును, మా స్మ గాః=పొందవద్దు, సరసిజదృశి=కమలములవంటి నేత్రములుగల, దేవే=భగవంతుడగు, నరకభిది=నరకాసురుని సంహరించిన శ్రీ కృష్ణునియందు,

నిషణ్ణా=కూర్చుండిన, తావకీ=నీదైన, భక్తిః ఏకా=భక్తి యొక్కటే, అవశ్యం=ముఖ్యముగా (త్వామ్=నిన్ను), తారయిష్యతి=దరిజేర్చగలదు.

ఓ మనసా! లోతైనదియును, దాటరానిదియు నగు సంసారసాగర మును నే నెట్లు దాటగలనని తల్లడిల్లకుము. తామరసాక్షుదును, నరకాం తకుడును అగు భగవంతునియందు (శ్రీకృష్ణదేవునియందు)నిలుపబడిన నీ భక్తి యొకటియె నిన్ను అవశ్యము ఈ సాగరమును దాటించును.

మనస్సు : భగవంతునకు నన్ను సమర్పించిన పక్షమున నతదు కాపాడు నంటివి. ఆ విషయమున నాకు ధైర్యము కలుగలేదు.

కులశేఖరులు: మనసా! తనయందు లయింపజేయవలయునను తలంపు తోనే భగవంతుడు నిన్ను దయచేసియున్నాడు. మనసును సాధనముగ జేసి కొనవలయుననియే భగవదభిప్రాయము.

ఉద్ధరే దాత్మనాత్మానం నాత్మాన మవసాదయేత్,
ఆత్మైవహ్యాత్మనో బంధు రాత్మైవ రిపురాత్మనః.
-- గీత. 6.5

అవినట్లు మనసును బంధువుగ జేసికొని సుఖపడవలయునను తలంపు తోనే ని న్నతదు కరుణించెను. దయాపూర్వకముగ విచ్చిన మనస్సుతో సుఖపడరేని వావలనవే వీరు చెడిరిగదా యని స్వామి చింతించును. కాన నిన్ను సమర్పించు పక్షమున నతడు సంసారసాగరమును దాటించును. సంసారసముద్రమునబడి శ్రమపడు చుండు నేను కాపాడ బదుదును.

మనస్సు : మీరు చెప్పిన దంతయు యుక్తముగనే యున్నది. మిగుల శ్రమపడు పక్షమున సముద్రమును దాటనగును. హనుమంతు డును దానిని దాటియున్నాడు. సంసారసాగరమును దాటుట మాత్రము కష్టము. నన్ను కూలిగ నిచ్చి సంసారస

ముద్రమును దాటుట యను సంగతి కదువింతైనదిగ ఉన్నది. ఎంతచెప్పినను నాకేమో నమ్మకము కలుగకున్నది.

కుల : మనసా! భయపడకుము. లోతైనదియును, దాటశక్యము కానిదియును నగు సంసారసాగరము నెట్లు దాటుదు నని అధైర్యము చెందకుము.

మనస్సు : ఎట్లు భయపడకుందును? ఎంత చెప్పినను నాకు భయము గనే యున్నది.

కుల : భగవంతునియందు భక్తిమాత్రము సల్పుము. అతని యందు లయింపుము. అతనిపాదములను విడిచిపెట్టి పాఱిపోవలదు. అట్లు చేసితివేని యా భక్తి సంసారసాగరమును దాటించియే తీఱును.

మనస్సు : పదియవ శ్లోకములో చెప్పినట్లు అతని పాదములలో తప్పక నన్ను చేర్చవలయునని యత్నించుచున్నావు. చలింపవ లదను చున్నావు. నా స్వభావమే చంచలమైనది. ఆ భగవంతునియం దేమైన విశేషముందునా?

కుల : తామరపుష్పము రేకులవలెనుండు ఆ కన్నులయొక్క అంద మును జూచినను చాలునే.

మనస్సు : ఓహో! వట్టి అందగాడేనా? అటులైన సామాన్యప్రభువేనా?

కుల : కాదు కాదు. చరాచర ప్రపంచమునకు జ్ఞానాజ్ఞాన మోక్షము లను లీలతో నీయగలవాదు. బ్రహ్మాదులకు స్వామి.

మనస్సు : అన్నియును సరియే. మన కతడు సహాయము చేయునా?

కుల : అతడు నరకాంతకుడు. అతని శరణు పొందిన పిమ్మట పాప భీతియే యుండదు గదా! భక్తి యొక్కటి బాగుగ నుండిన చాలును.

నాదత్తే కస్యచిత్పాపం న చైవ సుకృతం విభుః,
అజ్ఞానే నావృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః.
-- గీత. 5.15

అన్న శ్లోకములో చెప్పబడిన అజ్ఞానము వీడిపోవును. ఓడ సముద్రమున బాగుగ నిలిచియుండెనేని దాని దాటగలుగును. అట్లే పురాణ వైరాగ్యము కాక దృఢమయిన భక్తియుండెనేని ఆ భక్తియే అవశ్యము భవసాగరమును దాటించును.

## 14

తృష్ణాతోయే మదనపవనోద్ధూత మోహోర్మిమాలే
దారావర్తే తనయ సహజగ్రాహసంఘాకులే చ,
సంసారాఖ్యే మహతి జలధౌ మజ్జతాం నస్త్రిధామన్
పాదాంభోజే వరద భవతో భక్తినావం ప్రయచ్ఛ.

తృష్ణాతోయే=ఆశయనెడునీళ్లుగలదియు, మదన=మన్మథుడను, పవన= గాలిచేతను, ఉద్ధూత=పైకిలేపబడిన, మోహ=అజ్ఞానమను, ఊర్మి= అలలయొక్క, మాలే=వరుసగలదియు, దారా=భార్యయను, ఆవర్తే=సుడులుగలదియు, తనయ=బిడ్డలను, సహజ=తోడబుట్టినవారను, గ్రాహ=మొసళ్లయొక్క, సంఘ=గుంపుచేతను, ఆకులే=కలత పెట్టబడినదియునగు, సంసార+ఆఖ్యే=సంసారమను పేరుగల, మహతి=గొప్ప, జలధౌ=సముద్రమునందు, మజ్జతాం=మునుగుచున్న, నః=మాకు, త్రిధామన్=ఓత్రిధాముడా, వరద=ఓ వరముల నిచ్చువాడా, భవతః=నీయొక్క, పాద+అంభోజే= కమలములవంటి పాదములందు, భక్తినావం=భక్తియనెడు ఓడను, ప్రయచ్ఛ= ఇమ్ము.

ఓ త్రిధాముడా! వరదా! తృష్ణయను నుదకముగలదియు, మన్మథుడను గాలిచేత నెగుర గొట్టబడిన మోహములనెడి అలలవరుసగలదియు,

భార్యయను సుడిగలదియు, పుత్త్రిసహోదరులను మొసళ్ళగుంపుచే ఆకులంబగు సంసారమనెడి మహాసముద్రములో మునిగియుండు మాకు నీ పాదభక్తి యను ఓడ నొసంగుమా!

మనస్సు : భగవంతునియందు భక్తి సల్పి, సంసారసాగరమును దాటుట బహుసులభమైన కార్యముగ నున్నది. ఇపుడే నాకు కొంత ధైర్యము కలుగుచున్నది.

కుల : మనసా! భక్తినావచేత సంసారసాగరమును దాటవచ్చును. అయినను ఆ నావ దొరకుట కష్టము.

మనస్సు : మీరు చెప్పినట్లు భగవంతునియందు లయించెదను. భక్తి గలుగును.ఆ భక్తియే యోడ యగును.

కుల : నీవు దాట గలుగుదువా? భగవంతుడే యీయవలెను. అందు కొఱకు మనమ్ము భగవంతుని ప్రార్థింప వలయును. అటుపిమ్మట వాడే యొసగవలెను. భక్తి మనసుచేత కలుగవలెను.ఆ మనసు చంచలమైనది. హృషీకేశు డగుటచేత స్వామియే యింద్రియములను దిద్దవలయును. స్వామీ! నాకు గత్యంతరము లేదు. ఇంద్రియములు, మనసు నీ కధీనమై యున్నవి. నీవేదిద్ది నీ యొద్దకువచ్చునట్లు చేసికొనవలయును అని యతనిని ప్రార్థింపవలయును.

భగవద్గీత 15అధ్యాయమున సంసారవృక్షచ్ఛేదనమునకు అసంగము అనగా భగవంతునియందు సంగము, తదితరమున అసంగము, అను శస్త్రము కావలయు ననియు, దానిని భగవంతుడే యీయవలయుననియు, శరణాగతిచేయు పక్షమున భగవంతుడే దయచేయుననియు చెప్పబడెను.

నరూప మస్యేహ తథోపలభ్యతే
నాంతో న చాదిర్న చ సంప్రతిష్ఠా,
అశ్వత్థ మేనం సువిరూఢమూల
మసంగశస్త్రేణ దృఢేన ఛిత్వా.

తతః పదం తత్పరిమార్గితవ్యం
యస్మిన్గతా న నివర్తన్తి భూయః,
తమేవ చాద్యం పురుషం ప్రపద్యే
యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ.

-- గీత. 15.3-4

భగవంతుడే దయచేయకున్న జన్మసహస్రముల కయినను భక్తికలుగునా? క్రింది శ్లోకమున నీ భక్తియొక్క ఓటే దాటించునంటివి. అది నీకును నాకును కాని పని. కాన మనసా! వానిని ప్రార్థించి ఓడను సంపాదించుటకు యత్నించెదను. కులశేఖరులు మనసునకు ఈ రీతిగ బోధించి భగవంతుని ప్రార్థించుచున్నారు.

కులశేఖరులు: స్వామీ! నీ పాదారవిందములయందలి భక్తిని ప్రసాదింపుము.

స్వామి : నా దర్శనము కాగానే పాదభక్తి నడుగవచ్చునా?

కుల : స్వామీ! నీవు వరదుడవు కదా! ఎవ రెవరి కేదేది కావలయునో దాని నిచ్చువాడవు గదా! అందుచేతనే అట్లడిగితిని. భక్తి నిమ్ము.

స్వామి : నా పాదభక్తి యేల?

కుల : సముద్రమున మునిగియుండుటచేత.

స్వామి : ఏ సముద్రమున మునిగితివి?

కుల : సంసారసముద్రమున.

స్వామి : ఆ సముద్ర మెట్లున్నది?

కుల : ఆశయే ఆ సముద్రమునకు జలము. (ఆశ జలముగ వర్ణింపబడుటచేత దానివలన హాని కల్గునని అర్థమగుచున్నది. భగవంతుని దర్శింప వలయు ననియును, వాని కథలు వినవలయుననియును ఆశయుండరాదా? అదియును తప్పే అగునా? అనగా అట్లు కాదు.

బలం బలవతాం చాహం కామరాగ వివర్జితమ్,
ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ.
-- గీత. 7.11

అన్నట్లు ధర్మవిరుద్ధముగాని యాశ ఉండవలసినదే. ధర్మశాస్త్రమునకు విరోధమైన ఆశ యుండరాదు.)

స్వామి : జలముండిన భయమేమి?

కుల : సాధారణముగ జలముండెనేని భయము లేదు. ఆ జలము గాలిచేత కొట్టబడుచున్నది. అందుచేత అలలవరుసలు కలిగి యున్నది.

స్వామి : ఏ గాలిచేత కొట్టబడుచున్నది?

కుల : మన్మథుడను గాలిచేత.

స్వామి : అల లెట్లున్నవి?

కుల : మోహమే అలలుగా నున్నవి (మోహముచేత శ్లాఘ్యము అశ్లాఘ్యముగను, అశ్లాఘ్యము శ్లాఘ్యముగను తోచును.)

స్వామి : తిన్నగ గట్టుచేరరాదా?

కుల : అందుకు ప్రయత్నించి చూచినను నడుమ సుడిగుండ మొకటి యున్నది.

స్వామి : సుడిగుండమెట్లున్నది?

కుల : భార్యారూపముగ నున్నది. దాటుటకు యత్నించునపుడు ఆ సుడిగుండములో పడిపోవలసినదే.

స్వామి : అట్లు సుడియందు పడినను కొంచెము దూరముపోయి మరల మరల పైకిలేచి రారాదా?

కుల : ఆ స్థలమున మొస ళ్ళున్నవి.

స్వామి : ఏ మొసళ్లు?

కుల : తనయులు, అనుజులు అను మొసళ్లగుంపు చేత ఆకులమై యున్నది. (తనయులు, అనుజులు సొమ్ము పంచి యిమ్మని బాధింతురు).

స్వామి : ఈ సముద్రము పేరేమి?

కుల : సంసారము.

స్వామి : లోతుగ నున్నదా?

కుల : మిగుల లోతుగనున్నది. కాన ఓ త్రిధాముడా=శ్వేత దీపము అనంతాసనము, వైకుంఠమున నుండువాడా, లేక మూడువేదములందును సంబంధపడినవాడా, త్రైలోక్యవాసీ, మూడవ స్థలయందు నుండెడివాడా! భక్తి నావ నిమ్ము. (జలముండిన పైని తెల్పబడిన యనర్థములు కలుగును. జలములేనిచోట నటుశ్రమ కలుగదు. ఈ రీతిగనే ఆశయుండు పక్షమున అది మీది యనర్థములకు మూలమగును. అశలేకున్న బంధువులేల? ఆశాజలము వలన గాలియలలు కలిగెను. స్వాధీనముతప్పెను. ఆశచేత విపరీత జ్ఞానము, మన్మథ వికారము కలిగెను. భార్య యణచెను. దానివలన కలిగిన బిడ్డలయొక్క, సహజన్ములయొక్క బాధకలిగెను. ఆశవీడినచో అన్నియును పోవును. ఏ బంధువుయొక్క పనియును జరుగజాలదు. సంసార సముద్రమునకు ఆశయను జలమే కారణము).

15

మాద్రాక్షం క్షీణపుణ్యాన్ క్షణమపి భవతో భక్తిహీనాన్ పదాబ్జే
మాశ్రౌషం శ్రావ్యబంధం తవ చరిత మపాస్యాన్య దాఖ్యానజాతమ్,
మా స్మార్షం మాధవ త్వామపి భువనపతే చేతసాపహ్నువానా
న్మా భూవం త్వత్సపర్యా వ్యతికరరహితో జన్మజన్మాంతరేఽపి.

మాధవ=ఓ లక్ష్మీపతీ, క్షీణపుణ్యాన్=పాపముచేసినవారిని, క్షణమపి=ఇంచుకసేపైనను, భవతః=నీయొక్క, పద+అబ్జే=కమలముల వంటి పాదముల యందు, భక్తిహీనాన్=భక్తిలేనివారిని, మాద్రాక్షం=చూడకుందును గాక, శ్రావ్యబంధం=వినదగిన రచనగల, తవ=నీయొక్క, చరితం=కథను; అపాస్య=విడిచి, అన్యత్=ఇతరమయిన, ఆఖ్యానజాతం= చరిత్రముల సమూహమును, మాశ్రౌషమ్=వినకుందునుగాక, భువనపతే=లోకనాయకుడవగు శ్రీకృష్ణమూర్తీ, త్వాం=నిన్ను, చేతసాపి=మనస్సుతోనయినను, అపహ్నువానాన్=తిరస్కరించువారిని, మాస్మార్షం=తలంచకుందునుగాక, జన్మజన్మాంతరేఽపి=ప్రతిజన్మములోను, త్వత్=నీయొక్క, సపర్యా=సేవయొక్క, వ్యతికరరహితః=సంబంధము లేనివాడుగా, మా భూవం=కాకుందునుగాక!

ఓ లోకనాథా! నీయొక్క పాదకమలములయందు క్షణకాలమైనను భక్తిలేని పాపులను నేను చూడజాలను. చెవి కింపైన మీయొక్క చరిత్రమును విడిచి యితరమయిన ప్రబంధములను చెవులార వినను.

ఓ శ్రియఃపతీ! నిన్ను తిరస్కరించువారిని మనస్సుచేత నయిన తలంచను. జన్మజన్మాంతరములయందును నీ కైంకర్యము కల్గియుందును గాక!

మనస్సు : బుద్ధీంద్రియాదులను వశపఱచుకొనవచ్చును కాని అయోగ్యులు చేరినయెడల అన్ని ప్రయత్నములును వ్యర్థము లగును. దీనికి మార్గ మేదో తెలియకున్నది.

కుల : మనసా! దుర్మార్గుల సహవాసము కలుగకుండుటకై స్వామిని ప్రార్థించెదను. (కులశేఖరులు మనసునకు ఈ రీతిగ తెల్పి భగవంతుని ప్రార్థించిరి).

కుల : స్వామీ! అనేక ప్రయత్నములు చేసి మంచిస్థితికి వచ్చియుండువాడైనను దుర్మార్గుని వలలో పడినప్పుడు హీనస్థితికి వచ్చును. అట్టివాని సహవాసమున నెట్టి భక్తికలవాడైనను

చెడిపోవును. అయోగ్య సహవాసము వలన యోగ్యుడు చెడు నుగాను మంచివాని సహవాసమున దుష్టుడు సన్మార్గవర్తను డగుట కష్టము. పతివ్రతయగు స్త్రీ వ్యభిచారిణి తోడ జేరిన నెట్లో అట్లుచెడును. ధర్మక్షేత్రమైన కురుక్షేత్రముయొక్క స్పర్శచేత తన పుత్రులమనసు యుద్ధమునుండి మరలెనా యని ధృతరాష్ట్రు డడుగగా నీపుత్రులస్పర్శచేత ఆ మహా క్షేత్రము పాడుకావలసినదేకాని వారి మనసు మరల దని సంజయు డనెను.

ఒక దుష్టుని ఎన్ని సాధనములచేతనో త్రిప్పవలసియుండును గాని యోగ్యుని రెండు నిమిషములలో చెఱుపవచ్చును. నీటబడుట సులభము; గట్టెక్కుట కష్టము.

మయి చానన్యయోగేన భక్తి రవ్యభిచారిణీ,
వివిక్తదేశసేవిత్వ మరతి ర్జనసంసది.

-- గీత. 13.11

భగవన్మార్గమునకు విరోధులైనవారిని విడువవలయు ననియు, అది యొక గొప్పసాధన మనియు చెప్పబడెను. మంచివస్తువైనను దుర్గంధ పదార్థముతోడ చేరెనేని తోడనే దుర్వాసన గలదియగును. దుష్టసహవాస మట్టిది. అట్లగుటచేత స్వామీ! నీ పాదములందు భక్తిలేని పాపులను క్షణమైనను చూడకుందును గాక. దుష్టుడు చెలికాడైనను, చుట్టమయి నను, సుతుడయినను, మఱెట్టివాడయినను వానిని త్యజించవలయును. తాను చెప్పు హితమును విననందున విభీషణుడు రావణుని విడిచిపెట్టెను. దుష్టులగువారికి సామదానభేదదండోపాయములచేత చెప్పిచూడవలయును. వినకున్న విడువవలయును. ఆత్మబంధువులతో చేరవలయును, గాని శరీ రబంధువులను అంతగ గమనింపరాదు. ఆత్మోజ్జీవనమునకు తగువారితో

జేరవలయును. 'ఆయే యివ్వులగత్తు' అను పాశురమున నమ్మాళ్వార్లు భగవంతు నిట్లు ప్రార్థించిరి.

నమ్మాళ్వార్లు : స్వామీ! నన్ను శీఘ్రకాలమున దీసికొనిపొమ్ము. ఎందుచేత ననగా ఇంక కొంతకాల మిచ్చటనే యుందునేని నేనును చెడిపోదును. (ఆయే అనగా అమ్మాయని యర్థము. నమ్మాళ్వారులు స్వామిని అమ్మాయని యేల పిలిచి రనగా భగవంతునికి మనయం దతిప్రీతి యున్న దని తెలుపుటకు అట్లు పిలిచిరి. తప్పుచేసినపుడు తండ్రి శిక్షించును. తల్లికి అనుగ్రహముతప్ప నిగ్రహము లేనందున కోపించదు. నమ్మాళ్వారు లీ సంగతిని విశద పఱచిరి. మఱియు నిట్లనిరి. స్వామీ! ఈ లోకము నను౦దు స్థావరజంగమ పదార్థములును నీవే. జడము చేతనము నీవే.

స్వామి : అన్నియును నేనేనా?

నమ్మా : అన్నియును మీరే యనుటచేత అద్వైతమని భావింపకుడు. నా తాత్పర్యము వేఱు. నీ సంబంధములేని పదార్థము లేదు. కాన అన్నియును నీవే.

ప్రహ్లాదశ్చాస్మి దైత్యానాం కాలః కలయతా మహమ్,
మృగాణాం చ మృగేంద్రోఽహం వైనతేయశ్చ పక్షిణామ్.
-- గీత. 10.30

అని గీతలో "నా సంబంధము లేని వస్తువే లేదని మీరే చెప్పితిరి. అంతర్యామిగ నున్నావు గాన అన్నియును నీవే.

నమః పురస్తా దథ పృష్ఠతస్తే నమోఽస్తు తే సర్వత ఏవ సర్వ,
అనంతవీర్యామితవిక్రమ స్త్వం సర్వం సమాప్నోషి తతోఽపి సర్వః.
-- గీత. 11.40

అను శ్లోకమున అర్జునుడు స్వామీ! నీవు అన్ని వస్తువులలోను వ్యాపించియున్నావు. కాన అన్నియు అగుచున్నా వనెను. నీవు శరీరివి. అన్నియును నీ శరీరము.

అహం క్రతు రహం యజ్ఞః స్వధాహ మహ మౌషధమ్,
మంత్రోఽహ మహమే వాజ్య మహమగ్ని రహం హుతమ్.
-- గీత. 9.16

అను శ్లోకమున నేనే యజ్ఞము, నేనే మహాయజ్ఞము, నేనే స్వధ అని యీరీతి అన్నియును నేనే యని చెప్పితిరి.

క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత,
క్షేత్రక్షేత్రజ్ఞయో ర్జ్ఞానం యత్తత్ జ్ఞానం మతం మమ.
-- గీత. 13.3

క్షేత్రక్షేత్రజ్ఞులు నా శరీరభూతము శేషభూతము అని పల్కితిరి.

నాంతోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరంతప,
ఏష తూద్దేశతః ప్రోక్తో-విభూతే ర్విస్తరో మయా.
-- గీత. 10.40

అన్న శ్లోకమున నా మహిమలకు అంతము లేదంటిరి. ఆ యీ కారణములచేత నన్నియును నీవే యగుచున్నావు.

స్వామి : నావలన నేమి కావలయును?

నమ్మా : నన్ను మీవద్దకు తీసికొనిపొందు.

స్వామి : ఈ లోకమున భాగవతు లున్నారు. ఇంకను కొన్ని దినము లుండవచ్చును. గొప్పస్థితియం దుండువారు వైకుంఠమున నుండిననేమి, ఈ లోకమున నుండిన నేమి?

నమ్మా : స్వామీ! ఇంద్రియములను మనస్సును సరిపఱచితిరి. శరీరము పాంచభౌతిక మగుటచేత వ్యాధులు వచ్చును. ముసలితనము వచ్చును.

జాతస్య హి ధ్రువో మృత్యుః ధ్రువం జన్మ మృతస్య చ,
తస్మాదపరిహార్యేఽర్థే న త్వం శోచితు మర్హసి.

-- గీత. 2.27

అనునట్లు జననమరణములు కలుగుచుండును. వ్యాధులు మనోవ్యాధులు అనుభవించెదను. ఇకముం దివి రాకుండుటకై నన్ను స్వీకరింపవలయును. గొప్పవారిని ఆశ్రయించు పక్షమున వారే పిలుచుకొని పోవలెను. కాన నన్ను స్వీకరింపవలెను.

స్వామి : మీరేమి చేసెదరు?

నమ్మా : స్వామీ! నేను దాసభూతుడను. ఆస్తికుడను. నావంటివారిని చేర్చుకొనువాడ వగుటచేతనే ని న్నడుగుటకు కారణ మగుచున్నది. నీవు లోకములయొక్క వ్యసనములను పోగొట్టువాడవు.

స్వామి : శరీరము ధర్మసాధన మయినది కదా! ఇంకను కొన్ని యేండ్లుండరాదా?

నమ్మా : స్వామీ! కొన్నిదినములీ లోకమున నుంటినేని నేను చెడిపోదును. దాసుడ నను భావమే సమసిపోవును. ఈ లోకమును నాకు చూపవలదు. శీఘ్రముగ పిలిపించు కొమ్ము.

స్వామి : లోకు లే రీతి చెడియున్నారు. లోక మెట్లు చెడియున్నది?

నమ్మా : స్వామీ!

నైవ కించి త్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్,
పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్ర న్నశ్నన్ గచ్ఛన్ స్వపన్ శ్వసన్.
ప్రలపన్ విసృజన్ గృహ్ణ న్నున్మిష న్నిమిషన్నపి,
ఇంద్రియాణీంద్రియార్థేషు వర్తంత ఇతి ధారయన్.

-- అని గీత. 5.8,9. శ్లోకములందు

చెప్పబడిన పదుమూడు కార్యములందును అనగా నిద్రలేచినది మొదలు నిద్రించువఱకు చేయుకార్యములందే మానవులు శ్రద్ధ గలిగియున్నారు.

త్వచ్ఛేషత్వజ్ఞానము లేకున్నారు. నీ కృపను సంపాదింపకున్నారు. జ్ఞానము సంపాదించలేదు. భగవద్భక్త్యాది సాధనములను సంపాదించలేనివారితో గూడిన దగుట చేత ఈ లోకము చెడియున్నది. దీనిని నాకు చూపకుడు. (నమ్మాళ్వారు వంటివారే యిట్లు దుష్టసహవాసమునకు భీతిల్లిరి. కులశేఖరులును క్షీణపుణ్యులను చూపకు డనిరి).

స్వామి : అయోగ్యులను చూచుపక్షమున కొట్టుదురా? గిల్లుదురా?

కులశేఖరులు : భక్తులుగ నుండువారితో వారు చెడునట్లు మాటలాడుదురు.

స్వామి : ఎట్లు మాటలాడుదురు?

కుల : యజ్ఞమాచరించుట స్వర్గము పొందుటయా? నిచ్చెన యేమైన నున్నదా? అగ్నిలో నేయి వేసిన స్వర్గము వచ్చునా? అని ఈ రీతిగ వచింతురు. నిజమే గదా అని తోచును. నాస్తికవాదులు బహుచమత్కారముగ మాటాడుదురు.

భోగైశ్వర్యప్రసక్తానాం తయాపహృత చేతసామ్,
వ్యవసాయాత్మికాబుద్ధి స్సమాధౌ న విధీయతే.

-- గీత. 2.44శ్లోకమట్లు వారి మాటల

వలన చెడుదురు.

యా మిమాం పుష్పితాం వాచం ప్రవదంత్యవిపశ్చితః,
వేదవాదరతాః పార్థ నాన్యదస్తీతి వాదినః.

-- గీత. 2.42.

వారి మాటలు పుష్పసదృశముగ నుండును. ఆ మాటలు బుద్ధి నీడ్చును.

శ్రుతివిప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా,
సమాధా వచలాబుద్ధి స్తదా యోగ మవాప్స్యసి.

-- గీత. 2.53శ్లోకమట్లు ఏకాగ్రబుద్ధితో

కూర్చుండి నిశ్చయించు కొనవలెను. తవచరితమపాస్య=నీ చరిత్రమును విడిచి, శ్రావ్యబంధం అన్యదాఖ్యానజాతం=చెవికింపైన ఇతర ప్రబంధములను, మాశ్రౌషం=వినకుందునుగాక (వినుటకు బాగుండినను నీ చరితమును దప్ప ఇతరమును వినకుండవలయును అని యర్థము) లేక అశ్రావ్యబంధం తవ చరిత మపాస్య=చెవికింపుగ నుండని నీ చరిత్రమును విడిచి, అన్యదాఖ్యానజాతం=ఇతర ప్రబంధములను, మాశ్రౌషం=వినకుందునుగాక (అనగా నీ కథ వినుట కింపుగ లేకపోయినను వినవలయునుగాని, బాగుగ లేదని యితరపురాణమును వినరాదు అని యర్థము.) లేక శ్రావ్యబంధం తవ చరిత మపాస్య=చెవి కింపైన నీ చరిత్రమును విడిచి, అన్యదాఖ్యానజాతం=ఇతర ప్రబంధములను, మాశ్రౌషం=వినకుందునుగాక. కడతేరవలెననియే కదా యే గ్రంథమునైనను చదువుదురు. కడతేరుమార్గముండెనేని అలంకారము శబ్ద సౌష్ఠవము ఉండ బనిలేదు. దివ్యమంగళనామమును ప్రయోగించి యుండెనేని గ్రంథ మెట్టిదైయుండినను పఠించువారి, వినువారి సకలపాపములను హరించును. భగవత్సంబంధముండు గ్రంథమును వేద మనుకొనవలయును. భగవత్సంబంధములేక, భాగవతసమ్మతము గాక యుండెనేని ప్రయోజనము లేదు. పుష్పసంబంధముచేత నార, రాజాధిరాజుల శిరమున జేరును. ఒక కవి యనిరి:-- "స్వామీ! నాకు సంస్కృతజ్ఞానము లేదు. కవనము చెప్పటకును శక్తిలేదు. అయినను తెగించి గ్రంథమును వ్రాయబూనితిని. ఈ గ్రంథము నెవ్వ రాదరింతురు? కలకండ చేర్చితిని. అమృతము చేర్చితిని. అందుచేత మెప్పుపొందెను. బావినీటియందు చక్కెర చేర్చి యుండిన పక్షమున ఆ నీటిని యడుగుదురు గాని చక్కెరలేని కావేరీ జలము నడుగుదురా? బావినీ రైనను కలకండ పానకమని పేరుపొందునుగదా! అట్టి గౌరవము కలకండ వలన గలిగెనుగాని నీటియోగ్యతచేత కాదు. ఇత్యాది కారణములచేత కులశేఖరులు భగవంతుని సంబంధములేని కథలను వినగూడదని విన్నవించి మఱియు నిట్లనిరి.

కుల : స్వామీ! వీరికంటెను ఇతరపాపు లున్నారు. వారెట్టివారనగా, పైవారు భగవంతు డున్నాడని తలంచి భక్తిసేయకుందురు. వారు భగవంతుడు లేడని చెప్పుదురు.ఈ పాపులు

అట్లుగాక భగవంతుడు లేడని వాదించి భ్రమ కలిగించెదరు. అట్టివారిని తలంపకుందునుగాక!

కుల : భువనపతే=నీవు అణువులో అణువై మహత్తునకు మహత్తై ఉండగా లేడని చెప్పు పాపిని స్మరింపనగునా?

స్వామి : అటులైన నీ కేమి కావలెను?

కుల : నీ కైంకర్య సంబంధ ముండవలయును. అట్లులేకయే జన్మ ముండరాదు. కాన స్వామీ! పాపాత్ముని చూడకుండుట, నీ సంబంధము లేనికథ వినకుండుట, నిన్ను ద్వేషించు వానిని స్మరింపకుండుట, ప్రతిజన్మమునందును నీ కైంకర్యము కలిగి యుండుట అను నాల్గు వరములను ప్రసాదింపుము.

## 16

జిహ్వే కీర్తయ కేశవం మురరిపుం చేతో భజ శ్రీధరం
పాణిద్వంద్వ సమర్చ యాచ్యుతకథా శ్శ్రోత్రద్వయ త్వం శృణు,
కృష్ణం లోకయ లోచనద్వయ హరే ర్గచ్ఛాంఘ్రియుగ్మాలయం
జిఘ్ర ఘ్రాణ ముకుంద పాదతులసీం మూర్ధ న్నమాధోక్షజమ్.

జిహ్వే=ఓ నాలుకా, కేశవం=కేశవుని, కీర్తయ=పాడుము, చేతః=ఓ మనసా! మురరిపుం=మురాసురునికి శత్రువైన విష్ణువును, భజ=సేవింపుము, పాణిద్వంద్వ=చేతులజంటా (రెండుచేతులారా), శ్రీధరం=లక్ష్మీదేవిని (రొమ్మునందు) ధరించినవానిని, సమర్చయ=చక్కగా „ పూజ సేయుము, శ్రోత్రద్వయ=ఓ చెవులజంటా, అచ్యుతకథాః=విష్ణుకథలను, త్వం=నీవు, శృణు=వినుము, లోచనద్వయ=ఓ కన్నులజంటా, కృష్ణం=శ్రీకృష్ణుని, లోకయ=చూడుము, అంఘ్రియుగ్మ=ఓ కాళ్లజంటా, హరేః=విష్ణునియొక్క, ఆలయం=గుడిని, గచ్ఛ=పొందుము, ఘ్రాణ=ఓ నాసికా, ముకుందపాద తులసీం=విష్ణువుయొక్క పాదములందలి తులసీదళమును, జిఘ్ర=వాసనచూడుము, మూర్ధన్=ఓ శిరమా, అధోక్షజం=విష్ణువును, నమ=మ్రొక్కుము.

ఓ నాలుకా! కేశవుని పాడుము. ఓ మనసా! మురవైరిని భజింపుము. చేతులారా! శ్రీధరుని చక్కగా నారాధింపుడు. చెవులారా! అచ్యుతుని కథల నాలకింపుడు. కన్నులారా! శ్రీకృష్ణుని చూడుడు. పాదములారా! శ్రీహరి సన్నిధికి పొందు, ఘ్రాణమా! ముకుందుని పాదములందు సమర్పించిన తులసిని వాసన చూడుము. శిరమా! అధోక్షజుని నమస్కరింపుము.

స్వామి : పాపులను చూడగూడదనియు, భగవత్సంబంధము లేని కథలను వినగూడదనియు, భగవంతుని ద్వేషించువానిని స్మరింపరాదనియు, ప్రతిజన్మమునందును నా కైంకర్యములేక ఉండరాదనియు కోరితివి. ఇంకను ఏమి కావలయును?

కులశేఖరులు: స్వామీ! సర్వేంద్రియములచేతను, మనోబుద్ధులచేతను సుఖము కలుగవలయును.

స్వామి : అటులైన నింద్రియములను ప్రార్థించుకొమ్ము (కులశేఖరులు మనసు చంచలమైనదని తలచి, భగవంతునియందు లయింపుమని ముందు ప్రార్థించియుండిరి. మనసు నట్లు ప్రార్థించుటచేత తదితరములైన ఇంద్రియములకు కోపము రాగా --

యతతో హ్యపి కౌంతేయ పురుషస్య విపశ్చితః,
ఇంద్రియాణి ప్రమాథీని హరంతి ప్రసభం మనః.

-- గీత. 2.60

అను రీతి ప్రమాదములైన ఇంద్రియములు మనసు నీడ్చునని తలంచిరి. దుష్టుడగు పుత్త్రునికి సద్బోధచేసి మంచిమార్గమున త్రిప్పదలచువారు వాని మిత్రులను గూడ వానిచెంత చేరనీయకుండ చేయవలయును. కేవలము తండ్రిశుశ్రూష తప్ప నితరము నెఱుంగని ఋశ్యశృంగుని వేశ్యాంగనలు తమ యూరికి పిలుచుకొని పోలేదా? కులశేఖరు లీ కారణములను దలచి భగవదాజ్ఞగైకొని యింద్రియముల నీ రీతి ప్రార్థించిరి.)

కులశేఖరుడు : నాలుకా! మనసు భగవంతునియందు లయించిన నేమి? భగవన్నామమును కీర్తింపగలుగునా? నీవే ఆ పని చేయవలసిన దానవు. కాన కేశవుని కీర్తించుము. మనసా! ఇతరేంద్రియములను ప్రార్థించినంత మాత్రాన నిన్ను మఱచితి ననుకొనకుము. నీవు మురవైరిని దలంపుము. చేతులారా! కేవలము భగవత్కీర్తనము చేసినజాలదు. మీరు శ్రీధరుని పూజింపుడు. చెవులారా! భగవంతుని పూజింపవలయునను కోరిక పుట్టవలయును. భగవత్కథ లను వినినపుడే భక్తి గలిగి ఆ కోరిక పుట్టును. మీరు వినినపుడే ఇతరేంద్రియాదులు పనిచేయును. కాన మీరు అచ్యుతుని కథల నాలింపుడు. కన్నులారా! ఎన్ని విధములుగ విన్నను అంతభక్తి గలుగదు. సాక్షాత్తుగ చూచినపుడే భక్తి కుదురును. కాన మీరు కృష్ణుని చూడుడు. పాదములారా! మీరు నడచి వెళ్ళిననే కదా భగవద్దర్శనము చేసికొననగును. మీరే ముఖ్యమైనవారు గాన శ్రీహరిసన్నిధికి పొండు. ఓ నాసికా! ఇంతదూరము పోయి హరిసన్నిధిని ప్రవేశించినపుడు భక్తులతో నిండి యుండు ఆ ప్రదేశమున చెమటపట్టును. ఇక చాలును, వెలుపలికి పోవలయునని తోచును. నీవు ఇతర వాసనలను కోరకుము. ఆ సన్నిధియందు ముకుంద చరణారవిందములందు సమర్పించిన తులసి యుండును. దానిని వాసన చూడుము. ఓ శిరమా! భగవంతుని సన్నిధికి పోయినప్పుడు నీవు వంగక గర్వ ముతో నుంటివేని యనర్థముసంభవించును. కావున సన్నిధిలోపలికి పోవునపుడే నమ్రతతో పొమ్ము. మనోవా క్కాయములకు అందనివాడు, ఇంద్రియములచేత గలుగు జ్ఞానమునకు గోచరించనివాడైన అధోక్షజునికి నమస్క రింపుము. (కులశేఖరులు ఆ యా యింద్రియములను

పిలిచి భగవద్విషయమున సంబంధపడుడని చెప్పనపుడు రెండు చేతులారా! రెండు చెవులారా! అని యీ రీతి రెంటితోడను చెప్పనేల అనగా రెండును కలసి కైంకర్యము చేయ వలయుననెడు తాత్పర్యముచేత. రెండుచేతులతో పూజింపవలయును. రెండు చెవులతో వినవలయును. ఒక చెవితో భగవత్కథ వినుచు మఱి యొక చెవితో నింకొక పుక్కిటి పురాణమును వినరాదు. భగవంతుని రెండు కన్నులతో సేవింపవలయును. ఒక కంట సేవింపుచు మఱియొక కంట నింకొక పదార్థ మును జూడరాదు. ఈ కారణములచేతనే రెంటిని గూర్చి చెప్పబడెను). ఒక్కొక్క యింద్రియమును భగ వద్విషయమున నొక్కొక కార్యము ఏల చేయవలయు ననగా ఆ యా కార్యములు చేసిననే ఆ యా యింద్రి యముల కా యాపేరులు కలుగును. భాగవతమున నీ సంగతి క్రింది విధమున జెప్పబడినది. స్థావరజంగ మములందు నిండిన స్వామిని తలచు మనసే మనసు. భగవంతుని భాగవతులను సేవించునదే శిరము. స్వామి దివ్యమంగళ విగ్రహమును సేవించునవే కన్నులు.

ఆంధ్రభాగవతమున ప్రహ్లాదు డిట్లు చెప్పెను.

సీ. కమలాక్షు నర్చించు కరములు కరములు
శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ
సురరక్షకుని జూచు చూడ్కులు చూడ్కులు
శేషశాయికి మ్రొక్కు శిరము శిరము
విష్ణు నాకర్ణించు వీనులు వీనులు
మధువైరి దవిలిన మనము మనము
భగవంతు వలగొను పదములు పదములు
పురుషోత్తముని మీది బుద్ధి బుద్ధి

తే.గీ. దేవదేవునిఁ జింతించు దినము దినము
చక్రహస్తునిఁ బ్రకటించు చదువు చదువు
కుంభినీధవుఁ జెప్పెడి గురుఁడు గురుఁడు
తండ్రి! హరిఁ జేరు మనియెడి తండ్రి తండ్రి.

భాగవతము పంచమస్కంధమున ఋషభుడు పుత్త్రులకి ట్లుపదేశించెను. మృత్యురూపసంసారమున బడి అల్లాడుచుండు వానిని లేవనెత్తలేని గురుడు గురుడు కాదు. శిష్యవిత్తాపహారుడు గురుడు కాదు. హృత్తాపహారుడే గురుడనబడును. భగవద్విషయమున జేర్చని తండ్రి తండ్రి కాదు. తల్లి తల్లి కాదు. మనోవృత్తిని శుద్ధిచేసి భగవద్భాగవత భక్తి కల్గించు దైవమే దైవము. భగవద్విషయమున సంబంధపఱచు భర్తయే భర్త. ఇట్లు చేయని వాడు విటుడు, జారుడు. కనుకనే కులశేఖరులు ఆ యా కార్యములు చేసి ఆ యా పేర్లను పొందుడని ఇంద్రియములకు బోధించి ప్రార్థించిరి.

## 17

హే లోకా శ్శృణుత ప్రసూతి మరణవ్యాధేశ్చికిత్సా మిమాం
యోగజ్ఞా స్సముదాహరన్తి మునయో యాం యాజ్ఞవల్క్యాదయః,
అంతర్జ్యోతి రమేయ మేక మమృతం కృష్ణాఖ్య మాపీయతాం
తత్పీతం పరమౌషధం వితనుతే నిర్వాణ మాత్యంతికమ్.

హే లోకాః=ఓ జనులారా, ఇమాం=నేను చెప్పబోవుచున్నట్టి, ప్రసూతి మరణ వ్యాధేః=చావు పుట్టుక లనెడు రోగమునకు, చికిత్సాం=మందును, శృణుత=వినుడు, యాం=ఏ యౌషధమును, యోగజ్ఞాః=యోగ శాస్త్రము నెఱింగినట్టి, యాజ్ఞవల్క్యాదయః=యాజ్ఞవల్క్యమహాముని మొదలుగా గల వారైన, మునయః=ఋషులు, సముదాహరంతి=చెప్పచున్నారో, అంతః జ్యోతిః=లోపలనే వెలుతురు గలదియు-స్వయం ప్రకాశమైనదియు, అమేయం=లెక్కపెట్టదగనిదియునగు, కృష్ణాఖ్యం=శ్రీకృష్ణమూర్తి యను పేరుగల, అమృతం ఏకం=అమృత మొక్కటే, ఆపీయతాం=త్రాగబడును గాక, పీతం=పానము చేయబడిన, తత్=ఆ, పరమౌషధం=ముఖ్యమైన

ఔషధమే, ఆత్యంతికమ్=మిక్కిలి యధికమైన, నిర్వాణం=ఆనందమును (మోక్షమును) వితనుతే=కలుగ జేయుచున్నది.

ఓ జనులారా! జనన మరణ వ్యాధి కొక చికిత్స చెప్పెదను వినుడు. దానిని యాజ్ఞవల్క్యాదులైన మునులు చెప్పియున్నారు. అంతర్జ్యోతి స్స్వరూపంబును, అప్రమేయమును, ముఖ్యమునగు శ్రీకృష్ణుడను పేరుగల యమృతమును ఆస్వాదింపుడు. ఆ పరమౌషధము అత్యంత సౌఖ్యమును గలుగజేయును.

కులశేఖరాళ్వారులు కౌస్తుభాంశ సంభూతులు. వారికి జ్ఞానభక్త్యాదులు లేకపోలేదు.

న మే పార్థాఽస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన,
నాఽనవాప్త మవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి.
-- గీత. 3.22

శ్రేష్ఠుడగు వాని మార్గమునే ఇతరులు అనుసరింతురుగాన తానా చరించి యితరులు ఆచరించునట్లు చేయదలంచిరి. బలాత్కరించినను భగవద్విషయమున సంబంధపడని జనులు సూక్ష్మముగ దెలిపిన తెలిసికొం దురా? తమ మార్గము ననుసరింపకుండు జనుల నుద్దేశించి కులశేఖరు లీ రీతి హితోపదేశము చేసిరి.

కులశేఖరులు: ఓ ప్రాణులారా! వినుడు (జాగరూకులై గమనింపుడు). నేనొక మందును చెప్పెదను. (సాధారణముగ లోకులు వైద్యము నందును, జ్యోతిషమునందును గురుత్వము గలిగి యుందురు. పైరెంటియందొక్క దానిని శరీర సుఖమునకు, మఱొక్కదానిని సుఖదుఃఖానుభవము తెలి సికొనుటకును కోరుదురు. కులశేఖరులు ఔషధమును తెలియపరచెద ననగానే జనులు ఆశచెంది యిట్లనిరి.)

జనులు : మీరే వ్యాధికి ఔషధము చెప్పబోవుచున్నారు?

కులశేఖరులు: జననమరణము లను ఘోరవ్యాధికి మందుచెప్పెదను. సాధారణముగ నన్ని వ్యాధులకును ఔషధము లుంచు

కొని యుందురుగాని, యీ వ్యాధికి మాత్రము దొరకదు. రావణ హిరణ్యకశ్యపులు గూడ బ్రహ్మను యాచించి ఆ యౌషధమును బడయలేక పోయిరి.

జనులు : ఆహా! అట్టి యౌషధము లభించుపక్షమున బహుసంతోషము. దానిని కనిపెట్టిన వైద్యుని పేరును వినిన యెడల మందు యొక్క యోగ్యత బాగుగ విశద మగును. తృప్తియగును.

కుల : యోగనిష్ఠులైన యాజ్ఞవల్క్యాది మునులు దానిని కనిపెట్టిరి.

జనులు : ఆ యౌషధమునందు గురుత్వము కలిగినది. అది గొప్ప వ్యాధిని కుదుర్చు మందే. మఱి అదెక్కడ దొరకును?

కుల : ఎక్కడికిని పోనక్కరలేదు. మనసులోనే యున్నది.

జనులు : లోపల చీకటిగా నున్నదే.

కుల : ఇతరౌషధములను వెదకి తెచ్చుటకు దీపముండవలెను. ఈ మందు స్వతః ప్రకాశము గలది. కావలయునని తలచిన యెడల జ్యోతి రూపమున నుండు ఆ లోపలిమందే అన్యదీపసహాయము లేకయే కనబడును.

జనులు : దాని వెల యెంత?

కుల : వెల లేదు. దానికి ఇంతయని ధరలేదు.

జనులు : ఔషధసేవ చేయనారంభించినవాడు ఒకటివెనుక నొకటిగ వివిధములైన మందులను పుచ్చుకొనవలసియుండును. అందుచేత శ్రమ కలుగును. ధనవ్యయ మగును. అట్లే యీ యౌషధము పట్టక పోయిన యెడల మార్చవలసి యుండునా?

కుల : ఇది ఆ మందులవంటిది కాదు. ఇది ఒకే మందు. దీనిని పుచ్చుకొనిన పిదప వేఱొక్కదానిని పుచ్చుకొనవలసియుండదు.

జనులు : దాని పేరేమి?

కుల : ఆ మందు కృష్ణుడను పేరుగలది.

జనులు : గొప్పమందు. గొప్పవ్యాధిని కుదుర్చును. గొప్పవారు కనిపెట్టి నట్టిది గొప్పవ్యాధిని పోగొట్టుమందు మిగుల చేదైయుండును. దేహపుష్టికి తీసికొను మందు మధురముగ నుండున ట్లుండదు. ఈ మందు చేదుగ నుండునా?

కుల : ఈ మందు అమృతముగా నుండును. లోపలికి పోయి పనిచేయును.

జనులు : నమల వలసియుండునా? కష్టముగ నుండునా?

కుల : నమలవలసిన పనిలేదు. పానము చేయవచ్చును. సులభముగనే లోపలికి పోవును.

జనులు : మిగుల మధురముగ నుండు ఔషధము అంతగా పనిచేయుదే?

కుల : త్రాగువఱకు అమృతముగ నుండును. లోపలికి పోగానే ఔషధ మగును. సకల రోగముల బోగొట్టి సుఖమిచ్చును. ఇతరౌషధ సేవ చేయుచు అపథ్యము చేసిరేని వ్యాధి మరల వచ్చును. ఆ మందులు తత్కాలమునకు సుఖ మిచ్చును. ఈ యౌషధము శాశ్వతసుఖ మిచ్చును.

మా ముపేత్య పునర్జన్మ దుఃఖాలయమశాశ్వతమ్,
నాప్నువంతి మహాత్మాన స్సంసిద్ధిం పరమాం గతాః.

-- గీత. 8.15

మరల పుట్టవలసిన అక్కర యుండదు.

జాతస్య హి ధ్రువో మృత్యుః ధ్రువం జన్మ మృతస్య చ,
తస్మాదపరి హార్యేఽర్థే న త్వం శోచితు మర్హసి.
-- గీత. 2.27 శ్లోకములందువలె

జనన మరణములు లేకుండ పోవును.

## 18

హే మర్త్యాః పరమం హితం శృణుత వో వక్ష్యామి సంక్షేపత
స్సంసారార్ణవ మాపదూర్మిబహుళం సమ్యక్ప్రవిశ్య స్థితాః,
నానాజ్ఞాన మపాస్య చేతసి నమో నారాయణాయే త్యముం
మంత్రం సప్రణవం ప్రణామసహితం ప్రావర్తయధ్వం ముహుః.

ఆపత్=ఇడుమ లనెడు, ఊర్మి=అలలచేత, బహుళం=గొప్పదైన, సంసార+అర్ణవం=సంసారమనెడు సముద్రమును, సమ్యక్=లెస్సగా, ప్రవిశ్య=ప్రవేశించి, స్థితాః=నిలుకడగా నుండునట్టి, హే మర్త్యాః=ఓ మనుష్యులారా, వః=మీకు, పరమం హితం=మిక్కిలి మేలుగలిగెడు సంగతిని, సంక్షేపతః=సంగ్రహముగా, వక్ష్యామి=చెప్పబోవుచున్నాను, శృణుత=వినుడు, నానాజ్ఞానం=సకల విధములైన యజ్ఞానములను, అపాస్య=విడిచిపెట్టి, సప్రణవం=ఓంకారరూప ముఖ్యప్రణవముతో గాని, అంకారరూప గౌణప్రణవముతో గాని కూడినదియు, ప్రణామ సహితం=నమస్కారముతో గూడినదియు నగు, నమో నారాయణాయ+ఇతి=నమో నారాయణాయ అను, అముం మంత్రం=ఈ మంత్రమును, చేతసి=మనసునందు, ముహుః=పలుమారు, ప్రావర్తయధ్వం=జపము చేయుడీ!

ఆపద లనెడి యలలచే బహుళమగు సంసారసముద్రమును పొంది యుండు మనుజులారా! మీకు హితమొక్కటి సంగ్రహముగా చెప్పెదను,

వినుడు. నానావిధమైన అజ్ఞానమును వదలి మనసునందు ప్రణవముతో గూడిన 'నమో నారాయణాయ' అను మంత్రమును ప్రణామముతో మాటి మాటికి వల్లింపుడు.

కులశేఖరులు : ఓ మర్త్యులారా! మీరు మర్త్యు లగుటచేత శాశ్వతముగ నుందు మనుకొనకుడు. ఒకవేళ నూరు సంవత్సరము లుండినను--

జాతస్య హి ధ్రువో మృత్యుః ధ్రువం జన్మ మృతస్య చ,
తస్మా దపరిహార్యేఽర్థే న త్వం శోచితు మర్హసి.

అను భగవద్గీత 2అధ్యా. 27శ్లోకములోవలె చావవలసినదే. మీకు పరమహితమును జెప్పెదను వినుడు.

జనులు : విను డనుచున్నారు. పరమహితమును జెప్పెద మనుచున్నారు. మిగుల శ్రమ పెట్టెదరా?

కుల : సంగ్రహముగ జెప్పెదను. ముందు చెప్పిన మందును పుచ్చుకొనియే తీరవలయును.

జనులు : పుచ్చుకొనియే తీరవలయునా?

కుల : మరల అడుగనేల? మీరు సంసార మను సముద్రమున ఆపద లనెడు అలలచేత కొట్టబడుచున్నారే.

జనులు : పరుగెత్తిపోయి తప్పించు కొనరాదా?

కుల : దానిలో బాగుగ దిగితిరి. పరుగెత్తజాలరు. కామ క్రోధములకు లోబడితిరి. నేను చెప్పునట్టి ఔషధమును పుచ్చుకొనుడు.

వ్యవసాయాత్మికా బుద్ధి రేకేహ కురునందన,
బహుశాఖా హ్యనంతాశ్చ బుద్ధయోఽవ్యవసాయినామ్.

-- గీత. 2.41శ్లోకములోవలె

అజ్ఞానులు అనేక సాధనము లందురు. అది విని సంశయపడరాదు.

శ్రుతివిప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా,
సమాధా వచలా బుద్ధి స్తదా యోగ మవాప్స్యసి.
-- గీత. 2.53 శ్లోకములోవలె

సందేహరహితుడు కావలయును. కొందరు పుణ్యాపాపములు లేవనియు, ప్రత్యక్షమే ప్రమాణ మనియు చెప్పుదురు. ఆ మాటలు నమ్మరాదు. వైదికాభాసమతమును బోధించువారి మాటలు వినరాదు. ప్రామాణిక మతమునే గమనింపవలయును. అజ్ఞాన కల్పితముగ చెప్పు వారిమాటలు వినరాదు. వారి మాటలకు ఆధారముండదు. ముగింపు ఉండదు. కాన నానావిధాజ్ఞానమును వదలి ఒక్కటి పట్టుకొనవలయును.

జనులు : ఆ మందును చక్కెర, నేయి, తేనె మొదలగు వానిలో దేనితో కలిపి పుచ్చుకొనవలయును? లేక ఊరకయే పుచ్చుకొనవచ్చునా? (జరామరణ వ్యాధి పోవలయునన్న నేమి చేయవలయునని యర్థము.)

(పూర్వశ్లోకమున కృష్ణుడను నౌషధము చెప్పబడెను. ఈ శ్లోకమున ఆ మందును దేనితో కలిపి తీసికొనవలయునో అనగా భగవంతు నెటు లాశ్రయించవలయునో ఆ సంగతి ననగా అనుపానమును చెప్పుచున్నాడు.)

కుల : నమో నారాయణాయ అను మంత్రమును ప్రణవము తోడను (ఓంకారము), ప్రణామము తోడను, భక్తి తోడను, అడుగడునకు జపించుచుండుడు. ఔషధమును తేనెతో గలిపి తీసికొనునట్లు శ్రీకృష్ణ డను నౌషధమును ప్రణవముతో గూడిన నమో నారాయణాయ అను అష్టాక్షరీ మంత్రమనెడు అనుపానముతో తీసికొనుడు.

ముముక్షుప్పడి 17వాక్యమున భక్తితో చేసినను, లేకున్నను భగవన్నామము కాపాడునని చెప్పబడియుండగా నిచట భక్తి చేయవలయునని

చెప్పుటేల యనగా దివ్యమైన యౌషధము పథ్యము లేకున్నను వ్యాధిని కుదుర్చును. పథ్యముగ నుండినచో మఱియును విశేషము. ఈ మంత్రము ఈ రీతిగనే భక్తితోకూడెనేని విశేషమగును. నమో నారాయణాయ యను మంత్రమును ప్రణవముతో చేర్చి చెప్పవలెను. అట్లుకాకపోయిన అష్టాక్షరి యగుటకు బదులు సప్తాక్షరియే గదా అగును?

## 19

పృథ్వీ రేణు రణుః పయాంసి కణికాః ఫల్గు స్ఫులింగోఽలఘుః,
తేజో నిశ్శ్వసనం మరు త్తనుతరం రంధ్రం సుసూక్ష్మం నభః,
క్షుద్రా రుద్రపితామహప్రభృతయః కీటాస్సమస్తా స్సురాః
దృష్టే యత్ర స తావకో విజయతే భూమావధూతావధిః.

యత్ర=ఏ నీమహిమ, దృష్టే సతి=చూడబడిన దగుచుండగా, పృథ్వీ=భూమి, అణుః=సూక్ష్మమయిన, రేణుః=ధూళియో, పయాంసి=సముద్రజలములు, కణికాః=నీటి తుంపరలో, అలఘుః=గొప్పదైన, తేజః=సూర్యచంద్రాగ్నుల వెలుగు, ఫల్గుః=చిన్నదగు, స్ఫులింగః=మిణుగురో, మరుత్=గాలి, తనుతరం=మిక్కిలిసన్నదైన, నిశ్శ్వసనం=నిట్టూర్పో, నభః=ఆకాశము, సుసూక్ష్మం=మిక్కిలిసన్నని, రంధ్రం=బెజ్జమో, రుద్ర=ఈశ్వరుడు, పితామహ=బ్రహ్మదేవుడు, ప్రభృతయః=మొదలుగా గలవారైన, సమస్తాః సురాః= దేవత లందఱును, క్షుద్రాః=చిన్న, కీటాః=పురుగులో, సః=అటువంటి, తావకః=నీదైనట్టి, అవధూతావధిః=అంతములేనట్టి, భూమా=మహిమ, విజయతే=అంతటను వ్యాపించి సర్వోత్కర్షతో విరాజిల్లుచున్నది.

ఏ నీ మహిమ పరికించినప్పుడు భూమి చిన్న దుమ్ముగాను, ఉదకములు చిన్న తుంపరలుగాను, అగ్ని స్వల్పమైన మిణుగురులుగాను, వాయువు సన్నని ఊపిరిగాను, ఆకాశము చిన్న ద్వారముగాను, బ్రహ్మరుద్రాదులగు సమస్తదేవతలు చిన్న పురుగులుగాను అగుదురో అట్టి నీ మహిమ ఎల్లలేక

వెలుగుచున్నది. (కులశేఖరులు భగవత్పరత్వమును విశేషముగ కొనియాడి ప్రజలకు బోధించగా భగవంతుడు కులశేఖరు నీ రీతి నడిగెను).

స్వామి : నన్ను ప్రసూతి మరణము లనెడు వ్యాధికి ఔషధమని ప్రజలకు బోధించి విశేషముగ గౌరవించితివి. బ్రహ్మదేవుడు ఘనుడై యుండలేదా? పంచభూతము లుండలేదా? నన్నింతగ హెచ్చుగ చెప్పనేల?

కులశేఖరులు : స్వామీ! నాకు మిక్కిలి పొగడి చెప్పుటకు చేత కాలేదు. నన్ను మీరు మోసపుచ్చ జూచుచున్నారు. కాని నేను బాగుగ గమనించి యున్నాను.

స్వామి : భూమి గొప్పదై యుండలేదా?

కుల : స్వామీ! నీ గౌరవము తెలియకమునుపు భూమియొక గొప్పదిగా భావింపబడును. కాని నీ మహిమము తెలిసిన పిమ్మట కూడ అది గౌరవమైనదని తోచునా? అది చిన్న అణువుగ తోచుచున్నది. సముద్ర జలముల నన్నిటిని చేర్చి చూచినను చిన్న బిందువులుగ తోచుచున్నవి. తేజోరూపుడైన అగ్ని చిన్న నిప్పురవ్వగ తోచుచున్నాడు.

చంచలం హి మనః కృష్ణ ప్రమాథి బలవ ద్దృఢమ్,
తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్.
-- గీత. 6.34

అని గాలి నిలువదని చెప్పబడెను. అట్టిగాలి నీ ముక్కుశ్వాసగ తోచుచున్నది. అంతట నిండియుండు ఆకాశము చిన్న ద్వారముగ తోచుచున్నది. రుద్ర పితామహ ప్రభృతులు క్రిమికీటాదులవలె తోచుచున్నారు. నీ మహిమము అట్లు ప్రకాశించుచున్నది.

స్వామి : నా గౌరవము పాటించి యిట్లంటివి. రేపు నాకంటె హెచ్చైన మఱియొకనిని జూచిన నన్నును హీనముగ చూతువేమో!

కుల : స్వామీ! నీ గొప్పకు మేరలేదు. నీకంటెను గొప్పయైనది వేఱుగ నెచ్చటను లేదు. నన్ను మోస పుచ్చవలయునని చూచుచున్నావు. నేను అన్నింటిని జూచియే మి మ్మాశ్ర యించితిని.

## 20

బద్ధేనాంజలినా నతేన శిరసా గాత్రై స్సరోమోద్గమైః
కంఠేన స్వరగద్గదేన నయనే నోద్గీర్ణ బాష్పాంబునా,
నిత్యం త్వచ్చరణారవిందయుగళ ధ్యానామృతాస్వాదినా
మస్మాకం సరసీరుహాక్ష సతతం సంపద్యతాం జీవితమ్.

సరసీరుహాక్ష=ఓ కమలములవంటి కన్నులుగలవాడా! బద్ధేన=కట్ట బడిన, అంజలినా=అంజలిచేతను, నతేన=వంచబడిన, శిరసా=శిరస్సు చేతను, సరోమోద్గమైః=గగుర్పాటుతో గూడిన, గాత్రైః=కరచరణాద్యవయ వములచేతను, స్వరగద్గదేన=గొంతు చప్పుడుచేత కొతుకు పడుచుండు, కంఠేన=కంఠముచేతను, ఉద్గీర్ణ=బయటికివచ్చుచుండు, బాష్పాంబునా=కన్నీ రుగల, నయనేన=నేత్రముల చేతను, నిత్యం=ఎల్లప్పుడు, త్వత్=నీయొక్క, చరణారవింద=కమలములవంటి పాదములయొక్క, యుగళ=జంటయొక్క, ధ్యాన=చింతసేయుటయను, అమృత=అమృతమును, ఆస్వాదినాం=పాన ముచేయునట్టి, అస్మాకం=మాకు, సతతం=ఎల్లప్పుడు, జీవితం=జీవనము, సంపద్యతామ్=కడచిపోవునుగాక!

తామరరేకులవంటి కన్నులు గలిగిన కృష్ణా! అంజలిసేయు హస్త ములతోడను, వంగిన శిరస్సుతోడను, గగుర్పాటుతో గూడిన గాత్రము తోడను, డగ్గుత్తిక గల కంఠముతోడను, ఆనందబాష్పములుగల కన్నులతో డను, నిత్యము నీ చరణ కమలధ్యానమనెడి అమృతమును పానము చేయుటయందు మాకు సదా జీవనము కలుగుగాక!

స్వామి : నీవు బాగుగ పరిశీలించి ప్రపంచము తుచ్ఛమని భావించితివి. నాయండ జేరితివి; సంతోషము. నీకేమి కావలెను?

కులశేఖరులు : స్వామీ! నాకేమియు వలసినది లేదు.

స్వామి : అయినను చెప్పుము.

కుల : నా చేతులు ఇతర కార్యములను జేయక నీ కంజలి ఘటింప వలయును. శిరము వంగి యుండవలయును. భగవంతుని సదా తలచుచుండుటచేత శరీరము రోమాంఛముతో గూడినదిగ నుండవలయును. అయ్యో! యిన్ని దినములు భగవంతుని దలపకుంటినిగదా యని చింతించుట చేత భయము గలిగి మఱియును భగవద్భక్తి గలిగి అందుచేత కంఠమున గద్గదస్వరము కలుగవలయును. భగవంతుని దర్శించుట చేతను, ధ్యానించుటచేతను కన్నులలో ఆనందబాష్పములు కలుగవలయును. సర్వకాలముల యందును నీయొక్క చరణకమలద్వయము యొక్క ధ్యానము అను నమృతమును పానము చేయ వలయును. ఓ పుండరీకాక్షా! మా కీ రీతి జీవితము జరుగవలయును.

## 21

హే గోపాలక హే కృపాజలనిధే హే సింధుకన్యాపతే
హే కంసాంతక హే గజేంద్రకరుణాపారీణ హే మాధవ
హే రామానుజ హే జగత్త్రియగురో హే పుండరీకాక్ష మాం
హే గోపీజననాథ పాలయ పరం జానామి న త్వాం వినా.

హే గోపాలక=ఓ పశువులను పాలించువాడా (గోశబ్దమునకు భూమి యనియు నర్థము), హే కృపాజలనిధే=దయకు సముద్ర మయినవాడా, హే సింధుకన్యాపతే=సముద్రుని కూతురగు లక్ష్మీదేవికి ప్రియుడా, హే

కంసాంతక=ఓ కంసుని సంహరించిన కృష్ణమూర్తీ, హే గజేంద్రకరుణా పారీణ=గజేంద్రునియొక్క దుఃఖమును పోగొట్టి దరిజేర్చిన వాడా, హే మాధవ=ఓ లక్ష్మీవల్లభుడా, హే రామానుజ=ఓ బలరాముని తమ్ముడా, హే జగత్త్రియగురో=ఓ ముల్లోకములనేలువాడా, హే పుండరీకాక్ష=ఓ తెల్లదామరలవంటి నేత్రములు గలవాడా, హే గోపీ జననాథ=ఓ గోపస్త్రీప్రియుడా, మాం=నన్ను (త్వం=నీవు), పాలయ=కాపాడుము, త్వాం వినా=నిన్ను దప్ప, పరం=ఇంకొకనిని (అహం=నేను), న జానామి=ఎఱుగను.

ఓ గోపాలక! ఓ కృపాజలనిధీ! ఓ సింధుకన్యాపతీ! ఓ కంసాంతకా! ఓ గజేంద్రవరదా! ఓ మాధవా! ఓ రామానుజా! ఓ జగత్త్రియగురూ! ఓ పుండరీకాక్షా! ఓ గోపీజననాథా! నన్ను గాపాడుము. నిన్ను దప్ప నితరము నెఱుంగను. (ఇది నిత్య మనుసంధానము చేయదగిన శ్లోకము.)

స్వామి : అంజలిబద్ధుడవై శిరము వంచి రోమాంచముతోడను, డగ్గుత్తికగల కంఠము తోడను, ఆనందబాష్పముల తోడను, నా పాదధ్యానము సేయుచు కాలము గడు పవలయు నంటివి. వారు వారు వచ్చి తమ మనసు నర్పించి నన్ను వరము లడుగుచుండుట, నే నా మనసు నంగీకరించివారి వారి మనోరథము లీడేర్చుచుండుట యనునదియేనా నా కార్యము?

కులశేఖరులు : స్వామీ! నీవు గోపాలకుడవు గదా! గోశబ్దముచేత చెప్ప బడు జీవాత్మలకు అనగా బ్రహ్మమొదలు చీమవఱకు గల సకలప్రాణుల కెల్ల పాలకుడవు గదా!

ద్వా విమౌ పురుషౌ లోకే క్షర శ్చాక్షర ఏవ చ,
క్షర స్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే.
ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః,
యో లోకత్రయ మావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః.

అని భగవద్గీత 15అధ్యా, 16, 17 శ్లోకములలో చెప్పినట్లు నీవు బద్ధ ముక్తులకు పైవాడవు; పురుషోత్తముడవు; ప్రభుడవు. ఇట్లు బద్ధముక్తులను పరిపాలించువాడవై యుండి అట్లు పాలింపవేని గోపాలకు డను నీ పేరు పోవునే.

స్వామి : నేను ఘనులనే కాపాడుదును.

కుల : స్వామీ! నీవు నీ సౌలభ్యగుణముచేత గోవులను గాపాడలేదా?

స్వామి : నేను రక్షింపవలసిన వాడనైనను దయలేకుండు పక్షమున ఏ దోషమునైనను ఆరోపించి రక్షింపకపోవుదును గదా!

కుల : స్వామీ! నీవు కృపాజలధివి గదా! సముద్రమున జలమునకు తక్కువ లేనట్లు నీయందు కృపకు తక్కువయుండదు.

స్వామి : కృపగలవాడనైనను నీవు అపరాధము చేసినప్పుడు శిక్షింపనా?

కుల : స్వామి నీవు సింధుకన్యాపతివి గదా! (సముద్రరాజ తనయకు భర్తవుకదా!) పురుషకారము చేయుటకు మా తల్లి యుండలేదా?

స్వామి : లక్ష్మీదేవి యుండిన మాత్రమున నేమి? ప్రతివాడును వాని భార్య మాటను గౌరవించునా?

కుల : స్వామీ! భార్య బీదయింటిదై యుండెనేని భర్త ఆమె మాటను ఒకవేళ త్రోసిపుచ్చినను పుచ్చును. శ్రీమంతుని పుత్రిక అయ్యేనేని ఆమె మాట సదా చెల్లుచుండును. నీ భార్యయన్ననో రత్నాకరుని కూతురు గదా! అందుచేత నామెమాట నీ చెవి కెక్కగలదు. ద్వయప్రకరణము 13 వాక్యము రీత్యా ఈమె చేతనులతో మాతృత్వ సంబంధము గలిగి వీరి దుఃఖమును చూడజాలక భగవంతునితో పత్నీత్వసంబంధము గలిగి ఆయనకు అత్యంత ప్రియురాలైయుండుటచేత ఈమె పురుషకారము చేయును. ఆ పురుషకారమునకు ఏవిధమైన ప్రతిబంధకమును ఉండదు.

స్వామి : నా దయాస్వభావముచేతనో, పురుషకారముచేతనో, రక్షించు టకు సమ్మతించెదనుగాని నాకు శక్తియుండవలదా?

కుల : స్వామీ! నీవు కంసాంతకుడవుగదా! శిష్టులను కాపాడి దుష్టులను సంహరించుటకు శక్తిగలిగియున్నావు. అదియును గాక కామక్రోధ రాగద్వేషములను పరిహరించువాడవు.

స్వామి : నేను రక్షింపగలిగినవాడనే, అయినను నే నా గుణములను అనుష్ఠానమునకు తెచ్చుకొనలేదు. అట్లెవరినైనను రక్షించి యుండిన యెడల తెలుపవచ్చును.

కుల : స్వామీ! మనుష్యుడనై యుండు నన్ను గాపాడుమాట అటుండనిమ్ము. గజేంద్రుని కాపాడియుండలేదా?

స్వామి : నేను వైకుంఠమున నుండువాడను. అందుచేత నా కృప నెట్లు వెల్లడిచేయుగలను?

కుల : స్వామీ! నీవు మాధవుడవు కదా! (మధువంశమున పుట్టి నవాడవు. మాధవా యనగా యాదవా అని యర్థము). నీ వీలోకమున నవతరించి యుండుటచేత రక్షింపగలుగుదువు.

మత్తః పరతరం నాన్యత్ కించి దస్తి ధనంజయ,
మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ.

భగవద్గిత 7. 7వశ్లోకః వలె నీవు సకలమును ధరించువాడవు.

స్వామి : ని న్నొక్కని కాపాడగలను. అనేకులయొక్క ఆపదలను నివా రించి శత్రువులబారినుండి వారిని విడిపించి రక్షించుటకు నే నొక్కడనే సమర్థుడ నగుదునా?

కుల : స్వామీ! నీవు రామానుజుడవు కదా! నీవు శ్రీ వైకుం ఠముననుండు నపుడు భక్తులను గైకొని రక్షింతువు. భక్త విరోధులు వచ్చిరేని ఆదిశేషా! వారిని చంపుకొమ్మందువు. నీకు సహాయులు లేరని యెట్లు చెప్పగలవు?

స్వామి : నే నచ్చట నుండిన వేళ ఆదిశేషుదు సహాయుడై యున్నాడు. ఈ లోకమునకు వచ్చుటచేత ఆ యాదిశేషుడు లేడు గదా! ఎట్లు సహాయసంపన్నుడ నగుదును?

కుల : స్వామీ! నీవు నీ పేరును మార్చితివి. అందుచేత నీ శయ్యయు తన పేరును మార్చుకొనెను. నీవు కృష్ణుడవు. అతడు రాముడు. అందుచేత నీవు రామానుజుడవు. సహాయసంపన్నుడవే.

స్వామి : అటులైన నీకేమి కావలయును?

స్వామి : జ్ఞాన భక్తి వైరాగ్యములు కావలయును.

స్వామి : ఆచార్యు నాశ్రయింపుము.

కుల : స్వామీ! నీవు ఆచార్యుడవు కావా? కాదని చెప్పిన యెడల ఇతరాచార్యుల నాశ్రయించెదను.

స్వామి : నేను గురువు నగుదునా?

కుల : స్వామీ! నీవు జగత్త్రియగురుడవు కదా! బ్రహ్మదేవుని నాభికమలమునందు గూర్చుండ బెట్టుకొని వేదముల నుపదేశించలేదా? బదరికాశ్రమమున నరనారాయణరూపుడవై నారాయణాష్టాక్షరీమంత్రము నుపదేశించ లేదా?

స్వామి : మిగుల స్తుతించుచున్నావు. ఏమి కోరెదవు?

కుల : ఓ పుండరీకాక్షా! నీ విశాలనేత్రములతో జూచిన చాలును.

స్వామి : జ్ఞానభక్త్యాదు లుండినగదా రక్షింప నగును?

కుల : స్వామీ! నీవు గోపీజననాథుడవుగదా! గోపికలకు జ్ఞానభక్త్యాదులుండెనా? వారు సల్పిన కామభక్తిని గూడ సమ్మతించితివి కదా! కనుక నన్ను కాపాడుటకు సంశయమేల?

స్వామి : నా కంటె గొప్పవారిని ఆశ్రయింపరాదా?

కుల : స్వామీ! నీకంటెను మించినవా డున్నాడనినే నే శాస్త్రము నందును చదివియుండలేదు. నా బుద్ధి కట్లు తోచలేదు.

## 22

**భక్తాపాయభుజంగ గారుడమణిః త్రైలోక్య రక్షామణిః**
**గోపీలోచన చాతకాంబుదమణి స్సౌందర్య ముద్రామణిః,**
**యః కాంతామణి రుక్మిణీ ఘనకుచద్వంద్వైక భూషామణిః**
**శ్రేయో దేవశిఖామణి ర్దిశతు నో గోపాలచూడామణిః.**

భక్త=భక్తులయొక్క, అపాయ=కష్టములనెడి, భుజంగ=సర్పములకు, గారుడమణిః=శ్రేష్ఠమైన గారుడమంత్రమును, త్రైలోక్య=ముల్లోకముల యొక్క, రక్షా=కాపాడుటయందు, మణిః=శ్రేష్ఠుడును, గోపీ=గోపికల యొక్క, లోచన=కన్ను లను, చాతక=వానకోయిలలకు, అంబుదమణిః= కాలమేఘమైనవాడును, సౌందర్యముద్రామణిః=అందమునకు దృఢమైన ముద్రయైనవాడును, కాంతామణి=స్త్రీలలో నుత్తమురాలైన, రుక్మిణీ=రుక్మి ణీదేవియొక్క, ఘన=గొప్పవయిన, కుచద్వంద్వ=స్తనములజంటకు, ఏక= ముఖ్యమయిన, భూషామణిః=శ్రేష్ఠమైన ఆభరణప్రాయమైనవాడును, దేవశి ఖామణిః=దేవతలకు శిరోభూషణ మైనవాడును, గోపాలచూడామణిః=గొల్ల లలో శ్రేష్ఠుడును, యః=ఎవడో, సః=ఆ శ్రీ కృష్ణుడు, శ్రేయః=సంపదను, నః=మాకు, దిశతు=ఇచ్చునుగాక!

భక్తుల యపాయములనెడి పాములకు గరుడమణియు, మూడు లోకములకును రక్షామణియు, గోపికలయొక్క కన్నులనెడి చాతకము లకు మేఘమణియు, సౌందర్యమునకు ముద్రామణియు, నారీమణియగు రుక్మిణీ దేవియొక్క ఘనకుచములకు అలంకారమణియు, దేవశిఖామణియు నగు గోపాలచూడామణి మాకు శ్రేయస్సు నొసంగుగాక!

కులశేఖరులు తా మొనర్చిన ముకుందమాల నెల్లవారును తెలిసికొని కడతేరవలయు ననియే తలంపు గలిగియుండిరి. అట్లుండియు క్రింది శ్లోకమున 'మాం పాలయ' -- నన్ను రక్షింపుమని భగవంతునితో విన్నవించిరి. స్వామి నన్ను మాత్రమే గాక నావలెనే యెల్లవారిని కాపాడవలయునని ఈ శ్లోకమున విన్నవించుచున్నారు.

కులశేఖరులు : భగవంతు డెల్లవారిని కాపాడునా యనిన నతడు భక్తుల అపాయములనెడు పాములకు గరుడమణిగా నున్నాడు. గరుడుని యొక్క స్పర్శచేతను, దర్శనము చేతను సర్పము పోవును. భగవద్దర్శనముచే, స్మరణముచే భక్తుల అపాయములు వీడిపోవును. గరుడమణి యని చెప్పబడు పచ్చను చూపినను పాము పాటిపోవును. పాము కఱచిన చోట ఆ మణిని రాచినను విషము విఱిగి పోవును. నీలమేఘశ్యాముడగు స్వామి యొక్క దర్శనము కాగానే భక్తుల సంకటము లనెడు పాములు పాటిపోవును. అతడు త్రైలోక్యరక్షామణిగా నున్నాడు. మంత్రవాదులు రక్షామణిని కట్టుదురు. ఆ మణిని ధరించినవాడు మాత్రము కాపాడబడును. భగవంతుడన్ననో చరాచరప్రపంచ మందుండు సకలప్రాణులకు రక్షామణిగా నున్నాడు.

అందుచేత నెల్లవారిని కాపాడువాడు. మంత్రవాదులు రక్షామణిని కట్టునట్లే ఈ మణిని వసిష్ఠ వామదేవ యాజ్ఞవల్క్యాదులు నారదాదులు కట్టుదురు.

ఇట్లు స్తుతింపబడుస్వామి యెట్లున్నా డనిన గోపికల నేత్రములనెడు చాతకములకు మేఘమణిగా నున్నాడు. చాతకపక్షులు మేఘము నెదురు చూచుచు నోరు తెఱచుకొనియుండును. వాన కురిసి నీటి ధారలు పడుచుండగా ఆహారముగ చేసికొనును. నీరుక్రిందపడిన యెడల త్రాగవు.

గోపికల కనులయందు తాపము గలిగి అందుచేత కృష్ణు డెపుడు వచ్చునా యని చాతకములవలె కన్నులు తెరచుకొనియుందురు. శ్రీ కృష్ణమూర్తి రాగానే అతనిని దర్శించి వారి తాపమును పోగొట్టికొందురు. స్వామి నీలమేఘ శ్యాములు డగుటచేత గోపికల కన్నులనెడి చాతకములకు ఆనందమును గలిగించుచున్నాడు.

గోపిక లేల చాతకములట్లు స్వామికొఱకు వేచియుండిరనగా -- స్వామి సౌందర్యముద్రామణి యగుటచేత వారట్లు చేసిరి. లోకమున నే వ్యాపారము నయినను చేయువారు తమ సరకు నితరు లపహరింపకుం డుటకై ముద్రవేయుదురు. శ్రీకృష్ణమూర్తియును సౌందర్యమను వస్తువు నాదియని సీలు చేసెను.

యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జిత మేవ వా,
తత్తదే వావగచ్ఛ త్వం మమ తేజోఽంశ సంభవమ్.

భగవద్గీత 10.41వ శ్లోకమువలె నతని యనుగ్రహమున నితరులకు సౌందర్య లభించిన లభింపవలసినదే. అనగా స్వామి వంటి సౌందర్య వంతు లితరు లుండ నేరరని భావము. అట్టివా డగుటచేతనే గోపికలు అతనికై నిరీక్షించుచుండిరి. ఇట్టిమణిని ధరించువా రెవరనిన కాంతామ ణియగు రుక్మిణీదేవి. ఆమె ఘన కుచద్వంద్వమునకు ఇతడు ఆభరణ ముగ నున్నాడు. దేవశిఖామణియై యున్నాడు. సకలదేవతలును స్వామిని తమ శిరమునం దుంచుకొందురు. మఱియును గోపాలచూడామణియై యున్నాడు. చూడామణియనగా శిరమునం దుంచుకొనెడి యాభరణము. గోపాలచూడామణియనగా గోపాలురకు శిరోరత్నమని, గోపాల శ్రేష్ఠుడని యర్థము. గోపాలశ్రేష్ఠు డన్నంతమాత్రమున స్వామియొక్క గౌరవమెట్లు వెల్లడియగును?

**మత్తః పరతరం నాన్యత్ కించి దస్తి ధనంజయ,**
**మయి సర్వమిదం ప్రోతం సూత్రేమణి గణా ఇవ.**

భగ. 7.7శ్లోకమట్లు అతని కంటెను పరము, పరతరము లేదని తెలిపినగదా అతని గౌరవమునకు దగియుండును?

గోపాలు రనగా దేవతలని యర్థము. గోశబ్దముచేత చెప్పబడు జీవాత్మలను గాపాడువారు గాన గోపాలు రనబడుచున్నారు.

దేవాన్ భావయతాఽనేన తే దేవా భావయన్తు వః,
పరస్పరం భావయంత శ్శ్రేయః పర మవాప్స్యథ.

భగ. 3.11శ్లోకమున దేవతలు చేతనులను గాపాడుదురని చెప్పబడెను. అట్టి గోపాలురకు=దేవతలకు, స్వామి చూడామణిగ నున్నాడు. అనగా శిరోభూషణమయి యున్నాడు. ఇట్లగుటచేత గోపాలచూడామణి యనగా

మత్తః పరతరం నాన్య త్కించి దస్తి ధనంజయ,
మయి సర్వ మిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ.

భగ. 7అధ్యా. 7వశ్లోకమువలె నతడు పరము, పరతరము నను నర్థము సూచింపబడెను. సకలప్రాణులను రక్షించు బ్రహ్మదేవుడు మొదలగువారు ఈశ్వరులు. స్వామి మహేశ్వరుడు. అనగా వారికిని ఈశ్వరుడు.

భోక్తారం యజ్ఞతపసాం సర్వలోక మహేశ్వరమ్,
సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాన్తి మృచ్ఛతి.

భగ. 5అధ్యా. 29శ్లోకమువలె స్వామి బ్రహ్మాదులకు రక్షకుడు, శిక్షకుడు. గోపాలచూడామణి యను నర్థమును వ్యక్తపఱచుటకే దేవశిఖామణి యనియును చెప్పబడెను. ఇట్టివాడు మాకు శ్రేయస్సును అనగా నైహికాముష్మికములను నొసంగు గాక!

## 23

శత్రుచ్ఛేదైక మంత్రం సకలముపనిషద్వాక్యసంపూజ్యమంత్రం
సంసారోత్తారమంత్రం సముపచిత తమస్సంఘ నిర్యాణమంత్రమ్,
సర్వైశ్వర్యైకమంత్రం వ్యసనభుజగసందష్ట సంత్రాణ మంత్రం
జిహ్వే శ్రీకృష్ణమంత్రం జప జప సతతం జన్మసాఫల్యమంత్రమ్.

జిహ్వే=ఓ నాలుకా, శత్రుచ్ఛేదైకమంత్రం=శత్రుసంహారమందు ప్రధాన మంత్రమును, సకలం=సమస్తములయిన, ఉపనిషద్వాక్య=వేదాంత వాక్యములలో, సంపూజ్య=గౌరవింపదగిన, మంత్రం=మంత్రమును, సంసార=సంసారమునుండి, ఉత్తార=తరింపజేయునట్టి, మంత్రం=మంత్రమును, సముపచిత=ప్రోగుచేయబడిన, తమః=అజ్ఞానమను చీకటియొక్క, సంఘ=రాశిని, నిర్యాణ=పోగొట్టదగిన, మంత్రం=మంత్రమును, సర్వైశ్వర్య=అన్ని యైశ్వర్యములకు, ఏక=ముఖ్యమైన, మంత్రం=మంత్రమును, వ్యసన=దుఃఖములనెడు, భుజగ=పాములచేత, సందష్ట=మిక్కిలి కఱవబడిన వారిని, సంత్రాణ=పరిరక్షణముచేయు, మంత్రం=మంత్రమును, జన్మసాఫల్య మంత్రం=జన్మమునకు సాఫల్యమును కలుగజేయు మంత్రమును (అగు) శ్రీకృష్ణమంత్రం=శ్రీకృష్ణుడను మంత్రమును, సతతం=ఎల్లప్పుడు, జప జప=పలుమారు జపము చేయుము.

శత్రునాశమునకు ముఖ్యమంత్రమును, ఉపనిషద్వాక్యములచేత మిగుల పూజ్యముగ చెప్పబడిన మంత్రమును, సంసారమును దాటించు మంత్రమును, అతిశయించియున్న అజ్ఞానరాశిని తొలగించు మంత్రమును, సర్వైశ్వర్యములకు ముఖ్యమంత్రమును, వ్యసనములనెడు పాముల చేత కఱవబడినవారిని కాపాడు మంత్రమును, జన్మమును సఫలము జేయుమంత్రమును అగు శ్రీకృష్ణమంత్రమును ఓ నాలుకా, సర్వదా జపింపుము.

భగవంతుని ముఖోల్లాసమును కోరువారు కేవల పురుషకారము ద్వారా ఆ ఫలమును పొందెద మని తలంపరాదు. తమ మనోవాక్కాయములు

లను, ఇంద్రియములను భగవద్విషయమున సంబంధపరచవలెనని తెల్పుటకు కులశేఖరులు 'జిహ్వే కీర్తయ కేశ'వమ్మను శ్లోకమును జెప్పిరి.

ఇతరుల దయ సంపాదింపగోరువాడు వారిని సత్కరింపకపోయినను వారితో మంచిమాట లాడిన జాలును. అందుచే వారికి ప్రీతి కలుగును. ఇట్లగుటచే వాక్కు ముఖ్యమయినదిగ ఉన్నది. ఈ కారణము చేతనే కులశేఖరులు ఈ శ్లోకమున జిహ్వే శ్రీకృష్ణమంత్రం జప జప సతతం=ఓ నాలుకా, శ్రీకృష్ణమంత్రమును సదా జపింపుము, జపింపుము అని అత్యాదరముతో మరల మరల బోధించిరి.

నాలుకకు ప్రయోజనము ప్రియవాక్యములు పలుకుట, నామోచ్చారణము చేయుట. సాధారణముగ కొండెములు చెప్పువాడు పామువంటివాడు. వీడు చెవిని కఱచు పాముగ నున్నాడు. పాముచేత కఱవబడినవాడు చచ్చునట్లు వీని చేత కఱవబడినవాడు చావడు. ఇతరుడు చచ్చును. ఇట్లగుటచేత వీడు విచిత్రమైన పాముగ నున్నాడు. భగవన్మంత్రము ఇట్టి శత్రువులను నశింపజేయునది. ఇది సకలోప నిషద్వాక్యములచేత స్తుతింపబడు మంత్రము. సంసారసముద్రమునుండి గట్టెక్కించు మంత్రము.

మనయందు తమోగుణము అతిశయించి యున్నదే, అది పోవలదా యనిన ఇది తమోగుణసమూహమును నాశముగావించు గొప్పమంత్రముగ నున్నది. ఈ మంత్ర మైహికఫలముల నీయజాలదా యనిన .

కాంక్షంతః కర్మణాం సిద్ధిం యజంత ఇహ దేవతాః,
క్షిప్రం హి మానుషే లోకే సిద్ధిర్భవతి కర్మజా.

భగ. 4అధ్యా. 12వశ్లోకమువలె వారివారికి కావలసిన దాని నిచ్చునట్టి మంత్రమిది. కామ్యకర్మలకును వేదమందు విశ్వాసము కలుగు కొఱకు వేదమందును అట్టిమంత్రములు చెప్పబడియున్నవి. అట్లు వేదమందు విశ్వాసము కలిగి చూచుచుపోగా నింతకంటెను హెచ్చైన సుఖమున్నదని కనుగొందురు.

భగవన్మంత్రము సర్వైశ్వర్యముల నిచ్చునది. ప్రతి వారికిని శరీరసౌఖ్యము లేకయో, ఆలుబిడ్డలు మొదలగువారి వలననో, విద్య మొదలగునవి లేవనియో యేదేని ఒక వ్యసన ముండకమానదు. వ్యసనముల ననుభవించుచున్నప్పుడు పాముచేత కఱవబడిన ట్లుండును. ఇట్టి వారిని కాపాడుమంత్రము, బాల్యయౌవనాదుల ననుభవించుచు భార్యాపుత్రులు మొదలగు వారి విషయమున సంబంధపడి చీకటియందు మునిగి పోనీయక జన్మమును సఫలము చేయు మంత్రము. ఇట్టిది శ్రీకృష్ణ మంత్రము. నాలుకా! దీనిని జపింపుము.

# 24

వ్యామోహప్రశమౌషధం మునిమనోవృత్తి ప్రవృత్త్యౌషధం
దైత్యేంద్రార్తికరౌషధం త్రిభువనీ సంజీవనైకౌషధమ్,
భక్తాత్యంతహితౌషధం భవభయ ప్రధ్వంసనైకౌషధం
శ్రేయఃప్రాప్తికరౌషధం పిబ మన శ్శ్రీకృష్ణ దివ్యౌషధమ్.

మనః=ఓ మనసా! వ్యామోహ=అనురాగమనెడు మూర్ఛను, ప్రశమ=పోగొట్టునట్టి, ఔషధం=మందును, ముని=యోగులయొక్క, మనోవృత్తి = మనోవ్యాపారము యొక్క, ప్రవృత్తి = నడవడికి, ఔషధం=మందును, దైత్యేంద్ర=రాక్షసులలో మేటులకు, ఆర్తికర=బాధను గలుగజేయునట్టి, ఔషధం=మందును, త్రిభువనీ=ముల్లోకములను, సంజీవన=బ్రతికించునట్టి, ఏక ఔషధం=ముఖ్యమైన మందును, భక్త=సేవచేయువారికి, అత్యంత=మిక్కిలి, హిత=మేలును గలుగజేయునట్టి, ఔషధం=మందును, భవ=సంసారమువలని, భయ=వెఱపును, ప్రధ్వంసన=బొత్తిగా లేకుండజేయునట్టి, ఏక ఔషధం=ముఖ్యమయిన మందును, శ్రేయఃప్రాప్తికరౌషధం=మేలును కలుగ జేయునట్టి మందును అగు శ్రీకృష్ణ దివ్యౌషధం=శ్రీకృష్ణుడను శ్లాఘ్యమైన మందును, పిబ=పానము చేయుము.

ఓ మనసా! వ్యామోహము నణచునట్టి ఔషధమును, మునులయొక్క మనోవృత్తులను నారాయణుని వైపునకు నడపునట్టి ఔషధమును, దైత్యేంద్రులకు దుఃఖము నొసగు నౌషధమును, మూడులోకములు ఉజ్జీవించు ముఖ్యౌషధమును, భక్తులకు మిగుల హితము గావించు నౌషధమును, సంసారభయమును బోగొట్టు ముఖ్యౌషధమును, శ్రేయస్సును పొందునట్లు చేయు ఔషధమును అగు శ్రీకృష్ణ డను దివ్యౌషధమును పానము చేయుము.

వాక్కును పొగడిన తోడనే మనసునకు కోపము గలిగెను. మనసు సరిగానుండని పక్షమున అనర్థము సంభవించునని తలచి కులశేఖరు లీ శ్లోకమున మనసును సంబోధించుచున్నారు.

మనసు గొప్పదా, వాక్కు గొప్పదా యనుట కొక కథ గలదు. సాధారణముగ యజ్ఞము చేయునపుడు అగ్నివరుణేంద్రాదులకు స్వాహాయని గట్టిగ చెప్పి హవిస్సు నిత్తురు. బ్రహ్మ కిచ్చునపుడు మంత్రమును మనసున తలచి నిశ్శబ్దముగ నిత్తురు. కారణమేమన మనోవాక్కులు నేను హెచ్చు నేను హెచ్చు అని కలహించి బ్రహ్మయొద్ద కేగి తమ వివాదమును పరిష్కరింపుమని కోరిరి. "మనసే రాజు, వాక్కు పరిచారకుడు. సేవకుడు రాజాజ్ఞానుసారముగ నడచును. మనస్సు జ్ఞాపకశక్తి చేత నోటితో చెప్పించును" -- అని బ్రహ్మచెప్పగా వాక్కునకు కోపమువచ్చి నేను నీతోడ రాననెను. బ్రహ్మదేవు డపుడు నాకు కావలసినది హవిస్సే కనుక నా మంత్రమును మనసా తలచిన జాలును. చెప్పనక్కరలే దనెను. ఇందుచేతనే కులశేఖరులు మనసును వేడుచున్నారు.

భార్యాపుత్రాదులు వెంట రారని తెలిసియు వారిపై మోహము వదలదు. ఇదియే వ్యామోహము. శ్రీకృష్ణుడు దీనికౌషధము. మోహము వదలనేని మనసు సరిగానుండును. వసిష్ఠాదుల మనోవృత్తికి ఔషధము. (మనకును అట్లు చేయును) శత్రువు లాక్రమించిన నెట్లవగా దైత్యశ్రేష్ఠులకు

దుఃఖమొసగు నౌషధము. వైద్యులు వారివారి దేహస్వభావమును, దేశకాలములను చూచి మందులు మార్చి మార్చి యిచ్చుచుందురు. దానిదానికి దగినట్లు పథ్యముండవలయును. ఈ యౌషధ మన్ననో మూడులోకములకును ఔషధము. సంజీవని వంటిది.

ఇది చేదుగా నుండునా యనిన భక్తులకు మధురముగ, అభక్తులకు చేదుగ నుండును. కామక్రోధాదులచేత మన నోటికి చేదుగ నుండును. అందుకు కృష్ణౌషధ సేవ చేయవలయును. తిరుమంగయాళ్వారు 'వాడినేన్' అని యానతిచ్చిన రీతిగ జననయౌవన వార్ధకములలో గల అవస్థలను దలచిన యెడల మనము మలమూత్రములతో గూడిన గుంటలో పడియుండునట్లు తెలియును గదా! ఇట్టి సంసారభయమును పూర్తిగ పోగొట్టగలిగిన శ్రీకృష్ణ డనెడు దివ్యౌషధమును ఓ మనసా! పానము చేయుము.

## 25

ఆమ్నాయాభ్యసనా న్యరణ్యరుదితం వేదవ్రతా న్యన్వహం
మేదశ్ఛేదఫలాని పూర్తవిధయ స్సర్వే హుతం భస్మని,
తీర్థానా మవగాహనాని చ గజస్నానం వినా యత్పద
ద్వంద్వాంభోరుహసంస్మృతింవిజయతేదేవస్స నారాయణః.

యత్=ఏ నారాయణమూర్తి యొక్క, పదద్వంద్వాంభోరుహ=కమలములవంటి రెండుపాదముల యొక్క, సంస్మృతిం వినా=ధ్యానములు లేక, ఆమ్నాయాభ్యసనాని=వేదముల నభ్యసించుటలు, అరణ్యరుదితం= అడవిలో నేడ్చుట వంటివో, అన్వహం=ప్రతిదినము చేయబడునట్టి, వేద వ్రతాని=వేదమునందు చెప్పబడిన వ్రతములు, మేదశ్ఛేదఫలాని=క్రొవ్వు తరగిపోవుటయే ఫలముగా గలవో, సర్వే=సమస్తమైన, పూర్తవిధయః= గుంటలు, కోనేళ్లు త్రవ్వించుట మొదలగు ధర్మ కార్యములు, భస్మని=బూడిదలో, హుతం=హోమముచేయుట వంటివో, తీర్థానాం=గంగాది పుణ్యన

దులయొక్క, అవగాహనాని చ=స్నానములును, గజస్నానం=ఏనుగుయొక్క స్నానమువంటివో, సః దేవః నారాయణః=ఆ భగవంతుడగు శ్రీ విష్ణుమూర్తి, విజయతే=సర్వోత్కర్షతో ప్రకాశించుచున్నాడు.

ఎవ్వని పదకమలములయందు భక్తిలేనివారు చేయు వేదాధ్యయనములు అరణ్యరోదనములో, ప్రతిదినమును సల్పు వేదోక్తవ్రతములు క్రొవ్వు కరగుటయే ఫలముగా గలవియో, చెరువులు మొదలగునవి త్రవ్వించుట, దేవాలయములు కట్టించుట ఇత్యాది పుణ్యకార్యము లన్నియు బూడిదలో వేల్చిన ఆహుతులో, పుణ్యనదీ స్నానములు ఏనుగు స్నానము వంటివో అట్టి శ్రీమన్నారాయణుడు సర్వోత్కృష్టుడై విరాజిల్లు చున్నాడు.

భగవంతుని దలచినంత మాత్రమున నేమి ప్రయోజనము గలదు, వేదాధ్యయనము చేయవలదా యనిన వేదాధ్యయనము చేసిన మాత్రమున నేమి? వట్టి శాస్త్రాభ్యాసముచేసి ఉపన్యాసములు సల్పువానికి గర్వమతిశయించి యుండును. వానికి ప్రపంచ మనిన లక్ష్యముండదు. అందుచేత భగవదపచారమో, భాగవతాపచారమో కలుగును. అట్టివాడు చేయు వేదాధ్యయనము అడవిలో ఏడ్చుటతో సమానమే. పదుగురిముందు ఏడ్చినచో నీసంగతి యేమని విచారించెదరు. వాని దుఃఖోపశమనము కావచ్చును. నిర్జన ప్రదేశమున నేడ్చిన ప్రయోజనమేమి? ప్రయోజనము లేకపోవుటయేగాక అనర్థము గూడ సంభవించును. ఒంటరిగ నేడ్చుచుండు వాని కంఠస్వరమును విని మృగాదులు వచ్చి చేరును. అందుచేత హాని సంభవించును. వేదాధ్యయనము వలన ప్రయోజనము లేక పోవుటయే గాక దానిని మఱచిన పక్షమున నిర్జనమైన యరణ్యప్రదేశమున బ్రహ్మరాక్షసుడై పుట్టవలసి యుండును. అనర్థము కూడ కలుగును.

వేదాధ్యయనము సంగతి యటుండనిచ్చి, వేదశాస్త్రములందు చెప్పబడిన వ్రతముల నెల్ల నాచరించిన ప్రయోజనముండును గదా యనిన, ఆ వ్రతములు సలుపుటవలన దేహమందలి క్రొవ్వు అడగుట, మాంసము

తరగుటయే ఫలము. కాలువ, గుంట, బావి మొదలగు వానిని త్రవ్విం చుట, ఆలయప్రతిష్ఠ, బ్రాహ్మణుల కిండ్లు కట్టించి యిచ్చుట, పూజసల్పుట, యాగాదులు చేయుట మొదలగు కార్యము లన్నియు బూదిలో చేసిన హోమమువలెనే యగును. అగ్నిలో చేసిన హోమమే సార్థకమైనది. ఇది అట్టి హోమము కానేరదు.

గంగాది పుణ్యనదులలో స్నానము చేసిన ప్రయోజనమే గదా యనిన, ఆ స్నానము గజస్నానమే యగును. అటులైన పైని తెలుపబడిన సత్కా ర్యము లన్నియు వృథయేనా యనిన, భగవంతునియొక్క పాదారవింద ద్వయమందలి స్మరణ లేకపోయెనేని అన్నియు వృథయే యగును. భగవ ద్భక్తి లేక చేయు వేదాధ్యయనము వలన ప్రయోజనము లేదు. మఱచినచో అనర్థము కలుగును. వ్రతాదులు భగవన్ముఖోల్లాసమున కనియే గదా చేయు దురు? భగవంతు డున్నాడు. వాడు నన్ను కాపాడవలయును అను భావము లేక చేయు వ్రతాదులవలన ప్రయోజనము లేదు. చెరువులు త్రవ్వించుట మొదలగు సత్కార్యము లన్నియు నీశ్వరప్రీతి కలుగుటకే చేయ బడుచున్నవి. అట్టి భగవంతుని మరచి దాంభికముగ జేయు క్రియలు వృథ యగును. పుణ్యనదులగు గంగాదినదులలో స్నానమాచరించుట ఎందులకు? పాపక్షయమునకే కదా! భగవంతుని పాదప్రక్షాళన జలమగుటచేత గంగకు ప్రభావము గలిగెను. ఆ సంగతి నెఱిగి స్వామీ! నీ పాదధూళి గలసిన జలమున స్నానమాచరించెదను; కాపాడుము అను భావము లేనివాడు ఏ నీట మునిగిన నేమి? వాడు చేయు స్నానము గజస్నానమువలె వృథ యగును. ఏనుగు ఎదురు పడిన గుంట లన్నిటిలోను మునిగి గట్టెక్కి గనే తలమీద మట్టిని వేసి కొనును. మనము పాపము క్షీణించవలెనని గంగాదులందు స్నాన మాచరించినను మరల పాపములను చేయుదుము. ఇందులకే గంగాస్నాన ముదాహరింపబడెను. ఈ కారణములచేతనే భగవ త్పాదద్వయ సంస్మరణము లేక, భక్తిలేక చేయుకార్యములు వృథ యగును. అతనిని దలచి భక్తితో చేయు కార్యములే ప్రయోజనము గలవి. అట్టి నారాయణుడు ప్రపంచమునకు మీది వాడు అనగా సర్వోత్కృష్టుడు.

## 26

శ్రీమన్నామప్రోచ్య నారాయణాఖ్యం
కే న ప్రాపు ర్వాంఛితం పాపినోఽపి,
హా నః పూర్వం వాక్ప్రవృత్తా న తస్మిన్
తేన ప్రాప్తం గర్భవాసాది దుఃఖమ్.

పాపినోఽపి=పాపాత్ములయినను, కే=ఎవరు, నారాయణాఖ్యం= నారాయణ యనునట్టి, శ్రీమత్=సంపద్యుక్తమైన, నామ = పేరును, ప్రోచ్య=కీర్తించి, వాంఛితం=ఇష్టమును, న ప్రాపుః=పొందలేదు?, పూర్వం=పూర్వజన్మమునందు, వాక్=వాగింద్రియము, తస్మిన్=ఆ నారాయణ నామమునందు, న ప్రవృత్తా=ప్రవేశింపలేదు, తేన=ఆ కారణముచేత, గర్భవాసాది దుఃఖం=గర్భములో నుండుట మొదలగు వానివలన గలిగిన దుఃఖము, ప్రాప్తం=తటస్థించినది, హా=అయ్యో! 'నారాయణ' అను దివ్యనామము నుచ్చరించి పాపులుగ నుండియు ఎవరు కోరికను పొందలేదు? హా! మునుపు మనవాక్కు వాని యెడ ప్రవర్తింపలేదు. అందుచేతనే గర్భవాసము మొదలగు దుఃఖములు అనుభవింపబడినవి.

సకలక్రియలకును ఫలదాత భగవంతుడు గాన వాని జ్ఞాపకము లేక చేయబడు కార్యములకు ఫలములేదు. గొప్ప క్రియలకు మహిమ కలుగవలయు ననిన వానిని స్మరించి చేయవలయునని చెప్పబడెను. భగవంతుని మిగుల స్తోత్రము చేయునట్లు తోచుచున్నది. వానిని తలంచినంత మాత్రమున పాపము నశించునాయనిన అతని నామము మిగుల గొప్పది.

శ్రీమత్=సంపద్యుక్తమైనది. ఋగ్వేద, యజుర్వేద, సామవేదములలో అణగిన నామము. వేదాంత శాస్త్రమున చెప్పబడిన శ్రీశబ్దముతో సంబంధముగల నామము. వాని నామమును నుడివి యెట్టి పాపియైనను తరించును. మిక్కిలి అజ్ఞానియైన అజామిళుడు స్వధర్మమును విడిచి

వేశ్యాలోలుడయు దానియింటిలో వసించుచుండి అంత్యకాలమున ఆ దాసికి పుట్టిన నారాయణుడను తన పదియవకుమారుని బిలిచి ఆ కారణమున ముక్తి పొందెను. ఇక శ్రద్ధాభక్తులతో నుడివిన అడుగ వలయునా?

ఇట్టి పవిత్రనామముండియు ప్రాణులకేల జన్మములేక పోలేదనగా పూర్వము మన వాక్కు భగవద్విషయమున ప్రవర్తింపని కారణము చేతనే.

మన వాక్కేల ప్రవర్తింపలేదనగా హా=కష్టకాలము. అందుచేతనే గర్భవాసాది దుఃఖములు గలిగెను. పెద్దలొకరు భగవత్సన్నిధికి బోయి స్వామినుద్దేశించి, "స్వామీ! నేను రెండపరాధములు చేసితిని. నీ వాయ పరాధములను మన్నింప వలయును. పూర్వజన్మమున నేను నీకు భక్తితో నమస్కరింపలేదు. వచ్చు జన్మముననను నమస్కరించను. ఈ రెండ పరాధములను మన్నింపవలయును. పోయిన జన్మమున నమస్కరించని కారణముననే నా కీ జన్మము గలిగెను. ఈ జన్మమున సేవించిన కారణముచేతనే నేను ముక్తుడ నగుదును. అపుడును నమస్కరింపను" -- అని విన్నవించిరి. కులశేఖరు లీ రీతిగనే చెప్పిరి.

అపిచే త్సుదురాచారో భజతే మా మనన్యభాక్,
సాధురేవ స మంతవ్యః సమ్యగ్వ్యవసితో హి సః.
-- గీత. 9.30శ్లోకమట్లు ఎట్టి

దురాచారుడైనను భగవద్భక్తి గలిగి యుండెనేని శ్రేష్ఠుడగును.

అపి చేదసి పాపేభ్య స్సర్వేభ్యః పాపకృత్తమః,
సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సంతరిష్యసి.

గీత. 4.36శ్లోకమట్లు ఎట్టి పాపియైనను పాపమను సముద్రమును జ్ఞానమనెడు ఓడచేత దాటగలుగును. శ్వపచుడైనను అనగా కుక్కమాంస మును వండువాడైనను భగవన్నామమును చెప్పెనేని వాడు బ్రాహ్మణుని కంటె నధికు డగును. ఉత్తమబ్రాహ్మణుడైనను భక్తిహీనుడైనచో చండాలుడే.

## 27

మజ్జన్మనః ఫల మిదం మధుకైటభారే
మత్ప్రార్థనీయ మదనుగ్రహ ఏష ఏవ,
త్వద్భృత్య భృత్య పరిచారక భృత్యభృత్య
భృత్యస్య భృత్య ఇతి మాం స్మర లోకనాథ.

మధుకైటభారే=మధుకైటభులను రాక్షసులకు శత్రువయినవాఁడా, మజ్జన్మనః=నాయొక్క పుట్టుకకు, ఫలం=ప్రయోజనము, ఇదం=ఇదియే, మత్=నాచేతను, ప్రార్థనీయః=కోరదగినదియు, మత్=నావిషయమైన, అనుగ్రహః= అనుగ్రహమును, ఏషఏవ=ఇదే, లోకనాథ=ఓ లోకాధిపతీ, మాం=నన్ను, త్వత్=దేవరవారి, భృత్య=పరిచారకునియొక్క, భృత్య=పరిచారకుని యొక్క, పరిచారక=భృత్యునియొక్క, భృత్య=పరిచారకుని యొక్క, భృత్య= పరిచారకునియొక్క, భృత్యస్య=పరిచారకునియొక్క, భృత్యః ఇతి=సేవకుడని, స్మర=తలంచుము.

ఓ మధుకైటభారీ! ఓ లోకనాథా! నాయొక్క జన్మమునకు ఇదియే ఫలము. నాయందు నీవు చూపవలసిన యనుగ్రహ మిదియే. నన్ను నీయొక్క దాస దాస దాస దాస దాస దాస దాసుడని తలంపుము.

స్వామి : శ్రీవల్లభేతి మొదలు మిగుల స్తోత్రము చేయుచున్నావు. నీ కేమి కావలయునో కోరుము. దాని నిచ్చెదను.

కులశేఖరులు : స్వామీ! ఎన్ని జన్మములో ఎత్తియెత్తి తుదకు ఈ జన్మ మెత్తితిని. దీనికి ఫలము నడిగెదను. వేఱేమియు అడుగను. అడుగవలసినది ఒక్కటియే. మీరనుగ్రహింపవలసినదియు ఆ ఒక్కటియే. మనుష్యజన్మమునకు ఫల మదియే.

స్వామి : అదేదో చెప్పుము.

కుల : స్వామీ! నన్ను నీతో చేరినవాడ నని తలంపుము.

స్వామి : అట్లు తలంచుటకు వీలుపడదు. నేను ఉచ్చస్థితియం దుండువాడను. నీవు నీచస్థితియం దుండువాడవు. అధమాధమస్థితియం దుండు నీకు ఈ ప్రాప్తి కలుగునా?

కుల : స్వామీ! నీతో చేరిన వాడనని తలంపవలదు. నీ భృత్యు లతో సమమని తలంపుము.

స్వామి : అదియైనను అగునా?

కుల : నీ యింటి భృత్యునికి, వాని భృత్యునకు, ఇట్లే అవరభృత్యు నకు క్రిందివాడనయి యేడవ భృత్యుడనుగ నున్నాడనని తలంపుము.

భగవంతునియందు ఉచ్చత్వానుసంధానమును, తనయందు నీచత్వా నుసంధానమును ఉండవలయును. శేషశేషి భావ ముండవలయును. అతడు సర్వశేషి. నేను శేషభూతుడను అని జ్ఞాపకముంచుకొనవలెను. వానికంటె హెచ్చైనది లేదు. నాకంటె తగ్గయినది లేదు అనుకొనవలయును. అట్లు తలచునపుడు ఏడుమెట్లు క్రిందకు దిగవలయును. అతడు సర్వలోకనాథు డగుటచేత అతని కనేక పరిచారకులుందురు. వసిష్ఠవామదేవాదులు, నార దాదులు, సనకాదులు, ఇంద్రుడు, చంద్రుడు, బ్రహ్మదేవుడు మొదలగు పరిచారకు లున్నారు. నేను వారితో సముడ నగుదునా? ఏడువేల యింతలు తగ్గించినను నేను సమానుడ నగుదునా అని తలంపవలెను. ఏడంతస్తులు దిగి తాను దాసు డనుకొనిన యెడల మిగుల శేషత్వాను సంధానము చూపినటు లగును. యమకింకర సంవాదమును పెలవిచ్చిన తిరుమళిశై ఆళ్వారులు భగవంతు నాశ్రయింప బనిలేదు. భగవద్భక్తి యుండబనిలేదు. భగవదితరుని ఆశ్రయింపకుండిన చాలును. మీరు వారియొద్దకు పోకుడని యముడు యమదూతల కాజ్ఞాపించెననిరి. క్రొత్తగ కాపురమునకు వచ్చిన చిన్న దానికి పతిభక్తి లేకున్నను దోషములేదు. ఆ భక్తి క్రమముగ కలుగును. ఇంటికి వచ్చిన తోడనే పొరుగింటి వానిపయి కన్నులు వేయకుండిన చాలును.

ప్రపన్నజన కూటస్థులగు నమ్మాళ్వారు "అడియారడియార్ తమక్క డియార్" అని యేడంతస్తులు తగ్గించుకొనిరి. త్రివిక్రమావతార మెత్తిన స్వామియొక్క శ్రీపాద సంబంధముందు లోకము ప్రళయమున మునిగెను. ఆ స్వామి యిపుడు మఱ్ఱియాకులో బిడ్డవలె పరుండెను. వానితో సమానుడు లేడు. మా స్వామి సృష్ట్యాదులు చేసి మనల నొకవస్తువుగ జేసెను. ఆ స్వామికి దాసదాస దాసదాస దాసదాసు లెవరో వారికి మేము దాసుల మని నమ్మాళ్వారు ఆనతిచ్చిరి.

వేదాంతదేశికులు స్వామి పాదుకలమీద పాదుకాసహస్ర'మని వేయి శ్లోకములను జేసిరి. అందొక శ్లోకముయొక్క అర్థమేమనగా "సాధారణ ముగ నెల్లవారును శేషభూతులుగ నుందురు. వారు మేము స్వామిదాసుల మందురుగాని శేషత్వముయొక్క పరిమాణమును తెలిసినవారు లేరు. నమ్మాళ్వారొక్కరే తానెంత తగ్గవలయునో అంతతగ్గి శేషత్వమును జూపి స్వామియొక్క గౌరవమును విశదపఱచిరి. ఓ పాదుకా! ఆ నమ్మాళ్వార్లను కూడ జయించితి" వనిరి.

నమ్మాళ్వార్లకు శఠగోపులని పేరు. శఠగోప మని పాదుకపేరు. ఒక చిన్నవా రింకొకగొప్పవారి పేరు పెట్టుకొనుటచేత తమయొక్క హీనత్వ మును, ఇతరులయొక్క ఔన్నత్యమును వెల్లడించినట్లగును. స్వామియొక్క పాదుక మిగుల శేషత్వానుసంధానపరులైన శఠగోపులయొక్క పేరుపెట్టు కొని శేషత్వమున వారిని కూడ జయించిన దని భావము.

## 28

వాథే వః పురుషోత్తమే త్రిజగతా మేకాధిపే చేతసా
సేవ్యే స్వస్య పదస్య దాతరి సురే నారాయణే తిష్ఠతి,
యం కంచి త్పురుషాధమం కతిపయగ్రామేశ మల్పార్థదం
సేవాయై మృగయామహే నరమహో మూకా వరాకా వయమ్.

నః=మనకు, నాథే=ప్రభుడును, త్రిజగతాం=మూడులోకములకు, ఏకాధిపే=ముఖ్యమైనపాలకుడును, చేతసా=మనస్సుచేత, సేవ్యే=కొలువ దగినవాడును, స్వస్య=తనదైన, పదస్య=స్థానముయొక్క (శ్రీవైకుంఠము యొక్క) దాతరి=దాతయగు (ఇచ్చువాడగు) వాడును, పురుషోత్తమే=పురుషశ్రేష్ఠుడును, సురే=దేవుడైనవాడును నగు, నారాయణే= శ్రీమన్నారాయణమూర్తి, తిష్ఠతి సతి=ఉండగా, కతిపయగ్రామేశం= కొన్ని గ్రామములకు దొరయైనవాడును, అల్పార్థదం=స్వల్పమైనధనము నిచ్చువాడును, పురుషాధమం=పురుషులలో అధముడైనవాడును నగు, యం కంచిత్ నరం=ఎవనినో ఒక మర్త్యుని, సేవాయై=కొలువుకొఱకు, మృగయామహే=వెదకుచున్నాము. అహో=అయ్యో, వయం=మనము, మూకాః=మూఢులము, వరాకాః=పనికిమాలినవారము.

మనకు నాథుడును, పురుషోత్తముడును, త్రిలోకముల కేకాధిపతియును, మనసుచేత సేవింపదగినవాడును, తనయొక్క పదమునే యిచ్చువాడును, దేవుడైన శ్రీమన్నారాయణు డుండగా, పురుషాధముడును, కొన్నిగ్రామములకు నాయకుడును, అల్పధనము నిచ్చువాడును, విల్లిగవ్వకు కొరగాని ఒక నరుని గొలువ వెదకుచున్నాము. ఇది ఆశ్చర్యము. (ఇందుచేత) మనము మూగలము, దీనులము.

జనులు : భగవద్దాసపరంపరయందు ఆఖవవానికి అనుదాసుడుగ నుండవలయునని భగవంతుని ప్రార్థించితిరి. అందుకే భగవంతుని మహిమ గొప్పదని తెలియుచున్నది. ఏదో కొంతపనియుండి అట్లు స్తోత్రము చేయుచున్నారా? లేక నిజముగనే అతనియందు మహిమ యున్నదా?

కులశేఖరులు : అతని మహిమనుబట్టియే అట్లు స్తుతించితిని.

జనులు : ఇతరులను గూడ స్తోత్రము చేయుదుము గదా?

కుల : జీవనము జరుగుటకొఱకు మన మే మనుష్యుని స్తుతింతుమో ఆ మనుష్యునికిని, భగవంతునికిని గల తార

తమ్యమును దెలిపెదను వినుదు. అతడు మన కెల్లర కును నాథుదు.

జనులు : మనము స్తుతించునట్టి స్వామి అందఱికిని స్వామియేనా?

కుల : ఏదో కొంత ఐశ్వర్యము నుంచుకొనియుండువాడు వట్టి పురుషుడు. అతడు పురుషోత్తముదు. పురుషశబ్దముచేత చెప్పబడు బద్ధముక్తాత్మలకు పైవాదు. అతడు త్రిలోకములకు ఏకచ్ఛత్రాధిపతి. వీడు కొన్ని గ్రామములకు నాయకుదు. వీనిని శరీరముతో సేవింపవలసి యుండును. ఒక్కపూట కొలువు మానినను కోపగించుకొనును. వాడు మనసుతో సేవింపదగినవాదు. స్వస్థముగ పరుండి. తలచినను తెలిసికొని తృప్తు డగును.

స్వామి తన స్థానమునే యిచ్చునట్టివాదు. శంఖచక్రముల నిచ్చును. ఈ మనుష్య డన్ననో అల్పధనము నిచ్చువాదుగ నున్నాదు. అతడు దేవుదు. ఇతడు నరుదు. ఇట్టి నారాయణు డుండగా మనము ఒక్క పురుషాధముని సేవింప వెదకుచున్నాము. ఇది పరమాశ్చర్యము. మనము మూఢులము, దీనులము (మూఢా వరాకా వయం -- అని యొకపాఠము) పరితాపముతో గ్రమగ్గువారు దీనులు. మనమును అట్టిస్థితియందున్నాము.

యదా హి చేంద్రియార్థేషు న కర్మ స్వనుషజ్జతే,
సర్వసంకల్పసన్న్యాసీ యోగారూఢ స్తదోచ్యతే.

గీత. 6.4శ్లోకమువలె భగవద్భక్త్యాదు లుండువారిని ఆశ్రయించినట్లయిన వారు మనము కలిగియుండు సకల సామ్రాజ్యములును భగవంతుని వలననే కదా పడసియున్నామని తెలిసికొని ఉపకారస్మృతి కల్గింతురు. అధము నాశ్రయించినయెడల మోసము జరుగును.

ఈశ్వరా! ఆరోగ్యైశ్వర్యములో, లేక మోక్షమో దేనినడిగినను ఇచ్చుటకు నీవు శక్తి గలవాడవుగా నున్నావు. ఇట్టి నీ వుండగా ని న్నాశ్రయిం

పము. నిన్ను స్తోత్రము చేయము. చేయకున్నాము, అట్లు చేయకుండుట తప్పునియైనను తలంచము. నీ విచ్చిన యింద్రియములను నీవిషయమున నుపయోగపఱచము. ఒక్క ప్రభువు యొక్క దయను సంపాదింప దలచి పలుమా రతనియొద్ద కేగిన యెడల అతనికి విసుగు జనించును. ‘అతని సమయమును నిరీక్షింపవలెను. వాని ముఖోల్లాసమును సంపాదించవలెను. తుద కత డేదో సొమ్మును దాన మిచ్చుట కాజ్ఞాపించగా నతని క్రింది యుద్యోగస్థుని ఆశ్రయించవలయును. ఆ యుద్యోగస్థునికి స్నేహితు డెవడో విచారించి వాని దయ సంపాదించి వాని ద్వారా వీని నాశ్రయింపవలెను.

ప్రభువునకు దుర్బోధచేయువా రుండినయెడల వారిని పొగడి వారి దయ సంపాదించవలెను. అబద్ధస్తోత్రములను చేయవలెను. ఇంతకంటె కుక్కగా పుట్టవచ్చును. ఇందుకు బదులు నిన్ను స్తుతించిన యెడల నీవు కాపాడవా? కామధేనువును విడిచి గాడిదను పాలుపిండ పోయిన యెడల అది వెనుకటికాళ్లతో తన్నును. నిన్ను విడిచి యితరు నాశ్రయించుట కామ ధేనువును విడిచి గాడిదపాలు పిండజూచినట్లే యగును. మౌఢ్యము వలన అట్లు చేయుదుము. అది నీ మాయ యని పెద్దలొకరు భగవంతునితో విన్నవించుకొనిరి.

## 29

మదన పరిహర స్థితిం మదీయే
మనసి ముకుందపదారవిందధామ్ని,
హరనయనకృశానునా కృశోఽసి
స్మరసి న చక్రపరాక్రమం మురారేః.

మదన=ఓ మన్మథుడా, ముకుంద=విష్ణువుయొక్క, పదారవింద= కమలముల వంటి పాదములకు, ధామ్ని=స్థానమైనట్టి, మదీయే=నాదైన, మనసి=మనస్సునందు, స్థితిం=బసచేయుటను, పరిహర=పోగొట్టుము

(త్వం=నీవు), హర=ఈశ్వరుని యొక్క, నయన=తృతీయ నేత్రము యొక్క, కృశానునా=అగ్నిచేత, కృశః=సన్నగిల్లినవాడవు (బూడిదయైన వాడవు), అపి=అయితివి, మురారేః=శ్రీకృష్ణుని యొక్క, చక్ర పరాక్రమం=సుదర్శనమను చక్రము యొక్క బలిమిని, న స్మరసి=తలంపవయితివి.

ఓ మన్మథుడా, శ్రీముకుందుని పాదకమలములకు స్థానమైన నా మనసును విడిచిపొమ్ము. రుద్రుని నేత్రాగ్నిచేత కాల్చబడితివి. మురవైరి చక్రము యొక్క పరాక్రమమును దలంపవు.

హృదయమున మన్మథవికారముండెనేని ఈ ముకుందమాల యొక్క 27వశ్లోకమున ప్రార్థించినట్లు శేషత్వానుసంధానము కలుగదు. దశరథునంతటివాడు కూడ మన్మథ వికారమునకు లోబడి కైకమాట విని శ్రీరామచంద్రు నరణ్యమునకు బంపెను. కులశేఖరు లీ కారణముచేత మన్మథుని తటిమి వేయవలెనని తలంచిరి. ఎట్టి దుష్టపుత్త్రుడైనను, పాండిత్యము, ధనము, అధికారము మొదలగు వైభవములతో గూడియుండు తండ్రికి భయపడును. ఎదుట నిలువజాలడు. కులశేఖరు లీ యుపాయము ననుసరించి మన్మథుని తొలగించవలయునని యెంచి యిట్లనుచున్నారు.

కులశేఖరులు : ఓ మన్మథుడా! (మీతండ్రియగు) ముకుందుని యొక్క పాదారవిందములను నా మనసున నుంచుకొంటిని. అందుచే నిది నీ తండ్రి యునికిగ నున్నది. కాన నీ విచ్చోటి నుండి పొమ్ము.

మన్మథుడు : నే నెంతమాత్రము కదలను.

కుల : కదలినచే సరి. కదలకున్న కష్టము సంభవించును.

మన్మ : బ్రహ్మదేవు నాశ్రయించెదను.

కుల : బ్రహ్మదేవుడు భగవంతుని యొక్క కుమారుడే గద. యోగ్యుడగు కుమారుడు తండ్రికి వ్యతిరేకముగ నడువ

జాలడు. అందుచే నతడు నీకు చోటీయడు. శివుడేమో నీకు విరోధిగ నున్నాడు. అందుచే నతని నాశ్రయించి తండ్రి నెదిరింపజాలవు.

మన్మ : శివునకును, నాకును, విరోధముండినను, నే నతనిని వేడుకొని నా తండ్రికిని, నాకును సరిపడలేదనియు, నా అన్నయగు బ్రహ్మదేవుడు వైదికుడుగాన అతని సహాయము లభింప దనియు చెప్పి నన్ను కాపాడు మనెదను. నా కపుడు తండ్రి భయముండదు.

కుల : భగవంతుని ముందు శివు డెక్కడ? శివుని వద్ద వరము బడసిన నరకాసురుని మిత్రుడగు మురాసురుని అనాయాసముగ చక్రముతో ఖండించినవా డతడు. అట్లగుట చేత మన్మథా! నీ వతని చోటును వీడవలసినదే. స్వామిని దలచి హృదయమున నిలిపితిని. కాన నీవు నా సమీపమునకు రాకుము. శరణు పొందువలకే భగవంతుడు గుణదోషము లెన్నునుగాని అటుపిమ్మట దోషము లెన్నడు. కులము, జ్ఞానము, కర్మానుష్ఠానము లను పాటింపడు.

కులశేఖరులు భగవంతుని తలచిన మన్మథవికార ముండదని మనకు తెలియజేయుచున్నారు. మన్మథవికార ముండెనేని శేషత్వానుసంధానము కలుగదు. అన్యశేష పరిహారము కాజాలదు. మన్మథు డెట్లు పోవుననగా--

ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ మనోగతాన్,
ఆత్మ న్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞ స్తదోచ్యతే.
-- గీత. 2.55శ్లోక మట్లు

భగవంతుని హృదయాకాశమున నిల్పిన యెడల తొలగును. భగవంతుని హృదయమున నిల్పుకొనిన యెడల కామక్రోధములు పాఱిపోవును.

## 30

తత్త్వం బ్రువాణాని పరం పరస్మా
న్మధు క్షరంతీవ సతాం ఫలాని,
ప్రావర్తయ ప్రాంజలి రస్మి జిహ్వే
నామాని నారాయణగోచరాణి.

జిహ్వే=ఓ నాలుకా, పరస్మాత్=ఉత్తమమైనదానికంటె, పరం=ఉత్తమమైన, తత్త్వం=సత్యవస్తువును, బ్రువాణాని=చెప్పుచుండు నవియు, సతాం=సత్పురుషులకు, మధు=తేనెను, క్షరంతి=కార్చునట్టి, ఫలానీవ=పండ్లవలె నుండునట్టివియునగు, (అథ వా), మధుక్షరంతీవ=మకరందమును స్రవింపుచున్నవో యన్నట్లుండు నవియు, సతాం ఫలాని=సత్పురుషులకు స్వతః ఫలరూపములు అనునట్టి, నారాయణగోచరాణి=విష్ణువునకు సంబంధించిన, నామాని=పేరులను, ప్రావర్తయ=వల్లించుము. (అహం=నేను), ప్రాంజలిః=అంజలిచేయువాడను, అస్మి=అయితిని.

ఓ నాలుకా! పరాత్పరమగు తత్త్వమును జెప్పునట్టివియు, సజ్జనులకు మధువును స్రవించెడు ఫలములవలె నుండునట్టివియునగు నారాయణ నామములను నుడువుము. నీకు అంజలి చేసెదను.

పూర్వము నమ్రతతో మెలగిన చిన్నయుద్యోగి తనకు గొప్ప ఉద్యోగము లభించినపుడును మర్యాదతో మెలగవలయును. అట్లు చేయడేని పై యధికారి వీనిని దుష్టునిగ భావించును. ఈ విధముననే దాసభూతుడుగ నుండువాడు భగవంతుని దలచుచు, వాని నామోచ్చారణ చేయుచుండవలయును. హెచ్చుస్థితికి వచ్చితిని, ఇక భగవన్నామముతో నేమి పని యనుకొనరాదు, గాన కులశేఖరులు వాక్కు నిటులు వేడుకొనుచున్నారు.

**కులశేఖరులు: ఓ నాలుకా! నీకు నమస్కరించెదను. స్వామి నామములను అనుసంధానము చేయుచుండుము.**

నాలుక : ఎందుకు భగవన్నామము నుచ్చరింపు మనుచున్నారు?

కుల : ఏది గొప్పదైయుండునో దానికంటెను నామము గొప్పది. బ్రహ్మ, శివుడు, ఇంద్రుడు మొదలగు వారి కంటెను గొప్పగనుండు పరమాత్మను వాని నామము లెత్తి చెప్పును.

నాలుక : అట్లు వాని తత్త్వమును దెలిసి చేసిన నేమి లాభము?

కుల : అట్లు తెలిసికొని అనుసంధించు పక్షమున మధురముగ నుండును. తేనె లొలుకు పండ్లవలె నుండును.

నాలుక : ఇంత రుచిగ నుండు పండు మనకు చేదుగ నుండునే.

కుల : పెద్దలకు, విద్వజ్జనులకు, జ్ఞానులకు రుచిగ నుండును. నాలుకా! అట్టి భగవన్నామములను చెప్పుము. నారా యణు నెత్తి చెప్పు నామముల నుచ్చరింపుము. నీకు నమస్కరించెదను.

కులశేఖరు లిట్లు జిహ్వేంద్రియమును నిగ్రహించి స్వాధీనమున నుంచు కొనవలయుననియు, దుష్టునికి మంచిమాటలతో బుద్ధి చెప్పునట్లు నాలుకకు భగవన్నామమునందు రుచి గలిగింపవలెననియు, షడ్రసములనే అనుభవిం చక భగవన్నామములను అనుభవింపవలయు ననియు తెలియజేసిరి.

## 31

ఇదం శరీరం పరిణామపేశలం
పత త్యవశ్యం శ్లథసంధిజర్ఝరమ్,
కి మౌషధైః క్లిశ్యసి మూఢ దుర్మతే
నిరామయం కృష్ణరసాయనం పిబ.

ఇదం శరీరం=ఈ నశించెడు స్వభావముగల దేహము, పరి **ణామ పేశలం=ముదిమి మొదలగు మార్పులు పొందినదై, శ్లథ=వీడి నట్టి, సంధి=కీళ్లుగలది గనుకనే, జర్ఝరం=శిథిలమైనది, అవశ్యం=తప్ప**

కుండ, పతతి=భూమిపై పడిపోవుచున్నది. మూఢ=జ్ఞానము లేనివాడా, దుర్మతే=దుష్టబుద్ధిగలవాడా, ఔషధైః=మందులచేత, కిం=ఏల, క్లిశ్యసి=కష్ట పడుచున్నావు? నిరామయం=ఆరోగ్యకరమైన, కృష్ణ రసాయనం=శ్రీకృష్ణు డను రసాయనమును, పిబ=పానముచేయుము.

కీలుకీలూడి ముదిసిన ఈ శరీరము అవశ్యము క్షీణించును. ఓ మూఢుడా! ఓ దుర్మతీ! ఔషధములను మ్రింగి ఏల శ్రమపడుచున్నావు? వ్యాధిని పోగొట్టునదియైన శ్రీకృష్ణు డను రసాయనమును పానము చేయుము.

ప్రశ్న : సదా భగవంతుని స్మరించుచు కూర్చుండిన నెట్లు? శరీ రము చెడును గదా!

ఉత్తరము : భగవంతుని నామము లుచ్చరింపక వానిని దలపక కూర్చుండిన మాత్రమున శరీరమటులే యుండునా? ఎంత మాత్రముండదు. ముదిమి వచ్చును.

ప్రశ్న : అటు పిమ్మట నే మగును?

ఉత్తరము : సంధిబంధముల బిగువు సడలును. కీలుకీలు ఊడనా రంభించును. ఒక పదార్థము క్రిందబడి విరిగిపోయి చెదరిపోయెనేని ఉపయోగించదు.

అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత,
అవ్యక్తనిధనా న్యేవ తత్ర కా పరిదేవనా.

గీత. 2అధ్యా.28శ్లోకమువలె శరీరమందు గల పంచభూతములు పోవును. అందుచేత కార్యము జరుగదు. కనుక మూఢా! (మూఢుడ నగా బుద్ధిలేనివాడు. తెలియదగిన దానిని తెలిసికొనకుండుట మౌఢ్యము. శరీరముండు రీతిని తెలిసికొనకుండుట చేత మూఢు డగుచున్నాడు.) ఓ దుర్మతీ! (అనగా దుష్ట బుద్ధిగలవాడు. మూఢుడుగ నుండుట కంటె

దుష్టబుద్ధిగ నుండుట మిగుల హానికరము. తెల్లని పదార్థమును చూడని వాని కంటెను, చూచియు ఎఱ్ఱగ నున్నది, నల్లగ నున్నది యని విపరీతముగ చెప్పువాడు అవివేకి గదా! వాని కనులే చెడినవని యెన్నవలసి యుండును. తప్పుగ తెలిసి కొనువాడే దుర్మతి. మూఢునికి శరీరము యొక్క సంగతియే తెలియదు. దుర్మతి యన్ననో ఈ శరీరము శాశ్వతముగ నుండునని విపరీతముగ దలంచును). ఇతరములైన మందులను పుచ్చుకొనవలదు.

ప్రశ్న : అటులైన శరీరమును కాపాడు కొనవలదా?

ఉత్తరము : వేఱు మందులను పుచ్చుకొను నెడల అవి శరీరమును గాపాడును. ఆత్మను చెరచును. కాన వాని నేల తీసికొనవలయును?

ప్రశ్న : అటులయిన నెట్లు?

ఉత్తరము : కృష్ణరసాయనమును పుచ్చుకొనుము. ఈ మందు అట్టిది గాదు. సకలరోగములను పోగొట్టును. శ్రీకృష్ణ రసాయనమను మందు ఆరోగ్య ప్రదములైన అనేక మూలికలు చేరి యుండుటచేత నల్లగ నుండును. (స్వామి నల్లని వాడు) రసాయనం -- రస=మోక్షమునకు, అయనం=స్థానము. మోక్షమునకు స్థానముగ నుండు కృష్ణు డను ఔషధమును త్రాగుమని భావము.

## 32

దారా వారాకరవరసుతా తే తనూజో విరించిః
స్తోతా వేద స్తవ సురగణో భృత్యవర్గః ప్రసాదః,
ముక్తిర్మాయా జగదవికలం తావకీ దేవకీ తే
మాతా మిత్రం బలరిపుసుత స్త్వయ్యతోన్యన్న జానే.

వారాకర వరసుతా=సముద్రములలో మేటియైన పాలకడలి పట్టి లక్ష్మీదేవి, తే=నీయొక్క, దారాః=ప్రియురాలు, విరించిః=బ్రహ్మ, తే=

నీకు, తనూజః=కుమారుడు, వేదః=ఋగ్యజుస్సామా థర్వణ వేదములు, స్తోతా= స్తుతిపాఠకుడు (బట్టువాడు), సురగణః=దేవతాసమూహము, భృత్యవర్గః=పరిచారకులగుంపు, ముక్తిః=మోక్షము, ప్రసాదః=నీ యను గ్రహము, అవికలం=సమస్తమైన, జగత్=ప్రపంచము, తావకీ=నీయొక్క, మాయా=ప్రకృతి, దేవకీ=దేవకీదేవి, తే=నీయొక్క, మాతా=తల్లి, బలరిపు సుతః=అర్జునుడు, తే=నీయొక్క, మిత్రం=స్నేహితుడు, అతః, అన్యత్= ఇంత కంటె నితరమును, త్వయి=నీయందున, న జానే=ఎఱుంగను.

నీకు భార్య క్షీరసాగరపుత్రియగు లక్ష్మీదేవి. కుమారుడు బ్రహ్మ. స్తోత్రము చేయునది వేదము. దేవతలు పరిచారకులు. మోక్షము నీ యనుగ్రహము. సమస్తజగత్తు నీ మాయారూపముగల ప్రకృతి. తల్లి దేవకీదేవి. హితుడు అర్జునుడు. నీయందు ఈ చెప్పిన దానికంటె వేఱొకటి నే నెఱుగను.

స్వామి : మిగుల స్తోత్రము చేయుచున్నావు. నా సంగతుల నెవరు చెప్పిరి? నన్ను గూర్చి యేమి వింటివి? ఏమి తెలిసి కొంటివి?

కులశేఖరులు : స్వామీ! క్షీరసాగరమున నుద్భవించిన లక్ష్మీదేవి నీ భార్య యని తెలిసికొంటిని. ఎవరిమీద లక్ష్మియొక్క కడగంటి చూపుపడునో వారు బ్రహ్మేంద్రు లగుదురని ఉపనిషద్వాక్యము. అట్టి లక్ష్మీదేవి తోడ స్వామి సృష్టి చేయును. లక్ష్మీనారాయణులు ప్రపంచమును సృష్టిచే యువిధమును ఒక కవి చదరంగ మాడుటగ వర్ణించెను.

ప్రపంచమే చదరంగ మాడు పలక. సత్యలోకమాదిగా గల లోకములు గళ్లు. బ్రహ్మాది సకలప్రాణులును కాయలు. సత్త్వగుణము తెల్లరంగు, రజోగుణ మెఱ్ఱరంగు. తమోగుణము నల్లరంగు. సాక్షులు వేదములు.

మాట్లాడువారు కారు గాన నిత్యసూరులును సాక్షులు. లక్ష్మీనారాయణులు చదరంగ మాడుట నితరులు చూడవచ్చునా యనిన వేదములను స్త్రీలింగముగను, నిత్యసూరులను నపుంసక లింగముగను కవి వర్ణించుట చేత వారుండ వచ్చును. ఈ చదరంగ మాడువారు కాయల నెత్తి పెట్టునట్లు బ్రహ్మాదులను గూడ మార్చుచుందురు. లక్ష్మీనారాయణుల కొక లీల యిది. ఇట్టి లక్ష్మి స్వామిభార్య. చరాచర ప్రపంచమును సృజించు బ్రహ్మదేవు డీతని కొడుకు.

స్వామి : ఏదో చిన్న గ్రంథములందు స్తుతింపబడిన దానిని చూచి నన్ను ఘనుడని తలంపనగునా?

కుల : స్వామీ! అపౌరుషేయములైన వేదములే నిన్ను ప్రస్తుతించుచున్నవి. నీ పనివారు దేవతలు. సాధారణ ప్రభుని వలన స్వల్పఫలము లభించును. నీ ప్రసాదమువలన సకలానర్థములు తొలగి ముక్తి కలుగును. నీ సామర్థ్యమును జూపవలయు ననిన అనంత కోటి బ్రహ్మాండములను సృష్టించెదవు. ఇట్టి నీ యునికి వైకుంఠమయినను, నీ సౌలభ్యమును దెలుపుచు భూలోకమున నవతరించితివి. నీ తల్లి దేవకి. అర్జునుడు నీ చెలికాడు. అతనికి సారథ్యము చేసితివి. ఆ సంగతి శాశ్వతముగ లోకమున నెగడియుండుటకు పార్థసారథి పేరుపెట్టుకొని నీ భక్తవాత్సల్యమును వెల్లడించితివి. ఈ సంగతి తప్ప మఱియొకటి నే నెఱుగను.

## 33

కృష్ణో రక్షతు నో జగత్త్రయగురుః కృష్ణం నమస్యా మ్యహం
కృష్ణే నామరశత్రవో వినిహతాః కృష్ణాయ తస్మై నమః,
కృష్ణాదేవ సముత్థితం జగదిదం కృష్ణస్య దాసోఽస్మ్యహం
కృష్ణే తిష్ఠతి సర్వమేత దఖిలం హే కృష్ణ రక్షస్వ మామ్.

జగత్త్రియగురుః=మూడులోకములను పాలించునట్టి, కృష్ణః=శ్రీ కృష్ణుడు, నః=మనలను, రక్షతు=కాపాడునుగాక, అహం=నేను, కృష్ణం=శ్రీకృష్ణమూర్తిని, నమస్యామి=నమస్కరించుచున్నాను. కృష్ణేన=శ్రీ కృష్ణునిచేత, అమరశత్రవః=దేవతా విరోధులైన రాక్షసులు, వినిహతాః=చంపబడిరి, కృష్ణాయ తస్మై=ఆ శ్రీకృష్ణుని కొఱకు, నమః=నమస్కారము, కృష్ణాదేవ=శ్రీకృష్ణుని వలననే, ఇదం జగత్=ఈ లోకమంతయు, సముత్థితం=పుట్టినది. అహం=నేను, కృష్ణస్య=శ్రీకృష్ణునికి, దాసః=సేవకుడను, అస్మి=అగుచున్నాను. కృష్ణే=శ్రీకృష్ణునియందు, సర్వం ఏతత్=ఈ ప్రపంచమంతయు, అఖిలం=నశింపకుండ, తిష్ఠతి=ఉన్నది; హే కృష్ణ=ఓ శ్రీకృష్ణా!, మాం=నీ సొత్తయిన నన్ను, రక్షస్వ=కాపాడుము.

త్రిలోకములకును గురువగు శ్రీకృష్ణుడు మమ్ము రక్షించుగాక! నేను కృష్ణుని సేవించెదను. కృష్ణుని చేత అమరశత్రులు-అసురులు చంపబడిరి. కృష్ణుని కొఱకు నమస్కారము. ఈ జగత్తు కృష్ణుని వలన పుట్టినది. నేను శ్రీకృష్ణునకు దాసుడను. ఈ సమస్తమును శ్రీకృష్ణుని యందు నెలకొనియున్నది. ఓ కృష్ణా! రక్షింపుము.

కులశేఖరులు ఎనిమిది విభక్తులను ప్రయోగించి శ్రీకృష్ణమూర్తిని స్తుతించినారు.

కృష్ణుడు రక్షించుగాక -- ప్రథమావిభక్తి
కృష్ణుని సేవించెదను -- ద్వితీయావిభక్తి
కృష్ణుని చేత అసురులు సంహరింపబడిరి -- తృతీయావిభక్తి
కృష్ణుని కొఱకు నమస్కారము -- చతుర్థీవిభక్తి.
కృష్ణుని వలన ఈ జగమంతయు పుట్టినది -- పంచమీవిభక్తి
కృష్ణునకు నేను దాసుడను -- షష్ఠీవిభక్తి
కృష్ణుని యందు ఈ జగమంతయు నెలకొని యున్నది-సప్తమీవిభక్తి
ఓ కృష్ణా! నన్ను రక్షింపుము -- సంబోధన ప్రథమావిభక్తి

## 34

తత్త్వం ప్రసీద భగవన్ కురు మ య్యనాథే
విష్ణో కృపాం పరమకారుణికః కిల త్వమ్,
సంసార సాగర నిమగ్న మనంత దీన
ముద్ధర్తు మర్హసి హరే పురుషోత్త మోఽసి.

భగవన్=ఓ భగవంతుడా, తత్=ఆ కారణముచే, త్వం=నీవు, ప్రసీద= నాయందు కోపరహితచిత్తుడవై అనుగ్రహింపుము, విష్ణో=ఓ విష్ణువా, అనాథే=దిక్కులేని, మయి=నాయందు, కృపాం=దయను, కురు=చేయుము (ఉంచుము), త్వం=నీవు, పరమ కారుణికః కిల= మిక్కిలి దయావంతుడవు గదా, హరే=ఓ హరీ, (అనంత=ఓ నాశరహితుడా), సంసారసాగరనిమగ్నం=సంసారమనెడు సముద్రము నందు మునిగినవాడును, అనంతదీనం=మిక్కిలి దీనుడ నగు, మాం=నన్ను, ఉద్ధర్తుం=లేవనెత్తుటకు, అర్హసి=తగియున్నావు, త్వం=నీవు, పురుషోత్తమః=పురుషులలో శ్రేష్ఠుడవు, అసి=అగుచున్నావు.

ఓ భగవంతుడా, అనంతుడా, హరీ, విష్ణూ, నీవు రక్షకాంతర శూన్యుడనగు నాయందు కృపచేయవలయును. న న్ననుగ్రహింపవలయును. నీవు పరమదయాళుడవు కదా! సంసారసాగరమునందు మునిగియున్న దీనుడ నగు నన్ను దరిజేర్చుటకు సమర్థుడవు కాబట్టి పురుషోత్తముడ వగుచున్నావు.

కులశేఖరులు : భగవంతుడా! ఈశ్వరా! నేను నిన్ను దప్ప నితరుని ఆశ్రయింపను. కృపచేయవలయును.

స్వామి : కృపచేయు మనుచున్నావు. నీవు పాపివి కదా! తగని వాడవే!

కుల : స్వామీ! నీవు కరుణామూర్తివి కదా! క్షమించు శక్తి కలవాడవు. నేను కృపకు తగనివాడనైనను నీవు పరమ కారుణికుడ వగుటచేత నన్ను రక్షింపవచ్చును.

స్వామి : నీకేమి అనర్థము సంభవించినది?

కుల : ఈ ముకుందమాలయందు 13, 14 శ్లోకములందు వర్ణిం పబడినట్టి సంసారసాగరమున మునిగితిని. దీనుడను. నీవు అనంతుడ వగుటచేత నన్ను గట్టెక్కించవలయును. అందుచేతనే నీకు 'హరి' యను పేరు వచ్చినది.

స్వామి : నన్ను జూచి ప్రార్థింపవలయునా? బ్రహ్మాదుల నడుగ రాదా?

కుల : స్వామీ! బ్రహ్మాదులు పురుషులు. నీవు పురుషోత్తము డవు. నీకు మీదివాడు లేదు.

యస్మాత్క్షర మతీతోఽహ మక్షరాదపి చోత్తమః,
అతోఽస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః

గీత. 15అధ్యా. 18శ్లోకములో చెప్పియున్నావు కదా! బ్రహ్మాదులకు పైవాడవగు నిన్నాశ్రయించుట సమంజసము గాని నీ క్రిందివారును, అశాశ్వతమైన స్థానమున నుండువారును అగువారి నాశ్రయింపనగునా? అచ్చటికి పొమ్ము, ఇచ్చటికి పొమ్ము అనకుము. సంసారసాగరమును దాటించుటలో వారు నీ సరికారు. కాన నిన్ను ప్రార్థించుచున్నాను. దయా నిధివిగాన నిన్ను నమ్మి అడుగుచున్నాను: నిన్ను విడువను. ఎటులైనను కాపాడుము.

## 35

నమామి నారాయణపాదపంకజం
కరోమి నారాయణపూజనం సదా,
వదామి నారాయణనామ నిర్మలం
స్మరామి నారాయణతత్త్వ మవ్యయమ్.

(అహం=నేను) నారాయణ పాదపంకజం=శ్రీమన్నారాయణమూర్తి యొక్క కమలములవంటి పాదములను, నమామి=నమస్కరించుచున్నాను, సదా=ఎల్లప్పుడు, నారాయణపూజనం = విష్ణుపూజను, కరోమి= చేయుచున్నాను, నిర్మలం=దోషరహితమైన, నారాయణనామ=శ్రీమన్నారాయణుని నామమును, వదామి=చెప్పుచున్నాను. అవ్యయం=నాశ రహితమైన, నారాయణతత్త్వం=విష్ణుడను పరతత్త్వమును, స్మరామి=తలంచుచున్నాను.

కులశేఖరులు పూర్వశ్లోకమున సంసారసాగరమున బడి అల్లాడుచుండు తన్ను ఉద్ధరింపుమని ప్రార్థించి ఈ శ్లోకమున తనయొక్క నీచత్వమును, నారాయణునియొక్క పరత్వమును వెల్లడించుటకు నారాయణుని పాద పంకజములకు నమస్కార మనిరి.

నమస్కారములు మానసిక వాచిక కాయికములని మూడు విధములు. నమస్కరింప వలయునని మనసుతో దలచి, అట్లు చేసెద నని వాక్కుతో జెప్పి, కాయముతో జేయువే యును.

కేవలము నమస్కరించిన నూత్రముతో తృప్తిపడక స్మూర్యునకు దీప మువలె తమ చిన్నతనమును తెలుపుటకై సదా నారాయణుని పూజ చేసెద ననిరి. నమస్కరించుట, పూజించుట అను కార్యములు తిరువారాధన గృహములోని కార్యములే యగుటచేత --

యద్య దాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరో జనః
స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే.

గీత. 3.21శ్లోకమువలె తా మాచరించి యితరుల చేత నాచరింప జేయుటకయి అవతరించినవారు గాన కులశేఖరులు ఇతరు లెఱుగునట్లు నారాయణనామమును వచించెద ననిరి.

మనసున లేనిదే నామోచ్చారణచేయుటకు వీలుపడదు, గాన నారాయణతత్త్వమును స్మరించెద ననిరి. నారాయణ తత్త్వమును స్మరించుటచేత వాని నామోచ్చారణకు అది హేతు వగును. నామోచ్చారణ చేయువాడు వానిని పూజించును. అటు పిమ్మట సేవించును.

## 36

శ్రీనాథ నారాయణ వాసుదేవ
శ్రీకృష్ణ భక్తప్రియ చక్రపాణే,
శ్రీపద్మనాభాచ్యుత కైటభారే
శ్రీరామ పద్మాక్ష హరే మురారే.

## 37

అనంత వైకుంఠ ముకుంద కృష్ణ
గోవింద దామోదర మాధవేతి,
వక్తుం సమర్థోఽపి న వక్తి కశ్చి
దహోజనానాం వ్యసనాభిముఖ్యమ్!

శ్రీనాథ=శ్రీవల్లభా, నారాయణ=జలశాయి యయి యుండువాడా, వాసుదేవ=వసుదేవుని పుత్త్రుడా, శ్రీకృష్ణ= ఓ కృష్ణా, భక్తప్రియ=భక్తుల కిష్టుడైనవాడా, చక్రపాణే=సుదర్శనమనుచక్రమును చేత ధరించినవాడా, శ్రీపద్మనాభ=ఓ పద్మనాభా, అచ్యుత=నాశరహితుడా, కైటభారే=కైటభుడను రక్కసుని సంహరించినవాడా, శ్రీరామ=ఓ శ్రీరామమూర్తీ, పద్మాక్ష=కమలములను బోలిన కన్నులుగలవాడా, హరే=ప్రళయకాలమందు బ్రహ్మరుద్రాదుల నందఱిని హరించువాడా, మురారే=ఓ మురాంతకుడా,

అనన్త = తుదలేనివాడా, వైకుంఠ=ఓ వైకుంఠుడా, ముకుంద=ఓ ముకుందుడా, కృష్ణ=శ్రీకృష్ణమూర్తీ, గోవింద=ఓ గోవిందుడా, దామోదర=ఓ దామోదరుడా, మాధవ=ఓ లక్ష్మీవల్లభా, ఇతి=అని, వక్తుం=చెప్పుటకు, సమర్థోఽపి=శక్తిగలవాడైనను, కశ్చిత్=ఒకడైనను, న వక్తి=చెప్పడు, అహో=అయ్యో, జనానాం=మూఢులకు, వ్యసనాభిముఖ్యం=దుఃఖము లందలి యుత్సాహము ఎంతటిదో!

కులశేఖరులు : నామోచ్చారణమే అన్నిటికి మూలము.

ప్రశ్న : ఇది సాధారణకార్యమే; సులభముగ చేయవచ్చునే.

కుల : అదియే ఆశ్చర్యము. జనులు వ్యసనపరులై ప్రవర్తించుచున్నారు. అందుకు భగవన్మాయయే కారణము. జ్ఞానము లేని మృగాదులు నామోచ్చారణ చేయకున్న యెడల తప్పులేదు. మనుష్యులకు సామర్థ్యముండియు చేయకుండుటే ఆశ్చర్యము. ఆయిరములో పెరియాళ్వార్లు బిడ్డల కైనను రామ, కృష్ణ యని పేరుపెట్టుడనిరి. నారాయణు డను పేరుగల తన దాసీపుత్త్రుని బిలిచి సద్గతి నొందిన అజామిళుడే ఇందు కుదాహరణము.

ప్రశ్న : భగవన్నామముల నెట్లు చేయవలెను?

కుల : శ్రీనాథ యని పేర్కొన వలెను. శ్రీమహాలక్ష్మిని పురుషకారముగ నుంచుకొని స్వామి నాశ్రయింప వలెను. తండ్రి కోపించినను, తల్లి యతని నడ్డగించి కాపాడును. ప్రాణులచేత నాశ్రయింపబడి స్వామి నాశ్రయించుననియు, వారి ప్రార్థన విని స్వామికి వినిపించుననియు, ప్రాణుల కామక్రోధాది దుర్గుణములను బోగొట్టి మోక్షయోగ్యులుగ జేయుననియు శ్రీ శబ్దమున కర్థము.

తల్లి నాశ్రయించినను తండ్రి సామాన్యుడుగ నుండెనేని ప్రయోజనము లేదు. స్వామి అట్టివాడు కాడు. నారాయణుడు గొప్పవాడు. 'నారాయణ'

అను పెట్టెలో సకలశాస్త్రాదు లున్నవని పురందరదాసు చెప్పిరి. తిరుమంత్రమునందు నారాయణుడు సకలవస్తువులకు స్థానమనియు, ఆ వస్తువులు ఆతనికి స్థాన మనియు చెప్పబడినది. అంతర్యామిత్వము, ఆధారత్వము చెప్పబడినది.

భూమి రాపోఽనలో వాయుః ఖం మనోబుద్ధి రేవ చ,
అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా.
అపరేయ మిత స్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్,
జీవభూతాం మహాబాహో యయేదం ధార్యతే జగత్.

భగవద్గీత, 7అధ్యాయము 4,5శ్లోకము లందువలె అతడు సృష్టించును. అదియొక గొప్పకార్యము కాజాలదు.

మయా తత మిదం సర్వం జగ దవ్యక్త మూర్తినా,
మత్థ్సాని సర్వభూతాని న చాహం తేష్వవస్థితః.

అను భగవద్గీత 9అధ్యా. 4శ్లోకమువలె ఆ వస్తువులయందు నిండియుండును. నక్షత్రములు, సూర్యచంద్రులు భగవంతుని వలననే నిలుచుచున్నారు. స్వామి వాసుదేవుడుగ నున్నాడు. అతడు సర్వమునందు వసించువాడు. తనయందు సర్వమును వసింపజేయువాడు. నారాయణ యను నామము మూలము. వాసుదేవ యను నామము దానికి వ్యాఖ్యానముగ నున్నది.

నారదుడు ధ్రువునికి వాసుదేవ ద్వాదశాక్షరి మంత్రము నుపదేశించెను. వాసుదేవు డనుటచే చెడ్డవస్తువులందును వసించునా? అన్నిటిని భరించవలదా అనిన 'దివ్' అను ధాతువుచేత అతడు లీలగా ఆ కార్యమును చేయును. సంకల్ప మాత్రమున చేయును.

**చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మ విభాగశః,**
**తస్య కర్తార మపి మాం విద్ధ్యకర్తార మవ్యయమ్.**

అను భగవద్గీత 4అధ్యా. 13శ్లోకమువలె అతడు కర్తయై కర్తయును కాదు.

ప్రశ్న : శ్రీనాథ, నారాయణ, వాసుదేవ నామములు నిత్యులకు, ముక్తులకు తగినవి. మనకు తగిననామము ఉండవలదా?

కులశేఖరులు : శ్రీకృష్ణు డతడు. అనగా రుక్మిణీ సహితుడు.

ప్రశ్న : నరసింహా, రామా అని యనక కృష్ణనే యేల చెప్పవలయును?

కుల : నరసింహుడనిన భయముగ నుండును. రాముడనిన నతని యొద్ద అబద్ధములాడరాదు. ఏకపత్నీవ్రతుడతడు. అతని యొద్ద జాగ్రత్తగ మెలగవలయును. కృష్ణు డన్ననో అనుకూలుడు. అపరాధములను సహించును. భక్తప్రియు డతడు.

అపిచే త్సుదురాచారో భజతే మా మనన్యభాక్,
సాధు రేవ సమంతవ్యః సమ్య గ్వ్యవసితో హి సః

అను భగవద్గీత 9అధ్యా. 30శ్లోకమట్లు అతడు కులశీలాదులు పాటింపడు.

యే తు ధర్మ్యామృత మిదం యథోక్తం పర్యుపాసతే,
శ్రద్దధానా మత్పరమా భక్తాస్తేఽతీవ మే ప్రియాః.

అను భగవద్గీత 12అధ్యా. 20శ్లోకమట్లు భక్తిగలవారే అతనికి ప్రియులు; భక్తిగల వారికి ప్రియుడు లేక భక్తిగలవారి యందు ప్రియము గలవాడు.

భగవద్గీత 12అధ్యాయములో "యో మద్భక్తస్స మేప్రియః" అన్నవాడు.

అనపేక్ష శ్శుచిర్దక్ష ఉదాసీనో గతవ్యథః,
సర్వారంభపరిత్యాగీ యో మద్భక్త స్స మేప్రియః.

-- గీత. 12.16.

సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః
యే భజంతి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్.

అని భగవద్గీత 9అధ్యా. 29శ్లోకములో 'వారు నాయందున్నారు, నేను వారియం దున్నాను అన్నట్టి వాడు.

ప్రశ్న : ప్రీతిమాత్ర ముండిన కార్యము కాఁగలదా యేమి?

కుల : అతడు చక్రపాణి. ఆశ్రయించినవారి శత్రువులను నశింపజేయును. దేవశత్రువులను నాశమొనరించును.

ప్రశ్న : అతడే గొప్పవాడా? ఇతరుల నాశ్రయింపరాదా?

కుల : పద్మనాభు డతడు. తన నాభికమలమందు బ్రహ్మను పుట్టించి, అతనికి వేదముల నుపదేశించిన మహోపకారి. అందుచేత నతడే ఘనుడు. ఇతర దేవతల నారాధింపరాదు. అతని చరణములను మఱచినను మఱవవచ్చునుగాని, అన్యు నాశ్రయింపకుండిన చాలును. భక్తి క్రమముగ కలుగును.

ప్రశ్న : అతడు విడిచిపెట్టిన నెట్లు?

కుల : అచ్యుతు డతడు; విడువడు.

ప్రశ్న : ఘనుడేనా?

కుల : కైటభారి యతడు. అసురుని జంపినవా డతడు. శ్రీరాము డతడు. శ్రీయందు రమించువాడు. పద్మాక్షుడు. నేత్రములకు సాధారణ లక్షణము, అసాధారణ లక్షణము అను భేదము గలదు. అతని నేత్రములు అసాధారణ లక్షణము గలవి.

ప్రశ్న : అన్నియును సరియే. పాపములు చేసిన నెట్లు?

కుల : హరి యతడు. తన్ను స్మరించిన మాత్రమున పాపముల నశింప జేయును. నిప్పు తెలియక స్పృశించినను కాల్చును.

అపి చేదసి పాపేభ్య స్సర్వేభ్యః పాపకృత్తమః,
సర్వం జ్ఞానప్లవే నైవ వృజినం సంతరిష్యసి.

అను భగవద్గీత 4అధ్యా. 36శ్లోకమువలె పెద్దపాపియైనను భయము లేదు.

ప్రశ్న : శత్రువులు సహాయ సంపన్ను లయిన నెట్లు?

కుల : శివుని యొద్ద వరముపడసి సకలలోకముల నాడించు చుండిన నరకాసురునికి స్నేహితుడును, అయిదు తలలు, పదిచేతులును గలిగిన మురాసురుని చంపినవా డతడు.

ప్రశ్న : స్వామి ముసలి వాడయిపోయిన నెట్లు?

కుల : అనంతు డతడు.

ప్రశ్న : అతనికి స్థల మున్నదా?

కుల : వైకుంఠు డతడు. వైకుంఠమున్నది.

ప్రశ్న : ఎట్లు పిలుచుకొని పోగలడు?

కుల : ముకుందు డతడు. ప్రకృతి బంధమును విడిపించి విరజా నదిలో స్నాన మాచరింపజేసి తన యూరికి పిలుచుకొని పోవును. అతడు కృష్ణుడు. పరిపూర్ణానంద స్వరూపుడు.

ప్రశ్న : మీమాట నమ్మవలసినదేనా? ప్రమాణ మున్నదా?

కుల : గోవిందు డతడు.

సర్వస్య చాహం హృది సన్నివిష్టో
మత్త స్స్మృతిర్ జ్ఞాన మపోహనం చ,
వేదైశ్చ సర్వై రహమేవ వేద్యో
వేదాంతకృ ద్వేదవిదేవ చాహమ్.

భగవద్గీత 15అధ్యా. 15శ్లోకమట్లు వెదవేద్యుడు.

ప్రశ్న : అటులైన గొప్పవాడుగ నున్నాడు.

కుల : దామోదరు డతడు. ఘనుడైనను సౌలభ్యమున్నది. తల్లియగు యశోద తన్ను కట్టబోవగా కట్టు వడక, ఆమె శ్రమను జూచి కట్టువడినవాడు.

తిరుప్పావు 5పాశురమున చెప్పబడెను. అతడు మాధవుడు-లక్ష్మీ నాథుడు. భాగ్యము నొసగును. లక్ష్మీదేవి పురుషకారము చేయును. మాధవు డనిన యాదవు డని యర్థము. యాదవు డయి లీలావిభూతికి విచ్చేసెను. మాధవ అనగా ఇంతకంటె గొప్పవాడు లేడని యర్థము. ఈ రీతి భగవంతుని కల్యాణగుణములను దెల్పునట్టి నామములను సామర్థ్య ముండియు ఒకడైనను చెప్పకుండుట ఆశ్చర్యము.

## 38

ధ్యాయంతి యే విష్ణు మనంత మవ్యయం
హృత్పద్మమధ్యే సతతం వ్యవస్థితమ్,
సమాహితానాం సతతాభయప్రదం
తే యాంతి సిద్ధిం పరమాం చ వైష్ణవీమ్.

యే=ఎవరు, అనంతం=తుదలేనివాడును, అవ్యయం=నాశరహితుడును, సతతం=ఎల్లప్పుడు, హృత్పద్మమధ్యే=యోగులయొక్క మనస్సనెడు కమలముయొక్క మధ్యమునందు, వ్యవస్థితం=చక్కగ ఉన్న వాడును, సమాహితానాం=తనయందు ఏకాగ్రచిత్తులయిన వారికి, సతతాభయప్రదం=ఎల్లప్పుడు అభయము నిచ్చువాడునగు, విష్ణుం=విష్ణువును, ధ్యాయంతి=ధ్యానము చేయుచున్నారో, తే=వారు, పరమాం=ఉత్తమమైన, వైష్ణవీం=విష్ణు సంబంధియగు, సిద్ధిం=మోక్షమును (పరమపదమును), యాంతి=పొందుచున్నారు.

హృత్కమల మధ్యమున నెల్లప్పు డుండువాడును, ఆశ్రితులకు అభయమిచ్చువాడును, అవ్యయుడును, అనంతుడునగు శ్రీమహావిష్ణు నెవరు తలచెదరో వారు శ్రేయస్కరమైన విష్ణుస్థానమగు పరమపదమును పొందుచున్నారు.

కులశేఖరులు: నాశనములేని, అంతములేని విష్ణువును ధ్యానించవలయును.

ప్రశ్న : అంత పెద్దవానిని లోపల దించుటకు సాధ్యమగునా?

కుల : హృదయ మందే ఉన్నాడు.

ప్రశ్న : అతడు పరుగెత్తిన నెట్లు?

కుల : ఎల్లప్పుడును ఉన్నాడు.

ప్రశ్న : అతడేమి చేయును?

కుల : నేహాభిక్రమ నాశోఽస్తి ప్రత్యవాయో న విద్యతే,
స్వల్ప మప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్.

అను భగవద్గీత 2అధ్యా. 40శ్లోకమట్లు సమాధియుక్తునికి అభయమిచ్చును.

ప్రశ్న : అభయమేనా?

కుల : మోక్ష మబ్బును. ధ్యానము, జ్ఞానము ముదిరి ప్రకృతి వీడి వైష్ణవము కలుగును.

## 39

**క్షీరసాగర తరంగ శీకరా**
**సార తారకిత చారుమూర్తయే,**
**భోగిభోగ శయనీయ శాయినే**
**మాధవాయ మధువిద్విషే నమః**

క్షీరసాగర=పాలసముద్రమునందలి, తరంగ= అలలయొక్క, శీకర= తుంపురులయొక్క, ఆసార=ఎడతెగనివానచేతను, తారకిత=ముత్యాల హారము ధరించినట్లుండు, చారు=అందమైన, మూర్తయే=శరీరముగల వాడును, భోగి=ఆదిశేషునియొక్క, భోగ=శరీరమనెడు, శయనీయ= పాన్పునందు, శాయినే=పరుండినట్టివాడును, మధువిద్విషే=మధువను రాక్షసుని సంహరించిన, మాధవాయ=మాధవుని కొఱకు, నమః=ప్రణామము.

క్షీరసముద్రము యొక్క అలల తుంపరలచే వ్యాపింపబడిన దివ్యమంగళ విగ్రహము గలిగినట్టియు, అనంతుని మీద శయనించి యుండునట్టియు, మధువను రాక్షసునకు శత్రువైనట్టి శ్రీమహాలక్ష్మీపతి కొఱకు నమస్కారము.

కులశేఖరులు గ్రంథమును సమాప్తి చేయదలచి యే శ్లోకమం దేమి తప్పియుండునో యని భయపడి --

**తస్మాత్ ప్రణమ్య ప్రణిధాయ కాయం**
**ప్రసాదయే త్వా మహమీశ మీడ్యమ్,**
**పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః**
**ప్రియః ప్రియాయార్హసి దేవ సోఢుమ్.**

అను భవద్గీత 11అధ్యాయము 44శ్లోక ప్రకారము తన తప్పులు మన్నింపబడవలయునని ఈ శ్లోకమున స్వామికి నమస్కరించుచున్నారు.

ఎవరికైనను అత్తవారింట నాడంబర మధికముగ నుండును. ఔదార్యమును అధికముగ నుండును. అందునమ మామగారు గొప్పవా డయ్యేనేని అల్లునికి మఱింత ఆడంబరము కలుగును. స్వామికి మామగారి యిల్లు క్షీరసాగరము. ఆ సముద్రుడు రత్నాకరుడు. అనగా రత్నములకు స్థానమైనవాడు.

కులశేఖరులు అత్తగారింటనుండు స్వామిని వర్ణించి సేవించు చున్నారు. స్వామి క్షీరసాగరమున నివసించియున్నారు. అలలు కొట్టుచుండగా

పాలతుంపరలు మీదపడినవి. అవి మేఘశ్యాములుడగు స్వామియందు నక్షత్రములవలె నున్నవి. అందుచేత అందముగ నున్నాడు. అనంతుని మీద శయనించి యున్నాడు.

మంచిగాలి, చల్లని పాలతుంపరలు గల మామగారి యిల్లు, మృదువైన పాన్పు కల్గియుండినను భార్యలేకున్న ప్రయోజనము లేదుగదా! స్వామి లక్ష్మితోనున్నారు. మధువను రాక్షసుని సంహరించినవాడుగాన ఇట్టి సుఖ సమయమందును ఆశ్రితులను మఱవడు. అట్టివానికి నమస్కరించెద నని కులశేఖరు లనిరి.

## 40

యస్య ప్రియౌ శ్రుతిధరౌ కవిలోకవీరౌ
మిత్రే ద్విజన్మవర పద్మశరావ భూతామ్,
తేనాంబుజాక్ష చరణాంబుజ షట్పదేన
రాజ్ఞా కృతా కృతిరియం కులశేఖరేణ.

యస్య=ఏ కులశేఖరులకు, ప్రియౌ=ఇష్టులును, శ్రుతిధరౌ=వేదార్థ ములను చక్కగా నెఱిగినవారును, కవిలోకవీరౌ=కవులలో శ్రేష్ఠులునగు, ద్విజన్మవర, పద్మశరావభూతాం=ద్విజన్మవరుడు, పద్మశరుడు (వాల్మీకి, నమ్మాళ్వార్లు అని పెద్ద లూహించిరి) అను నిరువురు, మిత్రే=మిత్రులో, అంబుజాక్షచరణాంబుజ షట్పదేన=కమల పత్రాక్షుడగు శ్రీమన్నారాయణుని పాదారవిందములందు భ్రమరము వంటివాడగు, తేన రాజ్ఞా కులశేఖరేణ=ఆ ప్రభువగు కులశేఖరులచేత, ఇయం కృతిః=ఈ ముకుందమాల యను కావ్యము, కృతా=చేయుబడినది.

వేదార్థములు లెస్సగా తెలిసినవారును, కవివరేణ్యులును, తన కిష్టు లును, అగు ద్విజన్మవరుడు, పద్మశరుడు అను నిరువురు ఏ కులశేఖరులకు మిత్రులైయుండిరో ఆ మహాప్రభువగు కులశేఖరులచేత ఈ ముకుందమాల యను కృతి రచింపబడినది.

* * *

# శ్రీ కులశేఖరాళ్వార్ల చరిత్రము

కుంభే పునర్వసౌ జాతం కేరళే చోలపట్టణే,
కౌస్తుభాంశం ధరాధీశం కులశేఖరమాశ్రయే.

భగవంతునకు తనతో చేరినవాడు, ఇతరుడు అని భేదము లేదు.

అపిచే త్సుదురాచారో భజతే మా మనన్యభాక్,
సాధురేవ స మంతవ్య స్సమ్య గ్వ్యవసితో హి సః.

అను భగవద్గీత 9అధ్యా. 30శ్లోకమట్లు ఆచారశీలుడైనను, దురాచా
:నను యోచనలేదు. భక్తికి అంతగౌరవము గలదు. అట్టి భక్తి చేసినచో
ంతుడు స్వాధీను డగును. భక్తప్రియు డాతడు. రూపము, ఐశ్వర్యము,
గలవారు తనకు ప్రియు లనలేదు.

యే తు ధర్మ్యామృత మిదం యథోక్తం పర్యుపాసతే,
శ్రద్దధానా మత్పరమా భక్తా స్తేఽతీవ మే ప్రియాః.

భగవద్గీత. 12అధ్యా. 20శ్లోకములోవలె భక్తిలో రసమున్నది. అట్టి భక్తి
స్వామిని స్వాధీనపఱచుకొన్నవారు ఆళ్వారులు. వారి చరిత్రములు
రువు గలిగించును.

కేరళదేశమున కొల్లినగరము లేక కుక్కుటకూటము, కోళకూరు, తిరు
క్కళమ్ అనుపేరులతో గూడి తాళ క్రముక వృక్షములచే శోభితమైన
శమును దృఢవ్రతుడను రాజు పాలించుచుండెను. ఎన్ని సద్గుణము
ను భగవద్భక్తిలే కుండినయెడల ప్రాణహీనశరీరమును అలంకరించినట్లే
ఏను.

దృఢవ్రతుడు భగవద్భక్తి పారగుడై యుండెను. అతనికి బహుకాలము
తి లేకుండెను అందుచే నతడు భార్యతోడ తప మాచరింపగా భక్త

వత్సలుడగు స్వామి ప్రత్యక్షమై పుత్రుడు కల్గునని వరమిచ్చెను. మనుష్యుల గుఱించి చెప్పునప్పుడు భక్తిని ప్రశంసింప వలయును. భగవంతుని గుఱించి చెప్పునప్పుడు భక్తవాత్సల్యమును గూర్చి ప్రశంసింపవలెను. భగవద్భక్తియుక్తుడగు దృఢవ్రతునకు భక్తవత్సలుడగు స్వామి వర మీయగా కలియుగము 28సంవత్సరమగు పరాభవయందు మాసి లేక కుంభమాసమున పునర్వసు నక్షత్రయుతమగు దశమీగురువారమున కౌస్తుభాంశ యందు దశరథునకు శ్రీరామచంద్రునివలె కులశేఖరులు అవతరించిరి. వారు కులమునకు శేఖరులు అనగా చేరకులమునకు అలంకారులు.

ఆ సంగతి తెలిసియే పెద్దలు వారి కాపేరు పెట్టిరి. సకాలమున ఉపనయన విద్యాభ్యాసములు కావించిరి. కౌస్తుభాంశజులగు కులశేఖరులు సర్వము తెలిసినవా రయ్యును వ్యాజముగ విద్య గురుని యొద్ద గ్రహించిరి. గురుముఖముగ నేర్వవలయునని ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు చెప్పుచున్నవి. కులశేఖరులు గురువును సాక్షిగా నుంచుకొని వేదములందును సర్వశాస్త్రము లందును ప్రవీణులయిరి. క్షత్రియులుగాన ధనుర్విద్యయందును ప్రావీణ్యము గలిగియుండిరి. ధనుర్విద్యాపారంగతు డగుటచేత కులశేఖరులు సర్వత్ర దిగ్విజయము చేసికొని రావలయుననియు, సకలరాజులును కానుకలు దెచ్చి తండ్రి పాదములందు సమర్పింప వలయు ననియు, పుత్రుడై పుట్టినందుకు అట్లు చేయుట తమ విధియనియు తలచి తండ్రి యాజ్ఞగొని రథగజతురగ పదాతిసైన్యములతోడ బయలుదేరిపోయి జయలక్ష్మితోడ వచ్చి చేరిరి. కులశేఖరులు దిగ్విజయము చేసి రాగా దృఢవ్రతుడతనికి యౌవరాజ్య పట్టాభిషేకము చేసెను.

కులశేఖరులు తండ్రి యనుమతిచే యువరాజై యుండి శ్రీరామచంద్రుని వలె దుష్ట నిగ్రహము, శిష్టపాలనము చేయుచుండెను. దృఢ వ్రతుడు తన పుత్త్రుని అమానుష వైభవమును, తన వయసును దలచి అతనికి సామ్రాజ్య పట్టాభిషేకము గావించి సకలము నొసగి వనమున కేగెను.

కులశేఖరాళ్వారు ధర్మనీతులతో రాజ్యమేలుచుండెను. కులశేఖరులు రాజైయుండుట చేత మనకేమి లాభము? వారికి వైష్ణవదీక్ష కలుగవలదా? అందుల కాచార్యు డుండవలయును. కులశేఖరులకు సామాన్యుడైన ఆచార్యుడు పనికిరాడని యెంచి భగవంతుడు తన సేనాని విష్వక్సేనుని పిలిచి పంచసంస్కార పూర్వకముగ సకల తత్త్వము లుపదేశింపుమని యాజ్ఞాపించెను. అతడట్లే చేసిపోయెను. పంచసంస్కారము లనగా 1) తాపము -- అనగా అగ్నియందు శంఖచక్రములను తప్తముగావించి భుజములందు ధరించుట 2) పుండ్రము 3) నామము అనగా దాసుడను పేరు 4) మంత్రము 5) యాగము. పరమైకాంతు లగుటకు ఈ యైదును కారణమని గ్రంథములు చెప్పుచున్నవి.

కులశేఖరులు రాజ్యమేలునపుడు నిరంతర పురాణ శ్రవణము చేయుచుండిరి. పురాణము లేని దినమే ఉండదు. ఇట్లు పురాణశ్రవణము చేయునపుడు శ్రీరంగ విమానము బ్రహ్మపూజలో నుండి ఇక్ష్వాకునకు, అటుపై శ్రీరామ చంద్రునకు వచ్చెననియు, శ్రీరాముడు విభీషణునకీయగా అది ఈ లోకముననే నిలిచెననియు విని, యిట్టి క్షేత్రమునకు బోయి శ్రీరంగనాథుని సేవింపవలయుననియు కోరిరి. వారు వైష్ణవాగ్రేసర సార్వభౌములై యుండిరి. రంగేశపాదార్పిత చిత్తవృత్తులైయుండి రేపు శ్రీరంగ యాత్రకు పోవలయు నని తుడుము వేయించగా నెల్లవారును సంసిద్ధమై యుందురు. రాచకార్యము లుండుటచేత పయనము నిలువగా మరల రేపు ప్రయాణమని చాటింప జేయుదురు. ఇట్లుండి యొకనాడు ప్రయాణము కాగా, వీరు ఆ క్షేత్రమునకు బోయిన మరలి రారని యెంచి మంత్రులు చందనాదు లలది భగవన్నామము నుచ్చరించు చుండు వైష్ణవోత్తములను ఎదురుగా వచ్చునట్లు చేసిరి. కులశేఖరులు ఆస్వాములను దర్శించి 'మాటలాడునట్టి వీరిని ఆరాధింపక మాట్లాడనట్టి ఆ స్వామి దర్శనమునకు బోవుట మంచిపని కా'దని తలచి వారిని సేవించి ఊరికి పిలుచుకొనిపోయి శుశ్రూషసేయుచు భోజనాది సౌకర్యములు కలిగించి, సదా ప్రియభాషణములతో కాలము పుచ్చుచు, భగవత్కైంకర్యము మరల

లభించును, భాగవత కైంకర్యము దొరకునా అని భాగవతుల విచారణలో కాలము గడపుచు శ్రీరంగ యాత్రను మరచి నీతిదప్పక రాజ్యమేలుచుండెను.

కులశేఖరులు రాజ్యమేలునపుడు ప్రతిదినమును పురాణము చదివించి వినుచుండి తిరుపతి మాహాత్మ్యమును గూడ అటులే విని భక్తి పరవశులయి అప్రయత్నముగనే లోకహితము కొఱకు సకలవేదసారమైన ముకుందమాలను గావించిరి. పురాణమును వినిన పిమ్మట భక్తియను భారముచేత కులశేఖరులు తలవంచియే యుండిరి. కులశేఖరు లిట్లు ఆనందాతిశయముతో ముకుందమాల గావించి రాజ్యపాలన మొనర్చుచు అర్చారూపుడైన శ్రీవేంకటేశ్వరుని యందును, విభవావతారమైన శ్రీరాముని యందును, నిరవధికమైన భక్తి గలిగి యుండిరి.

కులశేఖరాళ్వారు రామాయణమును విని ఆహా! శ్రీరాముడే సరి. ఇతరులు --

రసోఽహ మప్సు కౌంతేయ ప్రభాఽస్మి శశిసూర్యయోః,
ప్రణవ స్సర్వవేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు.

భగవద్గీత 7అధ్యా. 8శ్లోకమట్లు అవతరించి, దుష్టశిక్షణ శిష్టపరిపాలన చేసి పోవుదురు. శ్రీరాముడు అంత మాత్రమేకాక మాతాపితృ వాక్య పరిపాలనము, ఏకపత్నీవ్రతము మొదలగు ధర్మముల నాచరించెను. మీరు శ్రీరాముడు ఒక్కడే పరమగతిగా నమ్మి యుండవలయు ననిరి.

కులశేఖరులు రామాయణమును వినుచుండగా ఖరదూషణాదుల వధకు సంబంధించిన ఘట్టము వచ్చెను.

అందు --

చతుర్దశ సహస్రాణి రక్షసాం భీమకర్మణామ్,
ఏకశ్చ రామో ధర్మాత్మా కథం యుద్ధం భవిష్యతి.

అనగా క్రూరకర్మములు చేయుచుండు రాక్షసులు పదునాల్గు వేల మంది; రాము డొక్కడే. యుద్ధమెట్లు ముగియునో యని ఆకాశమున దేవతలు, ఋషులు ఏడ్వనారంభించిరి -- అని పౌరాణికుడు చదువగా విని భక్తిచేత ఖరదూషణాదు లొకవైపు నిలిచినట్లును, శ్రీరాము డొక్కడే ఒకతట్టు నిలిచినట్లును, ఎల్లవారు దుఃఖించు చున్నట్లును భావించి ఇట్టి సమయమున శ్రీరామునకు సహాయము చేయని జన్మ మెందుకని తలచి సేనాపతిని బిలిచి సర్వసైన్యముల సమాయత్తము గావింపుమని ఆజ్ఞాపించెను. వా రతనికి పిచ్చిపట్టిన దని తలచి సర్వము సిద్ధమై యున్నదని తెలిపిరి. త్వరితముగ రండని చెప్పి కులశేఖరులు పరుగెత్త నారంభించిరి. కేవల తన్మయత్వము నొందిరి.

భరతముని యొక నాటకము వ్రాసి దాని నప్సరసలకు జెప్పించి ఇంద్రునిముం దాడించెను. అపుడు త్రిమూర్తులును అచ్చట నుండిరి. రంభ వరుణుని భార్యవేషము, ఊర్వశి లక్ష్మి వేషము వేసిరి. వరుణుని భార్య లక్ష్మినిజూచి "అమ్మా! ఇందరిలో నీ కెవ్వనియందు కోరిక యున్న"దని యడుగగా, లక్ష్మివేషధారిణియైన ఊర్వశి పురుషోత్తముని మీద నాకు ఇచ్చగలదని చెప్పటకు మాఱుగ "పురూరవుని మీద ననురాగము గల" దని చెప్పెను. ఊర్వశి తాను లక్ష్మియనియే భావించి యుండవలయును. ఆ భావమే మనసున నాటియుండవలయును. ఆమె అట్లు చేయలేదు. కనుక ఆమెను నీ వీ లోకమున నుండదగవని భరతముని శపించెను.

కులశేఖరులు శ్రీరాముని ముందు మనస్సును లయింపజేసి నందున 'రామా! ఇదిగో వచ్చుచున్నాను' అనుచు పరుగెత్తుచు పోయెను. మంత్రులు యోజించి ఖరదూషణాదుల వధయైన ఘట్టమును చదివిననే యితడు తిరుగునని నిశ్చయించి --

"అర్ధాధికముహూర్తేన రామేణ నిశితై శ్శరైః,
చతుర్దశ సహస్రాణి రక్షసాం భీమకర్మణామ్.

ఖరదూషణ ముఖ్యానాం నిహతాని మహాహవే,
అహో బత మహత్కర్మ రామస్య విదితాత్మనః.
తం దృష్ట్వా శత్రుహంతారం మహర్షీణాం సుఖావహమ్,
బభూవ హృష్టా వైదేహీ భర్తారం పరిషస్వజే."

ఒకటిన్నర ముహూర్తముల కాలములోనే రాముడు పదనుగల బాణములతో ఖరదూషణులు నాయకులుగా గల, భయంకరమగు వ్యాపారముగల పదునాల్గువేలమంది రాక్షసులను యుద్ధములో జంపెను. ఆత్మస్వరూపము నెఱింగిన రాముడు చేసిన గొప్పకార్యము ఆశ్చర్యముగ నున్నది. శత్రుసంహారకుడును, మహర్షులకు సుఖము నిచ్చువాడును, తన భర్తయగు శ్రీరాముని జూచి సీతాదేవి సంతోషించి ఆలింగనము చేసి కొనెనని పౌరాణికుడు చదువగా కులశేఖరులు "సైనికులారా! సంహార మాయెను. ఇక మరలిరం" డని వెనుకకు దిరిగెను.

అది మొదలు పౌరాణికుడు శ్రీరామునకు కష్టము వచ్చినదను సంగతిని దెలుపు శ్లోకములను విడిచి చదువుచుండెను. ఒకనాడు రామాయణము చదువుచుండిన బ్రాహ్మణునకు పనియున్నందున అతడు తన కుమారుని బంపెను. ఈ రహస్య మెఱుగని ఆ బ్రాహ్మణుడు రామాయణమును జదువ నారంభించి ఆరణ్యకాండములో --

"జగ్రాహ రావణ స్సీతాం బుధః ఖే రోహిణీ మివ" ఆకాశములో సుఖముగ సంచరించుచుండు తల్లియగు రోహిణిని బుధుడు పట్టుకొనినట్లు రావణుడు సీతను పట్టుకొనెను అను ఘట్టమును జదివెను.

జగన్మాతను ఇతరు డెత్తుకొనిపోవుటయా, లేవరా యని కులశేఖరులు లంకకు బయలుదేఱెను. సముద్రము అడ్డము వచ్చినను నిజభక్తితో దిగిపోవుచుండిరి. అపుడు శ్రీరామచంద్రుడు సీతాలక్ష్మణుల తోడ దర్శనమిచ్చి నీవు వచ్చులోపలనే నేను వానిని సంహరించితి నని పలికి అంతర్ధా

నము చెందిరి. నేను ఆ రావణుని చంపదలచి యుంటిని. మా స్వామియే సంహరించిరట. అతడు సుఖముగ నున్నాడని తెలిసినదని తాను సుఖముగ నుండెను.

కులశేఖరులు సదా తిరుప్పావును అనుసంధానము చేయుచుండిరి. కులశేఖరులు ముం దవతరించిరి. ఆండాళమ్మ వెనుక అవతరించిరి. ఇది అసంభవము కాదా యనిన నెంత మాత్రము కాదు. శ్రీభూనీళాదేవులు నిత్యురాండ్రు. నిత్యురాలైన భూమియే ఆండాళుగ నవతరించిరి. వారిచేత రచింపబడిన ప్రబంధములును నిత్యమే. ఆమె తిరుప్పావును ఈ అవతారముననే చేసెనని తలంపరాదు. పూర్వమే యేర్పడియున్నది. అందుచే కులశేఖరులు తిరుప్పావు ననుసంధించుట అసంభవముగాదు.

రాజునకు వైష్ణవస్వాములయందు ద్వేషము పుట్టించవలెనని మంత్రు లాలోచించిరి. ఇట్లుండగా శ్రీరామనవమి యుత్సవము వచ్చెను. స్వామి కభిషేకము చేయునపుడు సకలాభరణములను తీసియించిరి. మరల నలంకరించునపుడు ఒక ముత్యాలహారము కనబడలేదు. భటులు కావలియుండినను ఆ యాభరణ మెటులో పోయెను. ఈ సంగతి తెలిసిన పిమ్మటనే స్వామికి పూజ జరుగవలెనని రాజు ఆజ్ఞాపించెను. ఇదే సమయమని హారమును దాచియుంచిన వారిలో ముఖ్యమంత్రి ముందుకు వచ్చి "ప్రభూ! ఆ హారమును దొంగిలించినది మీకు పరమహితులయి యుండిన యీ శ్రీవైష్ణవులే అని ఖైది చేసి యుంచిన స్వాములను జూపెను.

కులశేఖరులు పరమభాగవతోత్తములైన ఆ స్వాములను జూచి "నేను నమ్మను. పరమైకాంతులగు వీరితోడ బహుకాలముగ మెలగుచున్నాను. ఈ మాటను మీరెట్లనగలిగితిరి?" అనెను. ఇంత వైష్ణవపక్షపాతముండబట్టియే యింత యనర్థము తటస్థించెనని మంత్రు లనిరి.

"పేదవా రిందు రారు. వీ రీ కార్యము చేయరు. నే నొక యేర్పాటు చేసెదను" అని పలికి బుసకొట్టుచుండు నొక పామును దెచ్చి యొక

బిందెలో వేసి "వీ రీ కార్యము చేసిరని ఈ బిందెలో చేతి నుంచు" డని రాజు చెప్పగా మంత్రులట్లు చేయలేదు. "వీ రట్లు చేసియుండరని మీరు చేయియుంచు" డని వా రడుగగా కులశేఖరులు చేయివేసి పాము నెత్తి "మీరిట్లు చేయు" డనగా వారు పరుగెత్తిపోయిరి. కులశేఖరులు ఆ దుష్టులకు దండన విధించి, వైష్ణవులను విడిపించి "ఏ భాగవతులను భగవంతునికంటె హెచ్చుగ పూజించుచున్నానో, అట్టివారియందు దోషము కల్పించిరి. ఇక వీరితో సహవాసము కూడదని నిశ్చయించి తన పుత్త్రి డగు దృఢవ్రతునకు రాజ్యమొసగి ముఖ్యులగు కొందఱు స్వాములతో శ్రీరంగమునకు పోయి శ్రీరంగనాథుని సేవించి, శ్రీరంగనాథుని యందు అతిభక్తిగలదియు, నీళాదేవియొక్క అంశజురాలును అగు తన కొమార్తెను ఉదధారాపూర్వకముగ శ్రీరంగనాథునకు సమర్పించి తనకు గల సంపదను వరదక్షిణగ నిచ్చెను.

కులశేఖరు లిట్లు కొంతకాలము శ్రీరంగమున సుఖముగ నుండి పిమ్మట తిరుమల, కాంచి మొదలగు కొన్ని దివ్యదేశములకు పోయి ఆళ్వారు తిరునగరికి, పిమ్మట మన్నారు కోవెలకు పోయి శ్రీరాజగోపాల స్వామిని సేవించి తన అరువది యేడవ యేట అచటనే పరమపదము నొందిరి.

కులశేఖరులు ముకుందమాల యొనర్చి భక్తిలేని వారికి భక్తి గలిగించిరి. భక్తిరసము గల 'పెరుమాళ్ తిరుమొళి'ని రచించిరి. దానికి పెరియవాచ్చాంబిళ్ల వ్యాఖ్యానము వ్రాసిరి.

శ్రీకులశేఖ రాళ్వార్ తిరువడిగళే శరణమ్.

* * *

